యం దొకవైపున గుణకార భాగహారముల లెక్కలను, మఱియొకవైపున సంకలన, వ్యవకలన ఫలితములను దెలిసికొనవచ్చును.

వీని తరువాత 'టైప్‌రైటింగ్', 'గణనము'లు రెండును గలసి యుండు యంత్రములు కొన్ని యావిష్కారమందినవి. వానిలో ఎలిస్, ఎలియట్ ఫిషర్, హాప్‌కిన్స్, అండర్‌వుడ్ హాల్సర్ అను పేరులు కలవి పేర్కొనఁదగినవి. బార్బెల్ అనునతఁడు కనిపట్టిన యంత్రము అద్వితీయమై యున్నది. దీనియందలి టైపురైటింగు గుండీలును, గణనయంత్రపు గుండీలును అడుగుభాగమున కొక్కెముల ద్వారా కలుపఁబడి యున్నవి. సన్నని యుక్కుగుండ్ల మూలమున లెక్కల పరిగణనము జరగును. వాణిజ్యవ్యాపారసంబంధము లైన కార్యాలయములం దీయంత్రములవలనఁ గలుగు సాయ మింతని వచింప నలవికాదు. వేఱువేఱువ్యాపారములకుఁ జెందిన లెక్కలనుదరగతివారీగాఁ గూర్చి వానివివరములను సైతము దెలియఁజేయు యంత్రములు గలవు.

వీనివలన ఖాతాగ్రంథముల(Account Books, ledgers-etc) యవసరమే తప్పిపోయెను. జర్మనీయుద్ధము మొదలుకొని వాయుయానవిధ్వంసినుల (Anti-aircraft)యందును, కొన్ని నౌకాశతఘ్నీ శాలల(Naval Gunneries)యందును ఉపయుక్తములగు యంత్రములు గనుఁగొనఁబడినవి. ఇవి గాక జబాభా లెక్కల వివరములకును, తోళ్లను కొలతవేసి లెక్కవేయుటకును యంత్రములు గలవు. ప్రస్తుతము సముద్రతరంగముల నూచించి లెక్కింపఁ గల యంత్రముల యావిష్కరణమునకై ప్రయత్నములుఁ జరగుచున్నవి.

## అంకగణితచరిత్రాంశములు

ప్రాచీనకాలము :—ఇంతవఱ కంకగణితముయొక్క ముఖ్యసూత్రములను, పరికర్మములను వర్ణించుట యైనది. ఈప్రకరణమునందు వివిధజాతులవారిలో మొదటనుండి యంకగణిత మెంతవఱకు వృద్ధిఁ జెందినదియు సంక్షేపముగా వ్రాయఁబడును.

### ఫొనీషియనులు ; ఈజిప్షనులు

ప్రస్తుతము లభించిననిదర్శనములనుబట్టి ప్రపంచమునం దెల్ల నంకగణితశాస్త్రజ్ఞానమును సంపాదించినప్రాచీనజాతు లందఱిలోను మొట్టమొదటివారు ఫొనీషియనులు, ఈజిప్షనులు. ఫొనీషియనులు వాణిజ్యవ్యాపారములయం దసమానప్రతీతిఁ గాంచినవా రగుటచే వ్యావహారికాంకగణితమునందు మిక్కిలి కుశలు లైరి. కాని వారీశాస్త్రమునం దెంత పరిశ్రమఁ జేసినదియు నిర్ణయించుటకు వారు వ్రాసినగణితశాస్త్రము లేవియు మనకు దొరకలేదు. క్రీస్తుశకమునకుఁ బూర్వము ౧౪౯౧ వ సంవత్సరము ప్రాంతమున "కాడ్మసు" (Cadmus) అనుగ్రీసుదేశస్థుఁడు ఫొనీషియనులవలన నేర్చికొని యంకగణితమును తనదేశమునందు వ్యాపింపఁజేసెను.

ఫొనీషియనులవలెఁ గాక ఈజిప్షనులు జ్యోతిషశాస్త్రము కొఱకును, జ్యామితి లేక రేఖాగణితము (Geometry) కొఱకును అంకగణితము నభ్యసించిరి. ప్రస్తుతము నాగరకప్రపంచమునకు లభించిన ప్రాచీనగణితశాస్త్రగ్రంథములలో నెల్ల మిక్కిలి పురాతనమైనది యీజిప్టుదేశమున దొరకెను. ఇది రమారమి ౩౬౨౦ సంవత్సరముల క్రిందట "అహమీసు" (Ahmes) అను గణితశాస్త్రజ్ఞునిచే వ్రాయఁబడినది. ఈగ్రంథము క్రీస్తునకుఁబూర్వము ౩౦౦౦సంవత్సరములనాఁటి మఱియొక గ్రంథముయొక్క యనువాద మని గ్రంథకర్తయే వ్రాసికొనియుండెను. కాఁబట్టి యీజిప్షనులకు సుమారు ౫౦౦౦ సంవత్సరముల క్రిందటనే గణితశాస్త్రవ్యాసంగము గల దని స్పష్టమగుచున్నది. ఇప్పు డీగ్రంథము లండనుపట్టణమునందలి బ్రిటిషు మ్యూజియము (British Museum) యొక్క పుస్తకభాండాగారమునం దున్నది. ఇది నాలుగుప్రకరణముల గ్రంథము. అంకగణితమునకును, రేఖాగణితమునకును సంబంధించిన ప్రశ్నములును, వానికి సమాధానములును గలవు. ప్రశ్నములకు జవాబులుమాత్రమే కలవు గాని యీలెక్కలు వేయుమార్గములు నివేదింపఁబడి యుండలేదు.

మొదటిప్రకరణమున భిన్నాంకనిరూపణము (Fractional notation)ను, రెండవప్రకరణమున సంకలన, భాగహారవిధులును వానికుదాహరణములును, మూఁడవప్రకరణమున సమీకరణములు (Equations)ను, నాల్గవప్రకరణమునరేఖాగణితవిషయములును గలవు. ఈజిప్షనుల భిన్నాంకనిరూపణమునుగుఱించి యింతకుముందు వ్రాయఁబడినది. వీరిసంఖ్యాస్వరూపము మనదానివలె "దశాంకము" (Denary notation) గాకపోవుటయే గణితశాస్త్రాభివృద్ధి గాకుండుటకు ముఖ్యకారణ మయినది.

### గ్రీకులు

ఫొనీషియనుల, ఈజిప్షనులతరువాత గణితశాస్త్రము నభివృద్ధికిఁ దెచ్చిన ప్రాచీననాగరకజాతులలో గ్రీసుదేశీయులు ముఖ్యులు. కావున వారిగణితశాస్త్రజ్ఞులలో ప్రముఖులయొక్క గ్రంథములనుగుఱించి యించుక వ్రాయఁబడును.

ప్రాచీనలిఖితపూర్వకములగు నిదర్శనములనుబట్టి మొట్టమొదటి గ్రీకుగణితశాస్త్రజ్ఞుఁడు "థేల్సు"(Thales) అయినట్లు తేలుచున్నది. ఈయన క్రీస్తుశకమునకుఁ బూర్వము ౬౦౦ సంవత్సరముల క్రిందటివాఁడు. ఈయనగణితశాస్త్రగ్రంథము లేవియు మనకు లభింపలేదు.

థేల్సుతరువాతను పేర్కొనఁదగినగణితశాస్త్రజ్ఞుఁడు "పైథాగరస్" (Pythagoras) అనునతఁడు. ఇతఁడు వేదాంతశాస్త్రమునందుఁ గూడ మిక్కిలి గట్టివాఁడు. ఈయనవ్రాసిన గణితశాస్త్రగ్రంథమునందు నాలుగుభాగములు గలవు. ఇందు ముఖ్యముగ సంఖ్యాతత్త్వనిరూపణము (Theory of numbers) చర్చింపఁబడి యున్నది. సరి, బేసి, భాజ్యము, అవిభాజ్యము అనునాలుగువిధములగు భేదములే కాక స్వాభావికాంకములు, త్రికోణాంకములు (Natural and trigonal numbers) అని యితఁడు రెండుజాతులుగ నంకెలను విభ

జించెను. త్రికోణాకారముగ వ్రాయుటకు వీలు గల యంకెలు త్రికోణాంకము లనఁబడును.

ఉదా:— ఇందు ౨, ౩ స్వాభావికాంకములు. వీనికి సంబంధించిన త్రికోణాంకములు ౩, ౬ .

సంఖ్యాతత్త్వనిరూపణము గాక దామాషాయనఁబడు వ్యవహారములుగూడ నీగ్రంథమునం దున్నవి.

యూక్లిడ్ (Euclid) గ్రీకుగణితశాస్త్రజ్ఞులలో నొకఁడు. ఇతఁడు క్రీస్తుశకమునకుఁబూర్వము ౩౦౦ సంవత్సరముల నాఁటివాఁడు. ఈయన వ్రాసినరేఖాగణితమే యిప్పటికిని పాఠశాలలయందు బోధించుచున్నారు. రేఖాగణితమువిషయమున నితఁడు ౧౨ పుస్తకములు వ్రాసెను. అందు కొన్నిపుస్తకములు పరకృతి యైన వని ప్రతీతి కలదు గాని యివి కేవలము మిథ్యా నశించిన వనుకొను గ్రంథములు ప్రత్యేకముగ నంకగణితవ్యవహారములనుగూర్చి యుండుటచేత రేఖాగణితగ్రంథములలోనుండి తొలఁగించిరి. ఇందు రెండవపుస్తకమును, ఐదవపుస్తకమును, ఆఱవపుస్తకమునందలి కొన్నిభాగములును రేఖాగణితమునకు సంబంధించిన యంకగణితవిషయకములు. ౭, ౮, ౯, ౧౦ పుస్తకములు ప్రత్యేకముగ నంకగణితవిషయముననే వ్రాయఁబడినవి. అపవర్త్యాంకము, నిరుద్ధాంకము, సంఖ్యాతత్త్వనిరూపణము మొదలగువిషయము లీపుస్తకములందుఁ గలవు.

యూక్లిడ్ కాలముతరువాత "ఆర్కిమిడీసు" (Archimedes), "అపొలోనియస్" (Appollonnius), "ఇరటాస్తనీసు" (Eratasthenese) అనుగణితశాస్త్రజ్ఞులు ముఖ్యులు. ఆర్కిమిడీసువిషయమున వేఱొకసందర్భమున వ్రాయఁబడును. ఇరటాస్తనీ సనునతఁడు గ్రీకుల పంచాంగమును సంస్కరించి సరిచూచెను.

మాధ్యమికకాలము:—క్రీస్తుశకమునకుఁ బూర్వము సుమారు నూఱుసంవత్సరముల తరువాత వాఙ్మయమునందు అంకగణితమువిషయమున నేమియుఁ గానరాదు. క్రీస్తుశకము ౧౦౦ సంవత్సరముల తరువాత "నికొమాకస్" (Nichomachus) అను గ్రీకుగణితశాస్త్రజ్ఞుఁడు నాలుగుప్రకరణములు గల యొకగణితగ్రంథమును వ్రాసెను. ఈయన పైథాగరసుపద్ధతుల ననుకరించెను.

ప్రాచీనవిద్యాపీఠములలో నెల్ల మిక్కిలి ప్రసిద్ధిఁ జెందిన (ఈజిప్టుదేశమందలి) అలెగ్జాండ్రియాపట్టణమున జన్మించిన "డయఫాంటస్" (Diaphontus) అనునతఁడు గ్రీకుగణితశాస్త్రజ్ఞులలో కడపటివాఁ డని చెప్పవచ్చును. ఈతఁడు పైథాగరసును గురువునుగావించుకొని తనపుస్తకములను వ్రాసెను. ఈయనపుస్తకములు ముఖ్యముగ సంఖ్యాతత్త్వమునుగుఱించి వ్రాయఁబడినవి. ఇవి క్రీస్తుశకము ఆఱవశతాబ్దియం దాంగ్లేయభాషలోనికిని, తొమ్మిదవశతాబ్దియం దరబ్బీభాషలోనికిని భాషాంతరీకరింపఁబడెను. అప్పటినుండి ౧౫వ శతాబ్దియంతమువఱకును అంకగణితము పాశ్చాత్త్యదేశములయందు వృద్ధిఁ జెందలే దని చెప్పవచ్చును.

## హిందువుల యంకగణితము

అన్నిశాస్త్రములలోవలెనే హిందువులు అంకగణితములో సయితము చాలకాలముక్రిందటనే మిక్కిలి పరిశ్రమఁ జేసియుండిరి. హిందువులసంఖ్యాస్వరూపము (System of notation) తదితరజాతులవారిదానికంటె నెట్లు భిన్నమో, వానికంటె నిది గణితశాస్త్రవ్యవహారముల కెక్కువయుపయోగకర మగుటచేత నాగరకప్రపంచము నంతటిని నెట్లు శీఘ్రకాలమున నల్లుకొనెనో యిఁతకుముందు వ్రాయఁబడినది. క్రీ. శ. ౧౨వ శతాబ్దినాఁటికే హిందువుల నవీనాంకగణితసారము నంతయు గ్రహించిరి. మనదేశమున గణితశాస్త్రము లంత యభివృద్ధిఁ జెందుటకు మనసంఖ్యాస్వరూపమే ముఖ్యకారణ మని చెప్పుట కెంతమాత్రమును సందియము లేదు.

సంఖ్యావళియందు స్థానభేదమును, సంఖ్యలేనిచోట సున్న పెట్టుటయు, సంఖ్యాతత్త్వనిరూపణమునందు ధన, ఋణ (Positive and negative) సంఖ్యాభేదములును, కరణి వికరణ్యంక వివక్షయు (Rational & irrational quantitios) మొట్టమొదటను కనుఁగొనినవారు హిందువులు. తక్కినశాస్త్రగ్రంథములవలె వీరిగణితశాస్త్రగ్రంథములు గూడ పద్యరూపాత్మకము లై యున్నవి. ఇంతవఱకు మనకు లభించినవానిలో మిక్కిలి ప్రాచీనగ్రంథములవలన నప్పటికి హిందువులకు గణితశాస్త్రములయందు చక్కనిపరిశ్రమ గల దని స్పష్ట మగుచున్నది. నన్నయభట్టారకునిభారతమును జూచి యంతకుఁ బూర్వము పద్యకావ్యము లుండియుండవలె నన్నట్టు లీప్రాచీనగణితగ్రంథములనుబట్టి యంతకుఁ బూర్వమే గణితశాస్త్రగ్రంథము లుండవలెనని యొప్పుకొనక తప్పదు.

చరిత్రనుబట్టి చూడఁగా వేదాంగకాలమందు, అనఁగా క్రీస్తుపూర్వము ౧౫౦౦ మొదలు క్రీ. పూ ౮౦౦ వఱకు జరగినకాలమందు గణితశాస్త్రము హిందూదేశమునందు నభివృద్ధి యైనట్లు కానవచ్చుచున్నది. మొదట గణిత మభివృద్ధి నందినఁగాని జ్యోతిష మభివృద్ధి నందనేరదు. సుల్వసూత్రాదులనుబట్టి మనము రేఖాగణితమే కాక యంకగణితముకూడ కొంతవఱకు నభివృద్ధి నొందిన దని యూహింపవచ్చును. రెండుసంఖ్యలవర్గములు కలిపిన నదియు వర్గసంఖ్యయే యైన నట్టిసంఖ్యలను 'పైథాగరీయ' సంఖ్య లని పాశ్చాత్త్యు లందురు. పైథాగరసు పుట్టుటకుఁ బూర్వమే ఆర్యఋషు లిట్టిసంఖ్యలను కనిపట్టిరి!

సూత్రాదిగ్రంథములవల్లను గణితశాస్త్రాభివృద్ధి కొంతవఱకూహింపవచ్చును. క్రీ.పూ. అయిదవశతాబ్దిప్రాంతమునందలిశాసనముల వలన నప్పటివారి కంకగణితజ్ఞానమును, రేఖాగణితజ్ఞానమును గల వని తెలియుచున్నది (Bühler Indische Palaeographie, Strassburg—1896).

లలితవిస్తర మనుబౌద్ధగ్రంథమునందు శతకోటి మొదలుకొని, నూఱునూఱురెట్లధికముగ నీక్రిందిసంఖ్యలు చెప్పఁబడినవి; శతకోటి,

# అంకగణితము

(౧) బక్షాలిలో దొరకిన అంకగణిత గ్రంథములోని రెండుపుటలు. (౨)



## (౧)

. . . . . . . . . . ౩ . . . . . , . . .

. . . ⁞ ఉదా ‖ అజ్ఞాతరమ్యలోహస్య తృ ⎵ చతుఃపంచకాక్షయే | సప్త . . .

వింశతిపిణ్డస్య తృధాన్త శేష్యదృష్యతే | కిం సర్వం వద తత్వజ్ఞ క్షయంచ .

మకత్థ్యతాం ‖ ౧/౩ ‖ ౧/౪ ‖ ౧/౫ ‖ శే ౨౮/౧ ‖ కరణం | కృత్వా రూపక్షయంపాస్థ | ౨/౩ | ౩/౪ | ౪/౫ |

గుణితం జాతం | ౨/౫ | రూపక్షయం | ౩/౫ | అనేన శేషం భక్తం శేషం | ౨౮ | భ

. ౦ జాతం ౪౫ అస్య సప్తావింశ | పత్య శేషం ౧౮ ‖ ఏతత్క్షయం ‖ ఉదా ‖

. రిక్షీనస్య లోహస్య తృధాన్తం పంచమాశకం | నజ్ఞాయతేత్ప్రవృత్తికాంన

. . షప్రదృశ్యతే | ప్రవృత్తి శేషం యో పిణ్డం కేవలం వింశతిస్థితం | అ . .

. . . . . ౦ ప్రవృత్తీస్యా కిం వా శేషం వదశ్వమే ‖ ౧/౩ ‖ ౧/౪ ‖ ౧/౫ ‖ కృత్వా . . .

## (౨)

. . అనేనకాలేన సమధనా భవన్తి ‖ ప్రత్యయం త్రైరాశిక . . కృ . .

| ౫/౧ | ౩౦/౧ | ఫ ౫౦ |
|---|---|---|
| ౬ | ౩౦ | ౩౬ |

ప్రథమేద్వితీయస్యస్సప్తదత్తా | 7 | శేషం ౪౩ | ౪౩ | ౪౩ | ఏతే సమధనా జాతా ‖ ఉదా ‖

. జపుత్రోర్ద్వయోః కేచిన్నృపతిస్సేవ్యస్తద్వైః మేకాస్యాహ్న ద్వయష్ . .

. గా | ద్వితీయస్యదివర్ధకం | ప్రథమేన ద్వితీయస్య దశదీనార .

. త్తయాన్ కేనకాలేన సమతాం గణయిత్వా వదాశుమే ‖

. . ‖ ౩ ‖ దత్తం ౧౦/౧ ‖ కరణం ‖ అహద్రవ్యవిశేషంచ | తత్రా

. . . . ౨ | ౩ | ఫ . .

అయుతము, వియుతము, కంకరము, వివరము, అక్షోభ్యము, వివాహము, ఉత్సంగము, బహుళము, నాగబలము, తటిలంభము, వ్యవస్థానప్రజ్ఞప్తి, హేతుహిల, కరహు, హేత్వింద్రియము, సమాప్తలంభము, గణనాగతి, నిరవద్యము, ముద్రాబలము, సర్వబలము, విసంజ్ఞగతి, సర్వసంజ్ఞ, విభూతంగమ, తల్లక్షణ, ధ్వజాగ్రవతి, ధ్వజాగ్రనిషామణి, వాహనప్రజ్ఞప్తి, కురుత, సర్వనిక్షేపము, అగ్రసారము, పరమాణు, రజఃప్రవేశానుగతము (౧౨వ ప్రకరణము).

బుద్ధుని అర్జునుఁడను గణితశాస్త్రజ్ఞుఁడు పరీక్షించెననియు, నప్పుడాతఁడీపైనఁజెప్పిన పేళ్లు చెప్పెననియుఁ బైగ్రంథమునందున్నది. కల్పనాతీతమైనయంకెలకుఁ బేళ్లు పెట్టినవారి గణితజ్ఞానము సామాన్యమైనది కాదని చెప్పవలయునుగదా! పురాతనబౌద్ధగ్రంథములయం దింతకంటె నెక్కుడు సంఖ్యలుఁగూడఁ జెప్పఁబడినవి. ఇట్టి సంఖ్యలను లెక్కించుటకు మనము వాడెడు ౧౦ యను మూలసంఖ్య పనికిరాదు. అందులకు 'కోటి' యను సంఖ్యను మూలము (Radix)గాఁ దీసికొనవలెను. కో, కో$^{౨}$, కో$^{౪}$, కో$^{౮}$, కో$^{౧౬}$......కో$^{౨(౧౨౮)}$ యన్న సంఖ్యలకు వేలువేలుపేళ్లు పెట్టఁబడినవి! ఇందలి చివరయంకె కో$^{౨(౧౨౮)}$ యనునది యిట్లు వ్రాయుటవలనఁ జిన్నదిగాఁ గానవచ్చుచున్నది. కాని యది కల్పనాతీతము. ఒకకోటిలో ౧టిమీఁద నేడుసున్న లుండును. పరార్ధ మనుసంఖ్య వ్రాయవలయు నన్న ౧టి మీఁదఁ బదునేడుసున్నలు పెట్టవలయును. కాని కో$^{౨(౧౨౮)}$ సంఖ్య వ్రాయుటకు ౧టి మీఁద నెన్నిసున్నలు పెట్టవలయునో చెప్పుటకుఁ గావలసిన సంఖ్యలోనే ౮౦ సున్న లుండును!!!

౧౮౮౧ వ సంవత్సరమున పెషావరుజిల్లాలోని బక్షాలి యను గ్రామమున భూర్జపత్రములపై వ్రాయఁబడిన యంకగణిత గ్రంథ మొకటి భూమి త్రవ్వుచుండఁగా దొరకెను. మనకు లభించిన గణిత గ్రంథములలో నెల్ల నిదియే మిక్కిలి పురాతనమైన దనియు, ఇది క్రీస్తుతరువాత మూఁడు నాల్గు శతాబ్దుల ప్రాంతమునాఁటి దనియు కొందఱు శాస్త్రనిమర్శకుల యభిప్రాయము. కాని మఱికొంద ఱిది క్రీస్తుశకముపదునొకండవ, పండ్రెండవశతాబ్దులనాఁటిదెందురు. గ్రంథమంతయు ప్రాచీనశారదాలిపిలో 'గాథా'భాషను రచియింపఁబడినది. గ్రంథకర్త యెవరో తెలియదు.

ఈ పుస్తకములో భిన్నాంకము లెట్లు వ్రాయఁబడి యున్నవో "సంఖ్యాస్వరూప" మనుశీర్షికక్రింద నిదివఱకే తెలుపఁబడినది. గుణకారమునం దింతకుముందు వర్ణించినపద్ధతులకును, ఈ పుస్తకమునం దున్న పద్ధతులకును భేదము లేదు. సంకలనమునకు "యు" అనియు, సమీకరణమునకు "ఫ" అనియు గుర్తులు వాడఁబడియున్నవి. "యు" అనునది "యుత" (Summation) అను పదముయొక్కయు, "ఫ" అనునది "ఫల" (Result) అను పదముయొక్కయు మొదటి యక్షరములు. సంకలనము చేయవలసిన సంఖ్య లన్నియు ప్రత్యేకముగ నొక గదిలోఁ జేర్చి వ్రాసెడివారు. ఇట్లు ఫ ౧౨

| $\frac{౫}{౧}$ $\frac{౭}{౧}$ |

అనఁగా ఐదును ఏడును గలసి పండ్రెండైన దని యర్థము (౫+౭=౧౨). లెక్కలలో అవ్యక్తరాశిని (Unknown quantity) "శూన్య" మను మాటచేఁగాని "." అను చుక్కచేఁగాని తెలిపెడివారు. సున్నకుఁగూడ శూన్య మనుపేరు పర్యాయపదముగ వాడఁబడుచుండెను. ఇందు మఱియొక విశేషము కలదు. ఇప్పుడు పాశ్చాత్త్యులు ధనసంఖ్యకై వాడు + అనుగుర్తు ఈ గ్రంథమునందు ఋణసంఖ్యకు వాడఁబడి యున్నది. అప్పటి హిందువులకు త్రైరాశికము, వడ్డీలు, మిశ్రణము, కాలమానము, సంకలితశ్రేఢి (Arithmetical progression), గుణోత్తరశ్రేఢి (Geometrical progression) మున్నగు అంకగణిత వ్యవహారములు దెలిసిన ట్లీపుస్తకమువలన వెల్లడి యగుచున్నది.

## గణితశాస్త్రజ్ఞులు

ఆర్యభట్టుఁడు (క్రీ.శ. ౪౭౬):— ఈయన ఉత్తరహిందుస్థానమునందలి పాట్నా యను నామాంతరముగల పాటలీపుత్రమున నుండువాఁడు. ఇతఁడు నాలుగుప్రకరణములు గల 'ఆర్యభట్టీయ' మను గణితశాస్త్రగ్రంథమునకు కర్త. అందలి మూఁడవప్రకరణమునందు మాత్రము అంకగణితము, బీజగణితము, త్రికోణమితి అను వీని విషయమున వ్రాయఁబడినది. తక్కినమూఁడుభాగములును జ్యోతిషశాస్త్రమునకు సంబంధించినవి.

గణితవ్యవహారములయం దెల్ల "వ్యస్తవిధి" (Method of inversion) యం దార్యభట్టునకు ప్రవీణత గలదు. దీనివిషయమున "గుణకారము భాగహార మగును; భాగహారము గుణకార మగును; లాభము (సంకలనము) నష్ట మగును; నష్టము (వ్యవకలనము) లాభ మగు"నని యితఁడే వ్రాసియుండెను. అందుచేత దీనికి విలోమవిధి యని కూడ నామాంతరము గలదు.

'ఆర్యభట్టీయ' మను పేరఁ బరఁగునీతని గణితశాస్త్రమునకు 'భట్టప్రకాశము', 'ఆర్యభట్టదీపిక', 'సుధాతరంగము' అని మూఁడు వ్యాఖ్యానములు కలవు. వీనిలో మొదటిది సూర్యదేవ విరచితము. ఇందు, ఆర్యభట్టుఁడు ముప్పదిమూఁడు వత్సరముల ప్రాయమువాఁడై యుండినప్పుడు కలియుగము ౩,౬౦౦ ల సంవత్సరమున, అనఁగా క్రీ. శ. ౪౯౯ లో నీగణితశాస్త్రమును రచియించినట్లు వ్యాఖ్యాత తెలిపియుండెను. రెండవ దగు 'ఆర్యభట్టదీపిక' పరమాదీశ్వర విరచితము. మూఁడవదియు, 'ఆర్యభట్టసిద్ధాంతవ్యాఖ్యాన' మను నామాంతరము కలదియు నగు 'సుధాతరంగము'నకుఁ గర్త కోటికలపూఁడి కోదండరామసిద్ధాంతి. ఈవ్యాఖ్యానము లముద్రితములు.

బ్రహ్మగుప్తుఁడు (క్రీ.శ.౫౯౮):— ప్రాచీన గణితశాస్త్రజ్ఞులలో సంపూర్ణజ్ఞానమును సంపాదించి దానిని ప్రజలకొఱకై పుస్తకరూపమున మొట్టమొదట వెల్లడిచేసినవాఁడు బ్రహ్మగుప్తుఁడు. ఈయన క్రీ. శ. ౬౨౮ వ సంవత్సరమున, అనఁగా ముప్పదియేండ్లప్రాయమున బ్రహ్మస్ఫుటసిద్ధాంత మనుజ్యోతిషగ్రంథమును వ్రాసెను. ఇందు

రెండు ప్రకరణములు గణితశాస్త్రములవిషయమున వ్రాయఁబడినవి. అంకగణితభాగమునందు సంఖ్యానిరూపణమును, పరికర్మాష్టకమును, వడ్డీలు, దామాషాలు, కుట్టకము మొదలగు వ్యవహారములును గలవు. అభ్యాసముకొఱకు ప్రతిప్రకరణమునందు నుదాహరణములును గలవు. ఎనిమిదవశతాబ్దియంతమున నీగ్రంథము అరబ్బీభాషలోనికి తర్జుమా చేయఁబడినది.

**శ్రీధరాచార్య, పద్మనాభులు:**— బ్రహ్మగుప్తుని తరువాతను శ్రీధరాచార్యుఁడు, పద్మనాభుఁడు అను నిద్దఱు గణితశాస్త్రజ్ఞులు జనించిరి. వారికాలమును నిశ్చయముగా నిర్ణయించుటకు వీలు లేదు. శ్రీధరాచార్యుఁడు ప్రత్యేకముగా నంకగణితము విషయమున గణితసార మనుగ్రంథమును వ్రాసెను.

**మహావీరాచార్యుఁడు:**— ఈయన మైసూరురాష్ట్రమున తొమ్మిదవశతాబ్దియారంభమునం దున్నవాఁడు. జైనమతగురువు. గణితసార మనుగ్రంథమునకు సంగ్రహకర్త. ఇం దెనిమిదిప్రకరణములుగలవు. రేఖాగణితవిషయములును, క్షేత్రగణితవిషయములు (Mensuration) ను కొన్నియున్నను చాలభాగము అంకగణితవిషయములే చర్చింపఁబడినవి. ప్రతిప్రకరణమునందును ఉదాహరణము లనేకములుగ నున్నవి. ఈగ్రంథకర్త బ్రహ్మస్ఫుటసిద్ధాంతము ననుసరించి వ్రాసినను విషయము చర్చించుటయందు తనసొంతపాండిత్యమును అవిచ్ఛిన్నముగఁ జూపియుండెను. మొట్టమొదటి రెండుప్రకరణములలో సంఖ్యాస్వరూపమును, పరికర్మాష్టకమును, తరువాత భిన్నాంకవ్యవహారములును, మిశ్రవ్యవహారములును, చతురమితి, కుట్టకవ్యవహారములును, ఛాయాగుణకమును (Measurement of shadows) ప్రత్యేకముగ నొక్కొక్క ప్రకరణమున వర్ణింపఁబడినవి. పదొకొండవశతాబ్దినాఁటికి గ్రంథము కన్నడములోనికిని, తెలుఁగులోనికిని భాషాంతరీకరింపఁబడినది.

**భాస్కరాచార్యుఁడు:**— భాస్కరాచార్యుఁడు శా. శ. ౧౦౩౬ (క్రీ. శ. ౧౧౧౪) లో జన్మించెను. శా. శ. ౧౦౭౨ (క్రీ. శ. ౧౧౫౦) లో నితఁడు సిద్ధాంతశిరోమణిని రచించెను. ఇతఁడు శాండిల్యసగోత్రుఁడు, మహేశ్వరునిపుత్త్రుఁడు. సహ్యాపర్వతమునొద్ద విజ్జలవిడగ్రామమునం దున్నవాఁడు (చూడు: గోలాధ్యాయము). అక్బరుపాదుషాయొక్క యాజ్ఞ ననుసరించి క్రీ. శ. ౧౫౮౭ (శా. శ. ౧౫౦౯) లో నితనిసిద్ధాంతశిరోమణి పారసీకభాషలోనికి మార్చిరి. ఆగ్రంథమునం దితనిజన్మభూమి బెదర్ అని చెప్పఁబడియున్నది.

సిద్ధాంతశిరోమణి యనునది జ్యోతిషశాస్త్రసంబంధమైన యుద్గ్రంథము. ఇం దున్నపదునెనిమిదిప్రకరణములలో రెండు మాత్రము గణితశాస్త్రవిషయమైనవి. అందు 'లీలావతి' ముఖ్యముగ నంకగణితవిషయమైనది. రెండవది బీజగణితము. ఈయన తనకొమార్తె యగులీలావతికి నంకిత మిచ్చుటవలన అంకగణితమునకు నాపేరు గలిగిన దని వాడుక గలదు. కాని లీలావతిగణితములోని 'కాంతే', 'సఖి' యనుసంబోధనములవలన నీపేరుగలస్త్రీ యతనిపుత్త్రిగా నుండుటకు వీలు లే దని తోఁచెడిని. 'బాలే', 'వత్సే' అను సంబోధనములు కూడ నున్నవి. ఆమె తండ్రిని వదలి యత్తవారింటికి వెళ్లిన వెంటనే పితృమారకము సంభవించు నని జాతకమువలనఁ దెలిసికొని భాస్కరాచార్యుఁడు ఆమెకు వివాహము చేయుట మాని యంకగణితమును నేర్పె నని మనవారు చెప్పుకొనియెదరు. లీలావతి యంకగణితగ్రంథ మయినను బీజగణితవ్యవహారములును, రేఖాగణిత, క్షేత్రగణితవ్యవహారములునుగూడ నందుఁగలవు. ఇది బ్రహ్మస్ఫుటసిద్ధాంతము ననుసరించి వ్రాయఁబడినను దానికంటె నిం దెక్కువశాస్త్రపరిశ్రమమును, క్రొత్తసంగతు లనేకములును గలవు. లీలావతి నవీనపాశ్చాత్త్యగణితశాస్త్రగ్రంథముల కెందునను దీసిపో దని పాశ్చాత్త్యవిమర్శకులు పొగడియుండిరి. ఈకారణమునుబట్టియే లీలావతి మన దేశభాషలలోనికే కాక పాశ్చాత్త్యభాషలలోనికిఁగూడ తర్జుమా చేయఁబడినది. సంస్కృతభాషలోనే యనేకులు లీలావతికి వ్యాఖ్యానములు వ్రాసియుండిరి. మహీధరాచార్యవిరచితమైనవ్యాఖ్యానమును, నారాయణవిరచితమైన 'కర్మప్రదీపిక'యు, కేశవార్యతనూజుఁడైనగణేశునిచే రచియింపఁబడిన 'బుద్ధివిలాసిని'యు, రంగనాథవిరచితమైన 'లీలావతీవిలాసము' నిట్టివే. 'బుద్ధివిలాసిని' టీకలో భాస్కరాచార్యుఁడు 'జడవిడనగర'వాస్తవ్యుఁ డని తెలుపఁబడినది. ఈవ్యాఖ్యలన్నిటిలోను మహీధరాచార్యులవ్యాఖ్యానము చాలవఱకు వాడుకయం దున్నది.

హిందూదేశమునం దప్పుడు వివిధరాష్ట్రములలో వాడఁబడుచున్నమానములు మొదలుకొని పరికర్మాష్టకము, భిన్నవ్యవహారములు, సమీకరణములు, మిశ్రవ్యవహారములు, ఇష్టకర్మములు మొదలగు వానితోఁగూడ కుట్టకములవఱకును ఈగ్రంథమునందు సొంతముగ వర్ణింపఁబడినవి. ప్రతిప్రకరణమునందును ఉదాహరణములు కొల్లలుగా నున్నవి. కేవలము శాస్త్రీయాంకగణితమే కాక వ్యావహారికాంకగణితముగూడ మిక్కుటముగఁ గలదు. శూన్యపరికర్మమునందు మహావీరాచార్యుఁడు పొరపాటుపడెను. ఏదైన నొకరాశిని సున్నచే భాగించినప్పుడు లబ్ధము సున్న యగు నని యీజైనాచార్యుఁ డభిప్రాయపడెను. కాని భాస్కరాచార్యుఁ డట్లు కా దనియు, లబ్ధము అనంత మగు ననియు స్పష్టముగ వ్రాసెను. భాస్కరాచార్యుఁ డంతకుఁబూర్వపు గణితశాస్త్రజ్ఞులవలెఁ గాక లీలావతిని పద్యగద్యాత్మకముగ వ్రాసెను. గణితసూత్రము లన్నియు శ్లోకరూపముననను, వ్యాఖ్యానమునుమాత్రము గద్యరూపముననను వ్రాసియుండెను. భాస్కరాచార్యునిలీలావతియొక్క ప్రాముఖ్యమునకు మఱియొకకారణము గలదు. ఇందు పాశ్చాత్త్యులసిద్ధాంతములప్రకారము బీజగణితవ్యవహారములనుబట్టియే (సమీకరణములవలన) చేయఁదగినలెక్కలు కొన్ని కేవలము అంకగణితసూత్రములసాహాయ్యముచేఁ జేయఁబడియున్నవి. భాస్కరాచార్యుఁడు తనబీజగణితమునందు గణితవ్యవహారములకు గుర్తుల నిచ్చియుండెను. సంకలన వ్యవకలనములకు గుర్తు లింతవఱకుముందు తెలుపఁబడినవి. గుణకారమునకు "భ" యనియు, వర్గమూలమునకు "క" యనియు గుర్తులు. "భ" యనునది భావిత

మనుపదముయొక్కయు, "క" యనునది కరణి యనుపదముయొక్కయు మొదటి యక్షరములు. భాగహారమునకు భాజకము భాజ్యముయొక్క పైన వ్రాయుట సంకేతము. అవ్యక్తరాశిని "యావత్తావత్త" నెడివారు.

ఈదేశపుగణితజ్ఞులలో నితనిని మించినవారు లేరు.

జగన్నాథసమ్రాట్టు:— ఇతఁడు పదునెనిమిదవశతాబ్ది యారంభమం దుండినగొప్పగణితశాస్త్రవేత్త. రాజపుత్రస్థానమందలి జయపురసంస్థానమునకు రాజును, జ్యోతిర్విదుండును అగుజయసింహమహారాజు (౧౬౯౯-౧౭౪౩) నాస్థానమున పండితుఁడుగ నుండెను. ఇతఁడు అరబ్బీభాషాగ్రంథములనుండి సిద్ధాంతసమ్రాట్టనుదానిని, రేఖాగణితమును సంస్కృతమున రచించెను. ఈరెండు గ్రంథములకును అంకగణితముతో విశేషసంబంధము లేదు. కాని రేఖాగణితమన్న దానిలో నన్నియుఁ బదునైదు అధ్యాయములు కలవు. వానిలో ౭, ౮, ౯ వ యధ్యాయములయందు అంకగణితవిషయములే చర్చింపఁబడినవి. వానినిగుఱించి యిచ్చటఁ గొంచెము వ్రాయవలసియున్నది. రేఖాగణితమను నీసంస్కృతపుస్తకము యూక్లిడు (Euclid) గ్రంథమునకుఁ జేయఁబడినయరబ్బీభాషాంతరముయొక్క యనువాదము. అయినను గ్రంథకర్త యిది భాషాంతరీకరణ మనక బ్రహ్మచేఁ జెప్పఁబడిన శిల్పశాస్త్ర మని వ్రాసియుండెను:

> "శిల్పశాస్త్ర మిదం ప్రోక్తం బ్రహ్మణా విశ్వకర్మణే,
> పారంపర్యవశా దేత దాగతం ధరణీతలే.
> త ద్విచ్ఛిన్నం మహారాజజయసింహాజ్ఞయా పునః,
> ప్రకాశితం మయా సమ్య గ్గణకానందహేతవే."

ఇందు రేఖలకును, అంకములకును సంబంధము కలిపి అంకవిచారణ చేయఁబడినది. గ్రీకువారికి రేఖాగణితశాస్త్రమునందుఁ బ్రవేశ మెక్కువ, నమ్మక మెక్కువ. కావున అంకగణితసిద్ధాంతములను రేఖాగణితభాషలోఁ జెప్పినఁగాని వారికిఁ జక్కఁగ బోధపడవు. కావున ౭, ౮, ౯ అధ్యాయములలో నీవిచారణ చేయఁబడినది. అందలి విశేషము లిందు సంక్షేపముగఁ జూపింపఁబడును.

అంకములు, భేదములు [1] :—రూపసముదాయమున కంక మని పేరు. రూప మనఁగా నొకటి. ఈమతమున రూపమున కంకత్వము లేదు. కాని గణనాయోగ్యత్వమే అంకత్వమని వేఱుమతము కలదు. దాని ప్రకారము రూపమునకు (౧ టికి) గణనాయోగ్యత యున్నందున నంకత్వమున్నది. ఒకపెద్దయంకె చిన్నయంకచే నిశ్శేషముగ భాగింపఁబడిననాచిన్నయంకె పెద్దదానియంశ మనఁబడును. అంకములు రెండువిధములు—సమాంకములు, విషమాంకములు అని. దేనిభాగద్వయము సమానముగా నుండునో యది సమాంకము. అట్లు కానిది విషమాంకము. సమాంకమందు ఒకటి కలిపినను, తీసివేసినను విషమాంక మగును. సమాంకము సమసమ మనియు (Evenly even), సమవిషమ మనియు (Eevenly odd) రెండువిధములు. ౮ సమసమాంకము. ౬ సమవిషమాంకము. సమాంకములచే విభజింప లబ్ధము సమాంకముగా నిచ్చునవి సమసమములు. సమాంకముచే భాగింప లబ్ధము విషమాంకము నిచ్చునవి సమవిషమములు. విషమాంకమును విషమాంకముచే భాగింపఁగా లబ్ధము విషమాంకము వచ్చెనేని మొదటివిషమాంకమునకు విషమవిషమాంకము (Oddly odd number) అని పేరు. ౯ ని ౩ చే భాగింపఁగా ౩ వచ్చును. ఒకటిచేఁ దప్ప నితరసంఖ్యచే భాగము పోనియంకె ప్రథమాంకము (Prime number) నాఁబడును: ఉదాహరణము ౧౧. ఒకటిచేతను, ఇతరాంకములచేతను విభాగార్హమైనది యోగాంకము. ఇట్లే మిళితాంకము (Commensurable), భిన్నాంకము (Incommensurable), వర్గాంకము (Square number), ఘనాంకము (Cube nnmber), సజాతీయాంకములు (Proportional numbers) అని పెక్కుతెఱఁగులుగా నంకములు విభజింపఁబడినవి. పూర్ణాంక మని యొకభేదము చెప్పఁబడినది. ఏయంకము దానిని నిశ్శేషముగా భాగించునట్టి యన్నియంకెలకూడికవలన సిద్ధించునో యది పూర్ణాంకము: ఉదాహరణము ౬. ఇది ౧, ౨, ౩ అను అంకెలచే నిశ్శేషముగ భాగింపఁబడును. ఈమూఁటిని గూడిన ౬ అగును: $౧ + ౨ + ౩ = ౬$. ఇట్టిదే యింకొకటి ౨౮. ఇది ౧, ౨, ౪, ౭, ౧౪ లచే నిశ్శేషముగ భాగింపఁబడును. వీనిని గలిపిన ౨౮ సిద్ధించును.

ఇందలి పదవయధ్యాయమునం దొకరేఖ వర్ణింపఁబడియున్నది. దాని కంకసంజ్ఞార్హరేఖ అని పేరు. దీనికిని అంకెలకును సంబంధమున్నందున నిచ్చట దీనినిగుఱించి కొంచెము చెప్పవలసియున్నది. ఒకసరళరేఖను (Straight line) గీయుఁడు. ఒకటి యని చూపెడు మానమును ఒకదానిని తీసికొనుఁడు. ఈమానము అంగుళముగను ఉండవచ్చును, అందలియంశముగను ఉండవచ్చును. సరళరేఖమీఁద నొకనిశ్చితబిందువును గుర్తించుకొన్నయెడల నాబిందువునకుఁ గుడివైపునఁగాని, యెడమవైపునఁ గాని మనమానముతో ౧, ౨, ౩ అని మనయిష్టమునకు వచ్చినన్నిపర్యాయములు కొలచుకొనుచుఁ బోవచ్చును. ఈపాడువుయొక్క యొకచివర నొకబిందు వుండును. ధనసంఖ్య చూపుటకు ఈకొలత కుడివైపునకుఁ గొలచినయెడల నెడమవైపున

[1] అంకో నామ రూపాణాం సముదాయః । తన్మతే రూపేఽఙ్కత్వాభావః । అన్యే తు గణనాయోగ్య మంకం వదంతి, తన్మతే రూపేఽప్యంకత్వ మస్తి గణనాయోగ్యత్వాత్ । యత్ర లఘ్వంకో బృహదంకా దసకృత్ శోధితః సన్ బృహదంకో నిశ్శేషస్స్యాత్ తదా లఘ్వంకో బృహదంకస్యాంశోఽస్తి । యస్య భాగద్వయం సమానం భవతి స సమాంకో జ్ఞేయః। యస్య భాగద్వయం సమానం నభవతి స విషమాంకో జ్ఞేయః । సమాంకో య ద్యేకేన హీనోఽధికో వా భవతి సోఽపి విషమాంకో జ్ఞేయః । సమాంకో ద్వివిధః । ఏకః సమసమః ౮. ఏకః సమవిషమః ౬. సమసమో యథా । సమాంకః సమేన హ్రియమాణః సమలబ్ధిః ప్రాప్యతే స సమసమః । యః సమాంకః సమేన హ్రియమాణః విషమా లబ్ధిః ప్రాప్యతే స సమవిషమో జ్ఞేయః । అథ విషమవిషమాంకలక్షణమ్ । విషమాంకో విషమేణ హ్రియమాణః విషమా లబ్ధిః ప్రాప్యతే స విషమవిషమాంకః । యథా నవాంకః (౯) విభక్తః త్రయం ప్రాప్యతే । యోఽంకో రూపాతిరిక్తాంకేన నిశ్శేషో న భవతి స ప్రథమాఽంకో జ్ఞేయః । యథైకాదశాంకః.

ఋణసంఖ్య లగును. ఇట్లు కూడినపుడు మనమానముతో నొకటి, రెండు అని కొలచుకొనుచుఁ బోయినకొలఁదిని ఒక్కొక్కసంఖ్య పూర్తియైనచోట నొక్కొక్కబిందు వేర్పడును. ఇట్లేర్పడు బిందువులచే నాక్రమింపఁబడినది యంకసంజ్ఞార్హరేఖ. కాని యీరేఖమీఁది ప్రతి బిందువునకును సరిపోవునట్టిసంఖ్య యుండునా? ఉండదు. ఉదాహరణార్థము—ఒకటి బాహువు (Side)గాఁగల సమచతుర్భుజము నిర్మించి దానిబాహువునే మానముగాఁ దీసి కొలచినయెడల దానికర్ణమునకు (Diagonal) సరిపోవునట్టి సరియైనసంఖ్య లేదు. కాని యీకర్ణమంత పొడువు మనసరళరేఖమీఁద గుర్తు పెట్టవచ్చును. కావున ఆబిందువునకు సరియైనసంఖ్య లేదు. కావున నది యంకసంజ్ఞార్హరేఖ కాదు. ఇట్టియంకములను కరణీసంఖ్యారేఖ (Irrational) లనియెదరు. ఈగ్రంథమునం దంకెలనుగుఱించి యనేకక్షేత్రములు (Propositions) సాధించియుండెను. ఉదాహరణమునకై రెండు క్షేత్రముల నిచ్చెదము.

౧౬వ క్షేత్రము:— నాలుగంకములలో మొదటిదాని, రెండవదాని నిష్పత్తి మూఁడవదాని, నాల్గవదాని నిష్పత్తితో సమానమగునేని ఆయంకములను మార్చిన మొదటిదాని, మూఁడవదాని నిష్పత్తి రెండవ, నాల్గవదాని నిష్పత్తితో సమాన మగును.

ఎట్లన, అబ నిష్పత్తి జద నిష్పత్తితో సమాన మనుకొనుఁడు. అప్పుడు అజ నిష్పత్తి బద నిష్పత్తితో సమాన మగును.

అ.. జ......

బ... ద.........

దీనియుపపత్తి (Proof):

అ బలో నెన్నవయంశమో (బకంటె నెన్నిరెట్లో) జ కూడ దలో నన్నవయంశమే (లేక దకంటె నన్నిరెట్లు పెద్దది). ఈరెంటి సంబంధమునకు వ్యత్యాసము కల్పించినప్పుడు అ జలో నెన్నవయంశమగునో (లేక జ కంటె నెన్నిరెట్లు పెద్దదియగునో) బ దలో నన్నవయంశము (లేక అన్నిరెట్లు పెద్దది) అగును. కావున అ జల నిష్పత్తి బదల నిష్పత్తితో సమము. ఇదియే మా కిష్టము.

౨౫వ క్షేత్రము:— ఒకయంకము ద్వితీయాంకముచే శేషము లేకుండ భాగింపఁబడినయెడల మొదటియంకముయొక్కవర్గముకూడ రెండవయంకముచే నిశ్శేషముగా భాగింపఁబడును.

ఎట్లన, అ బచే నిశ్శేషముగా భాగింపఁబడును. జ అయొక్కవర్గ మనుకొనుము. జ బచే నిశ్శేషముగ భాగింపఁబడును.

అ.. ద.. బ... జ....

దీనియుపపత్తి:

అ అంకముతో సమాన మైన ద అను అంకము నొకదానిని కల్పించుకొనుము. కావున అ దలు రెండును బచే భిన్నములు. అ దల ఘాతము (గుణకారము) జతో సమానము కావున జ కూడ బచే నిశ్శేషముగ విభాజ్యము.

హిందూజ్యోతిశ్శాస్త్రజ్ఞు లందఱును గణితశాస్త్రవిదులే. కావున జ్యోతిశ్శాస్త్రచరిత్ర వ్రాయునప్పుడు వారియెల్లరజీవితములు వర్ణింపఁబడును.

## హిందువులగణితశాస్త్రప్రాముఖ్యము

హిందువులగణితశాస్త్రజ్ఞానమునకు విదేశీయు లెంతవఱకు తోడుపడిరని యడుగవచ్చును. ఈవిషయమున పాశ్చాత్త్యు లేకగ్రీవముగ హిందువులు తమస్వశక్తిమూలముననే గణితశాస్త్రముల నభివృద్ధిఁ జేసిరని వ్రాసియుండిరి. హిందూగణితశాస్త్రజ్ఞులలో భాస్కరాచార్యుఁడు కడపటివాఁడని చెప్పవచ్చును. ఈతనితరువాత హిందూదేశమున గణితశాస్త్రము లభివృద్ధిఁ జెందకపోవుటయేకాక సమసిపోయిన వని కూడ చెప్పనొప్పును: అనఁగా పండ్రెండవ శతాబ్దియంతమునకే హిందువుల గణితశాస్త్రచారిత్రము సమాప్తిఁ జెందిన దనవచ్చును. ఈకాలమునాఁటికి పాశ్చాత్త్యులలో నవీనాంకగణితాంకురములు పొడసూపనైనను లేదు. ఇట్టిసందర్భముల హిందువులకు పాశ్చాత్త్యులు తోడుపడిరనుట యసంభవము.

గణితశాస్త్రాభివృద్ధికి ముఖ్యకారణ మైనదశమాంశరాశినిరూపణమును, శూన్యనిర్మాణమును హిందువులే మొట్టమొదట కనుఁగొనిన విషయ మిదివఱకే తెలుపఁబడినది.

ఇచ్చట నొకవిశేషము చెప్పవలసి యున్నది. దశమాంశపద్ధతి హిందూదేశమునం దున్నట్టు స్పష్టముగా నాధారము లేదని కొందఱు చెప్పెదరు. కాని క్రింద నుదాహరింపఁబడినవేదవాక్యమును, పతంజలికృతయోగసూత్రముమీఁది వ్యాసభాష్యమునందలి వాక్యమును జూచినచో నెవ్వరికిని సంశయ ముండఁగూడదు:

"ఏకా చ దశ చ దశ చ శతం చ శతం చ
సహస్రం చాయుతం చాయుతం చ నియుతం చ
నియుతం చ ప్రయుతం చార్బుదం చ న్యర్బుదం చ
సముద్రశ్చ మధ్యం చ అన్తశ్చ పరార్ధః"

—వాజసనేయసంహిత, ౧౭-౨.

"యథా ఏకా రేఖా శతస్థానే శతం దశస్థానే దశ ఏకం చైకస్థానే" —[3వ పదము ౧౩వసూత్రముమీఁదిభాష్యము]

క్రీస్తుశకము ఎనిమిదవ, తొమ్మిదవ శతాబ్దులయం దరబ్బులు హిందువులగణితశాస్త్రముల నభ్యసించి వారిగ్రంథములను తమభాషలోనికి తర్జుమా చేయించిరి. తరువాత అరబ్బులు యూరోపుఖండమును ఇటలీ, స్పెయినుదేశములందుఁ బ్రవేశించినప్పుడు పాశ్చాత్త్యులు అరబ్బులవలన గణితశాస్త్రజ్ఞానమును సంపాదించిరి. పదుమూఁడవ శతాబ్దినాఁటికి హిందువులగణితశాస్త్రపద్ధతులు యూరోపుఖండమున సమగ్రముగ వ్యాపించెను. ఇందులకు తార్కాణముగ పదునాలుగవ, పదునైదవశతాబ్దులలో పాశ్చాత్త్యులు వ్రాసినగణితగ్రంథములయందు

మనవారు అనాదినుండి చేయుచున్న లెక్కలు కొన్ని గలవు. ఇట్టి లెక్కలు రెం డింతకుముందు దెలుపఁబడినవి. అట్టిలెక్కలలో మఱియొకదాని నిచ్చటఁ బొందుపఱిచి యీవిషయ మింతట ముగింపఁబడును. తొమ్మిదిగళ్లలో వేసినయంకె వేయక యెటు కూడినను ౧౫ వచ్చులాగు సమకూర్చ మనునొకగణితసమస్య మనలో ననుశ్రుతముగ వచ్చుచున్నది. ఇందుల కొకసూత్రమును గూడ మనవారు వ్రాసియుండిరి.

"క. ఆఱు నొకెక్కటి యెనిమిది
సారసముగ నేడు నైదు సరసను మూఁడున్
క్షీరాబ్ధి రెండు తొమ్మిది
శ్రీరామా! కడమనాల్గు శ్రీరఘురామా!"

| ౬ | ౧ | ౮ |
|---|---|---|
| ౭ | ౫ | ౩ |
| ౨ | ౯ | ౪ |

ఈలెక్కయే పదునైదవశతాబ్దియందు పాశ్చాత్యగణితజ్ఞులచే వ్రాయఁబడిన యొక పుస్తకమునందుఁ గలదు. ఇట్టిదృష్టాంతములనుబట్టి హిందువులు తమగణితశాస్త్రములను పాశ్చాత్త్యులవలన నేర్చిరనుటకంటె వారికే చాలవఱకు హిందువులు తోడ్పడి రనుట సహేతుకముగ నుండును.

## ఆంధ్ర గణితశాస్త్రజ్ఞులు: గణితములు

పావులూరి మల్లన్న :—పైనఁ జేర్కొనిన గ్రంథము లన్నియు సంస్కృతభాషను వ్రాయఁబడినవి. ఆంధ్రమున స్వతంత్ర గ్రంథములు లేకపోయినను పైగ్రంథములయొక్క భాషాంతరీకరణము లున్నవి. వీనిలో మిక్కిలి ప్రాచీనమయినది పావులూరిగణితము. ఇది మహావీరాచార్యుని గణితసారసంగ్రహముయొక్క భాషాంతరీకరణము. గ్రంథకర్త పావులూరి మల్లనామాత్యుఁడు. ఇతఁడు పదునొకండు లేక పండ్రెండవశతాబ్దియారంభమున నున్నవాఁడు. గోదావరీమండలము నందలి పావులూరుగ్రామమునకుఁ గరణము. ఇది స్వతంత్రగ్రంథము కాకపోయినను పద్ధతులుమాత్రమే మహావీరాచార్యునివి. లెక్కలన్నియు మల్లనార్యుఁడు సొంతముగఁ గల్పించెను. ఈగ్రంథము యొక్క అసంపూర్ణమైనప్రతులుమాత్రము లభించినవి.

వల్లభామాత్యుఁడు:—ఇతఁడు పదునాఱవశతాబ్దియాదినున్నవాఁడు. కృష్ణదేవరాయలకును, అచ్యుతరాయలకును సామకాలికుఁడైన బొమ్మలాట కాళఁడనువాని ప్రార్థన నంగీకరించి లీలావతి గణితమును తెలుఁగుపద్యములుగఁ జేసెను. ఈసంగతు లీక్రిందిపద్యము వలనఁ దెలియఁగలవు :—

"ఉ. శ్రీనరసింహనందను నరిందమవిక్రముఁ గృష్ణరాయభూ
జానిని వెండియుం దదనుజన్ముని నచ్యుతదేవరాయనిన్
దా నధికాప్తుఁడై కొలిచి తద్దయు మన్నన గాంచి మించువి
ద్యానిధి బొమ్మలాట విరుపాధిపు కాళనిప్రార్థనంబునన్."

ఈ వల్లభామాత్యుని గ్రంథము సంపూర్ణముగ దొరకకపోయినను దొరకినంతవఱ కిది చక్కనిభాషాంతరముగఁ గానవచ్చుచున్నది. మహావీరాచార్యులవారి 'గణితసారసంగ్రహము'ను ఒకవల్లభామాత్యుఁడు తెలుఁగునందును, కన్నడమునందును వ్రాసినట్లు కన్నడ గ్రంథమువల్లఁ దెలియుచున్నది. కాని ఆవల్లభామాత్యుఁడును ఈవల్లభామాత్యుఁడును వేఱువేఱువారైనట్లు తోఁచుచున్నది.

ఎలుగంటి పెద్దనార్యుఁడు :—ఇతఁడు ప్రకీర్ణగణితమను పేర భిన్నరాశివ్యవహారములనుగుఱించి యొకగ్రంథమును వ్రాసెను. దీనికాలమును స్పష్టముగ నిర్ణయించుట కాధారములు లేవు.

తడకమళ్ల కృష్ణరావు:—ఇటీవల గణితశాస్త్రములను దెనిఁగించినవారిలో తడకమళ్ల కృష్ణరావుగారు ముఖ్యులు. ఈయన చెన్నపురవాస్తవ్యుఁడు. గోలకొండవ్యాపారి. నలువదిసంవత్సరముల క్రిందటివాఁడు. ఈయన లీలావతిని భాషాంతరీకరించి రేఖాగణితమును, బీజగణితమును నవీనపద్ధతుల ననుసరించి వ్రాసెను.

సూత్రగణితము:—ఈ పేరుగల గణిత మొకటి కానవచ్చుచున్నది. కాని సంపూర్ణమైనప్రతి దొరకనందున గ్రంథకర్త యెవరైనది చెప్పుటకు వీలు లేదు. ఇందు నొక లెక్క చెప్పుచుఁ బ్రతాపరుద్రుని వర్తకసంబంధమైనచట్టములను సూచించుచు వ్రాయుటవలనను, 'ప్రతాపపరిభాష' యని వ్రాసి యీక్రిందిపద్యము వ్రాసినందునను ఈగ్రంథము ప్రతాపరుద్రునికాలమందో లేక యతనిప్రభుత్వము పోయినతరువాత నూఱు, రెండునూర్లసంవత్సరములలోపలనో వ్రాయఁబడి యుండు నని యూహింపవలసి యున్నది.

ప్రతాపపరిభాష

"క. గిరు లొక్కనాల్గు మా యను
నరయఁగ నవి వేదసంఖ్య యగు చవి లెనఁగా
ధర నాల్గుచవిలె లైనను
బరువడిని ప్రతాపమాడ బాగుగ నయ్యెన్."

వేంకటేశగణితము:—ఈ పేర నొకగణితము కలదు. ఇది సంపూర్తిగ దొరకనందున గ్రంథకర్త పేరు తెలియలేదు. ఇందుఁ గొన్ని పద్యములు మహావీరాచార్యునిగణితమునుండి తెలిఁగింపఁబడినవి. మిగిలినవి గ్రంథకర్తచే స్వతంత్రముగ వ్రాయఁబడినవి.

ఈగ్రంథము లన్నిటను లీలావతి తప్పఁ దక్కినవానిలో లెక్కలును సూత్రములునే కాని వానికి న్యాసములు లేవు. భాషాంతరీకరణములు గూడ మాతృకల ననుసరించియే యున్నవి. పావులూరి గణితమునందలి ఈక్రింది యుదాహరణమువలన నీవిషయము స్పష్టము కాఁగలదు.

లెక్క :—

"సీ. అర్చకుం డొకఁడు దివ్యాబ్జముల్ గొనివచ్చి
మూఁడచ్యుతస్థానమునకుఁ జేర్చి
తొలిదేవళంబుమంగలికొలంకునఁ దోఁగఁ
జేతిపువ్వులు యథాస్థితిఁ దలిర్చ

నందుఁ గొన్నిటిని దైత్యారికి నర్పించి
కడమ వాగుడితటాకమున ముంపఁ
దత్స్థానములు రెట్టఁ దనరఁ బూర్వపురీతి
నర్పించి యవలికోశంబువలనఁ (?)

గీ. ద్విగుణ మైన మొదలితీరునఁ బర మేశుఁ
బూజ నేసి మిగులుపూలు గుళ్ల
మూఁట రెంట నొకట మొగి వృద్ధిగా నుంచెఁ
దొలుత నెన్ని దెచ్చెఁ దోయజములు?"

పుష్పములమొత్తము ౧౧౧. ఇందులకు సూత్రము —

"క. తిర మగు ప్రసూనవృద్ధులు
వరుసను లిఖియించి యంశవర్గంబుఁ బర
స్పరగుణితం బైనను గనఁ
బరఁగుం బూజాప్రసూనపటలం బనఘా!"

ఆధునికనవీనాంకగణితసార మిదివఱకే చెప్పఁబడినది. ఆధునికాంకగణితాభివృద్ధికి ముఖ్యకారణములు మూఁడు గలవు. ఇందు దశమాంశసంఖ్యానిరూపణమును, శూన్యకల్పనమును మొదటివి. ఈ రెండును హిందువులే లోకమునందలి యన్నిజాతులవారికిని ఇచ్చిరి. రెండవది దశమాంశభిన్నరాశి (Decimal notation). ఈ రెంటినిఁగూర్చి యింతకుముందు సవిస్తరముగ వ్రాయఁబడినది. మూఁడవది "లఘుగణితపద్ధతి" (Logarithms). దీనిని మనవారు కొందఱు 'లాగరిథ' మనియే వాడుచున్నారు. దీనివలన గుణకార, భాగహారములను సంకలన, వ్యవకలనములుగ మార్చవచ్చును. అందుచేత పరికర్మాష్టకవ్యవహారములు సులభసాధ్యములై గణితశాస్త్రాభివృద్ధికిఁ దోడ్పడును. లఘుగణితమునుగూర్చి ప్రత్యేకముగ నొకశీర్షిక క్రింద వ్రాయఁబడును.

వే. వి. శ.

## అంకగణిత పరిభాష *

Addition సంకలనము, కూడిక, సంకలితము, యోగము, యుతి
Alligation మిశ్రగణితము, సువర్ణగణితము
Approximate ఆజమాసు, రమారమి
Arithmetic అంకగణితము, వ్యక్తగణితము, పాటీగణితము
,, mean అంకగణితమధ్యమానము
Arithmetical progression అంకశ్రేఢి (శ్రేణి)
Term పదము, ధనము
First Term ఆదిపదము, ముఖపదము
Middle Term మధ్యపదము
Last Term అంత్యపదము
Number of terms గచ్ఛము, పదసంఖ్య
Common difference చయము
Sum of the series సర్వధనము, పదసంకలనము
Assimilation of fractions అంశసవర్ణము, భాగజాతి
Brokerage కాయదా, దలాలి
Capital మూలధనము, పెట్టుబడి
Co-efficient గుణకసంఖ్య, గుణకము
Combinations అంకయోగములు
Common Denominator సమచ్ఛేదము
Common measure సామాన్యాపవర్తకము, సామాన్యప్రమాణము
Common Multiple సామాన్యాపవర్త్యము, సామాన్యనిరుద్ధాంకము, నిరుద్ధాంకము, గుణిజము
Compound Interest చక్రవృద్ధి, వడ్డీకి వడ్డి
Cube ఘనము
Cube root ఘనమూలము
Decimal దశమాంశము
Denominater హారము, హరము, ఛేదము
Difference అంతరము
Digit అంకము
Dividend భాజ్యము
Division భాగహారము
Divisor భాజకము
Equation సమీకరణము
Evolution మూలక్రియ, ఘాతమూలకర్మ
Exchange వినిమయము
Fraction భిన్నము, అపూర్ణము, కలాసవర్ణము
,, Complex మిశ్ర
,, Compound సంయుక్త
,, Continued వితత
,, Improper విషమ, అపసవ్య
,, Mixed భాగానుబంధ, మిశ్ర
,, Proper సవ్య, సమ
G. C. M. (మహత్తమ, గరిష్ఠ, సామాన్య) అపవర్తకము, గరిష్ఠసామాన్యప్రమాణము
Geometrical Progression గుణోత్తరశ్రేఢి
Common ratio గుణోత్తరము, గుణోత్తరచయము

* తెలుఁగున నీకమీఁదఁ బుట్టఁబోవుశాస్త్రగ్రంథముల యుపయోగమునకై విజ్ఞానసర్వస్వమునందు ముఖ్యశాస్త్రములకు సంబంధించినవ్యాసములకుఁ జివర ఆయాశాస్త్రములందలి పరిభాషను జూపుపదములపట్టిక యియ్యఁబడును. వీరాచార్యకృత గణితసారసంగ్రహము, భాస్కరాచార్యునిలీలావతి, పావులూరిగణితము, జగన్నాథసమ్రాట్టు నిరేఖాగణితము లయందలి యంకగణితసంబంధమైన ౭, ౮, ౯, ౧౦ అధ్యాయములు, నాగరీప్రచారిణీసభవారి శాస్త్రీయపదసమూహము (The Hindi Scientific Glossory), ప్రొఫెసర్ రానడేగారిచే సంపాదితమైన ట్వంటియెత్ సెంచరీ డిక్షనరీ (Twentieth Century Dictionary), ప్రిన్సిపాల్ పరాంజపేగారు వ్రాసిన 'సంఖ్యేచీ కల్పనా' యన్నవ్యాసమును చూచి యీ యంకగణితపరిభాష నిర్ణయింపఁబడినది.

Harmonic Progression హారాత్మకశ్రేఢి, సమస్వరశ్రేఢి
Index ఘాతసూచి, సూచి
Infinity అనంతరాశి, ఖహరము
Interest వడ్డి
Inversion వ్యస్తవిధి, విలోమవిధి
Involution ఘాతక్రియ
L. C. M. (లఘుతమ, సామాన్య) అపవర్త్యము కనిష్ఠ
Measure అపవర్తకము, ప్రమాణము, భాజకము [సామాన్యగుణిజము
Multiple అపవర్త్యము, భాజ్యము, గుణిజము
Multiplicand గుణ్యము
Multiplication గుణకారము, హెచ్చువేత
Multiplier గుణకము
Notation అంకనపద్ధతి, అంకసంకేతము, సంఖ్యాలేఖనము
Numeration సంఖ్యావాచనము, సంఖ్యను చదువుట లేక శబ్దము
Number సంఖ్య, రాశి, అంకము [లతో వ్రాయుట
,, abstract నిరుపాధిక, సామాన్య
,, amicable యుగళాత్మక
,, articulate ఉచ్చార్య
,, cardinal సంఖ్యార్థము
,, commensurable మిత
,, composite గుణజ
,, compound యుక్త
,, concrete సోపాధిక, పరిగణిత, వ్యావహారిక
,, even సమ, సరి
,, evenly even సమసమ
,, evenly odd సమవిషమ
,, figurative సంకలిత
,, incommensurable భిన్న
,, irrational కరణి
,, mixed మిశ్ర
,, natural ఏకాదిక్రమ
,, negative ఋణ
,, odd విషమ, బేసి
,, oddly odd విషమవిషమ
,, perfect పూర్ణ, నిధి
,, polygonal బహుభుజాకార
,, positive ధన
,, prime ప్రధాన, ప్రథమ
,, proportion సజాతీయ
,, rational మూలక, సమూలక
,, triangular త్రిభుజాకార
,, whole అభిన్న, పూర్ణ
Operations పరికర్మములు
Par సరాసరి
Partnership భాగస్వామ్యము
Permutations అంకపాశవ్యవహారము
Factorial ఏకాదిచయాంకఘాతము
Purchase and sale క్రయ విక్రయము
Power ఘాతము
2nd Power వర్గము, ద్విఘాతము
3rd Power ఘనము, త్రిఘాతము
4r th Power చతుర్ఘాతము
Practice వ్యవహారగణితము
Premium త్రోపుడు, అడతి
Profit and loss లాభనష్టములు
Proof ఉపపత్తి
Progression శ్రేణి, శ్రేఢి
Proportion యుగ్మనిష్పత్తి, అనుపాతము
Quotient లబ్ధి, లబ్ధము
Ratio నిష్పత్తి
Recurring decimal ఆవర్తదశమాంశము
Remainder శేషము
Result ఫలము
Root మూలము
4rth root చతుర్మూలము
Rule of Three త్రైరాశికము
,, Double Rule of Three పాంచరాశికము
,, Inverse Rule of Three వ్యస్తత్రైరాశికము
,, First term, measure, or argument ప్రమాణము
,, Second term, demand or requisition ఇచ్ఛ
,, 3rd term ఫలము
,, 4r th term or answer ఇచ్ఛాఫలము
Square వర్గము
Square root వర్గమూలము
Sub-division of a fraction ప్రభాగము
Subtraction వ్యవకలనము, వ్యవకలితము, వ్యుత్కలితము, శోధక, పతనము, తీసివేత
Supposition ఇష్టకర్మము
Surd కరణి
Stock నిలువ, రాశిమొత్తము
Unit రూపము
Working న్యాసము

**అంకచక్రము** — మదరాసు రాజధానియందలి గంజాము మండలమున రాజుల రాజ్యపరిపాలనకాలపరిగణనముచేయుటకై యుపయోగింపఁబడు నొకవిధమైన సంవత్సరచక్రము. ఇందు చాంద్ర-సౌరమాన (Luni-Solar) సంవత్సరములు ఏఁబదితొమ్మిదిమాత్రమే యుండును. ఇందలి మాసములన్నియుఁ బూర్ణిమాంతములు. ఈపరిగణనమున భాద్రపద శు ౧౨ తో సంవత్సర మారంభమగును. ఇందలివిచిత్రమేమన, సంవత్సరారంభమైన భాద్రపదశుద్ధ ద్వాదశీదినమును మొదటి దినముగఁ గాక పండ్రెండవదినముగఁ బరిగణింతురు. ప్రతిభాద్రపద శుద్ధ ద్వాదశికి మాత్రము సంవత్సరము మాఱుచుండును.

ఈవిధమైన యంకపరిగణన మెప్పటనుండి యారంభమైనదియు నిశ్చయముగఁ జెప్పుటకు సాధ్యముకాదు. కొందఱిది క్రీ. శ ౧౦౭౮ లో సింహాసన మెక్కిన కళింగగంగవంశజుఁడైన అనంతవర్మచోడగంగదేవునుండి యారంభమయ్యెననియు, మఱికొందఱు అంతకుఁబూర్వము నుండియు వాడుకయం దుండెనని యుఁ జెప్పుదురు. ఎట్లయినను ఈపద్ధతి క్రీ. శ. పదునొకండవశతాబ్దినుండి కళింగోత్కలదేశముల వాడుకయం దుండినట్లు కళింగమును బాలించిన గంగవంశజులయొక్కయు,గజపతుల యొక్కయు శాసనముల ననుసరించి తెలియనగును. గంజాముమండలము నందలి పర్లాకిమిడి, పెద్దకిమిడి, చిన్నకిమిడి జమీన్దారీలలో ఈ'యంక' పంచాంగమునే యనుసరించెదరు కాని యొక్కొక్కజమీన్దారీ కొక్కొక్కప్రత్యేకపద్ధతి కలదు. వేఱువేఱుజమీన్దారీలలోనివారు వారిసంవత్సరములకుఁ దమజమీన్దారుల పేళ్లే పెట్టెదరు. అయినను ఈరాజ్యపరిపాలనకాలపరిగణనమున ఇన్నిటికి సమానమైనలక్షణ మిది: సంవత్సరసంఖ్యాసంకేతమున ఆఱవసంవత్సరములును, వేనియంకెలు ఆఱుతోఁగాని, (పదిమినహాగా) సున్నతోఁగాని యంతమగునో అట్టి సంవత్సరములను వదలివేసెదరు; అనఁగా అయిదు పిదప లెక్కకు వచ్చునది ఏడు; పదునైదునకుఁబిదప పదునేడును, పందొమ్మిదికిఁబిదప నిరువదియొకటియు లెక్కకువచ్చును. ఈవిధమగు పరిగణనపద్ధతికి కారణమేదో తెలియదు. కొందఱాయంకె లశుభసూచకము లని వదలివేసెద రందురు; మఱికొందఱు రాజులరాజ్యపరిపాలనకాలము నతిశయోక్తిగఁ జెప్పవలె ననుకోరికతో నిట్లు చేసెద రందురు. ఈలెక్కయం దింకొకవిశేష మేమన, 'అంక' వర్షములను ౫౯ కి మించి పరిగణింపరు. ౫౯కిఁ దరువాత లెక్కింపవలసివచ్చినచో 'రెండవతడవ ఒకటి', రెండు, అని ప్రారంభింతురు. ఈపద్ధతిలో గమనింపవలసిన మఱియొక ముఖ్యవిషయ మేదన, ఏరాజైనను 'అంక' వర్షమునకుమనే కాలధర్మము నొందినయెడల, అటుతరువాత రాజ్యమునకు వచ్చిన వాని మొదటియంకము అతఁడు సింహాసనారూఢుఁడైననాఁటనుండియే యారంభమైనను అంతటనుండి యది పూర్తిగ సంవత్సరకాలము నడచుటకు మాఱుగ తరువాతిభాద్రపదశుద్ధ ౧౧ తోనే యంత మగును. ఈకారణమున గతించినవాని కడపటిరాజ్యపరిపాలనసంవత్సరమును, సింహాసన మెక్కినవాని ప్రథమరాజ్యపరిపాలనసంవత్సరమును ఒక్కయేఁటనే పడి, ఒక్కమాఱే యంత మగును. కావున గణుతిలో నొక్క సంవత్సరము లుప్త మగును.

మనకుఁ దెలిసిన యొక 'యంక' వర్షమునకు సరిసమానమైన యిఙ్గ్లీషు తేదీ కనుఁగొనవలె నన్న ముందది జగన్నాథమునకుఁ జెందినదో, పర్లాకిమిడికిఁ జెందినదో మఱియేపద్ధతికిఁ జెందిన యంకవర్షమో నిర్ణయింపవలసియుండును. పిదప ౧, ౬, ౧౬, ౨౦, ౨౬; ౩౦, ౩౬, ౪౦, ౪౬, ౫౦, ౫౬ సంవత్సరములను దీసివేసి దానియసలుసంవత్సరమును దెలిసికొనవలసియుండును. ఎట్లన, ౧౯ వ యంక మెన్నవరాజ్యపాలన సంవత్సర మగు నన్నచో ౧౯ నుండి (వదలివేయవలసినసంవత్సరములు ౧, ౬, ౧౬ వెరసి మూఁడు కావున) పరిత్యాజ్యములైన మూఁడు సంవత్సరములను దీసివేయఁగా అది ౧౬ వ రాజ్యపాలన సంవత్సర మగుచున్నది. ఇట్లే ౩౧ వ యంకము (౧, ౬, ౧౬, ౨౦, ౨౬ వెరసి ౫ సంవత్సరములు తీసివేయఁగా) ౨౬ వ రాజ్యపాలన సంవత్సర మగును.

**అంకనగొడుగునూరు** — కడపజిల్లా బద్వేలుతాలూకాయందలి గ్రామము. ఇందలిజనసంఖ్య ౨౫౧.

**అంకపాశవ్యవహారము** — ఇది యొకగణితవిశేషము. నియమితవస్తువులలోనుండి తడవకు రెండు గాని, మూఁడు గాని, అంతకధికముగఁ గాని వస్తువులను దీసికొని వానిస్థలమును మార్చి గుంపు లేర్పఱిచినయెడల నెన్నిగుంపు లేర్పడును? ౧, ౨, ౩, ౪ అనునాలుగు అంకెలస్థానములను మార్చి యెన్నివిధము లైనసంఖ్యలను సాధింపవచ్చును? ఇట్లు సాధింపఁబడినయంకెలయన్నిటిమొత్త మెంత? ఈవిధము లైనప్రశ్నముల కీయంకపాశవిధాన మనుగణితమువలన నుత్తర మీయవచ్చును.

౧ వ ఉదా:— క, చ, ట, త అను ౪ వర్ణము లున్న వనుకొనుఁడు. అందుండి తడవకు రెండుచొప్పునఁ దీసికొని వానిస్థలములను మార్చినచో ఎన్నివిధము లైనగుంపు లేర్పడును?

కచ, కట, కత, చట, చత, టత
చక, టక, తక, టచ, తచ, తట

ఇందు నియమితవస్తుసంఖ్య ౪; ఇష్టసంఖ్య ౨. పైనఁ గన్పఱిచినప్రకారము ౧౨ విధము లైనగుంపు లేర్పడును. ఈ ౧౨ సంఖ్య యెట్లు వచ్చినది?

వస్తుసంఖ్య యగు ౪ ను అందుండి ఒకటి తీసివేయఁగా వచ్చిన ౩ తో గుణింపఁగా వచ్చెను.

౨ వ ఉదా:— ముప్వురు బాటసారు లొకపట్టణమునకు వచ్చిరి. అందు నాలుగు పూఁటకూళ్లయిం డ్లున్నవి. ముగ్గురును వేఱువేఱు స్థలములం దుండవలయు నన్న వా రెన్నివిధముల బస లేర్పఱుచుకొనఁగలరు?

న్యాసము:—

గ్రామమునందు ౪ పూటకూళ్లయిం డ్లుండినందున మొదటి వాఁడు ౪ విధముల బస లేర్పఱుచుకొనవచ్చును. మిగిలినమూఁడిం"లో రెండవవాఁడు 3 విధములుగమాత్ర మేర్పఱుచుకొనఁగలఁడు. కాని యీరెండవవాఁడే మొదట బస నేర్పఱుచుకొన్నయెడల మొదటివాఁడు రెండవవానివలె 3 బసలలో నేదియో యొకటి యేర్పఱుచుకొనవలసినవాఁ డగును. కావున వీ రిద్దఱును గలసి ౪ X 3 = ౧౨ విధములుగ బస లేర్పఱుచుకొనుటకు వీలు గలదు. ఇట్లే మూఁడవవాఁడు మిగిలిన రెండిండ్లలో ౨ విధములుగ బస లేర్పఱుచుకొనఁగలఁడు. కావున వీరు ముగ్గురును కలసి బస లేర్పఱుచుకొనుటకు వీ లయినవిధములు = ౪ X 3 X ౨ = ౨౪. ఇందు వస్తుసంఖ్య ౪; ఇష్టసంఖ్య 3. కాన ప్రస్తారభేదములు = ౪ X 3 X ౨ = ౨౪.

పైన నీయఁబడినయుదాహరణములవలనను, వానివివరణములవలనను ఈక్రింది సామాన్యనియమ మేర్పడుచున్నది. వస్తుసంఖ్యను మొదటి గుణకముగ నుంచుకొని, అందుండి క్రమముగ నొక్కొక్కటి తగ్గించుచు, ఇష్టసంఖ్య యన్నిగుణకముల నేర్పఱుచుకొని వాని నన్నిటి నొకదానితో నొకటి గుణించిన వచ్చెడిలబ్ధసంఖ్య "అంకపాశప్రస్తార" మగును.

వ అనఁగా వస్తుసంఖ్యయు, ఇ అనఁగా ఇష్టసంఖ్యయు నను కొనినయెడల అంకపాశసూత్రము నీప్రకారము వ్రాయవచ్చును.

$$^{\text{వ}}\text{పా}_{\text{ఇ}} = \text{వ (వ - ౧) (వ - ౨) (వ - 3)......(వ - ఇ + ౧)}$$

ఇందు నడుమ నున్న 'పా' అనునది అంకపాశసంబంధ మైన లెక్క యని తెల్పును.

$$^{\text{౯}}\text{పా}_{\text{౪}} = \text{౯ X ౮ X ౭ X ౬ = 3౦౨౪.}$$

$$^{\text{౧౦}}\text{పా}_{3} = \text{౧౦ X ౯ X ౮ = ౭౨౦.}$$

౧వ సూత్రము :— ఒకవస్తువును 'క' విధములుగాను, రెండవవస్తువును 'చ' విధములుగాను, మూఁడవవస్తువును 'ట' విధములుగాను తీసికొనిన ట్లయినచో మూఁడువస్తువులును ఒకటేసారి తీసికొను విధములసంఖ్య = క X చ X ట.

మొదటివస్తువును తీసికొను ప్రతియొకవిధమునకును తక్కిన రెండువస్తువులు 'చ' విధములఁ దీసికొనవచ్చును.

మొదటివస్తువును తీసికొను 'క' విధములకు, రెండువస్తువులు క X చ విధములుగా తీసికొనవచ్చును.

∴ రెండువస్తువులను తీసికొనువిధములు = క X చ.

మొదటి రెండువస్తువులు తీసికొను ప్రతియొకవిధమునకును మొదటి మూఁడువస్తువులు 'ట' విధములుగా తీసికొనవచ్చును.

∴ మొదటి 3 వస్తువులను క X చ X ట విధములుగా గ్రహింపవచ్చును.

3 వ ఉదా :— ౫ ఇంగ్లీషు, ౪ తెనుఁగు, 3 సంస్కృతగ్రంథములనుండి ౧ ఇంగ్లీషు, ౧ తెనుఁగు, ౧ సంస్కృతగ్రంథము కలసి యెన్ని విధములుగా తీసికొనవచ్చును?

౧ ఇంగ్లీషుపుస్తకమును ౫ విధములుగా తీసికొనవచ్చును.
,, తెనుఁగు ,, ౪ ,, ,,
,, సంస్కృత ,, 3 ,, ,,

కావున కావలసిన 3 పుస్తకములను ౫ X ౪ X 3 = ౬౦ విధములుగా తీసికొనవచ్చును.

౨వ సూత్రము :— 'వ' వివిధవర్ణములలోనుండి తడవకు 'ఇ' ఇష్టవర్ణములచొప్పున తీసికొనినచో నేర్పడుప్రస్తారభేదములు

$$^{\text{వ}}\text{పా} = \text{వ (వ - ౧) (వ - ౨)...(వ - ఇ + ౧).}$$

ఉపపత్తి :— 'వ' వర్ణము లున్నవి గదా! అందుండి మొదట ఒకవర్ణమును ప్రత్యేకింప నెంచిన దానిని 'వ' విధములుగఁ గైకొనవచ్చును.

తరువాత మిగిలిన (వ - ౧) వర్ణములలో నొక్కదానిని వ - ౧ విధములుగ తీసికొనవచ్చును.

పిమ్మట మిగిలిన వ - ౨ వర్ణములలో నొక్కదానిని వ - ౨ విధములుగ తీసికొనవచ్చును.

ఇట్టిపరికర్మములు చేయుచుఁ బోయిన వచ్చెడి విధములు 'వ' వర్ణములనుండి తడవకు 'ఇ' వర్ణములచొప్పున తీసికొనినచో వచ్చు ప్రస్తారసంఖ్యకు సరి యగును.

$$\therefore\ ^{\text{వ}}\text{పా}_{\text{ఇ}} = \text{వ (వ - ౧) (వ - ౨)........ఇ గుణకములవఱకు}$$
$$= \text{వ (వ - ౧) (వ - ౨).........(వ - }\overline{\text{ఇ - ౧}}\text{)}$$
$$= \text{వ (వ - ౧) (వ - ౨).........(వ - ఇ + ౧)}$$

వ = ఇ అయినచో, వ - ఇ + ౧ = వ - వ + ౧ = ౧

$$\therefore\ ^{\text{వ}}\text{పా}_{\text{వ}} = \text{వ (వ - ౧) (వ - ౨)..........౧}$$
$$= \text{౧ X ౨ X 3 X .........(వ-౧) వ}$$

కావున వస్తుసంఖ్యయు, ఇష్టసంఖ్యయు సమాన మైనయెడల ప్రస్తారభేదముల సంఖ్యను కనుఁగొనుటకు ౧ మొదలుకొని వస్తుసంఖ్యవఱకుఁగల యంకెల నన్నిటిని గుణకములుగా నెంచి పరస్పర

గుణనము చేయవలెను. ఇట్టి పరస్పరగుణితరాశి కేకాదిచయాంకగుణక (Factorial) మని పేరు. దీనినే |వ అని వ్రాయుదురు. |వ అనఁగా నొకటి మొదలుకొని ఒకటి వృద్ధిగా వ అను సంఖ్యవఱకును గల యంకె లన్నియు నొకదానిచే నొకటి గుణింపఁబడినయెడల వచ్చు సంఖ్య యని యర్థము.

|౩ = ౩ × ౨ × ౧ = ౬

|౪ = ౪ × ౩ × ౨ × ౧ = ౨౪

|౫ = ౫ × ౪ × ౩ × ౨ × ౧ = ౧౨౦

ఇట్లే |౧౦ = ౩౬౨౮౮౦౦.

|౩ అను అంకెను మూఁడు ఏకాదిగుణక మనియు, |౫ అను అంకెను అయిదు ఏకాదిగుణక మనియు హ్రస్వరూపము నుపయోగించుచు చదువవచ్చును.

౪ వ ఉదా:— స, రి, గ అను ౩ స్వరములస్థలములను మార్చి మూఁడు, మూఁడు స్వరములగుంపు లెన్ని యేర్పఱుపవచ్చును?

న్యాసము:—

ఇందు వస్తుసంఖ్యయు, ఇష్టసంఖ్యయు మూఁడే కావున ప్రస్తారభేదములు = |౩ = ౩ × ౨ × ౧ = ౬.

ఈ ౬ ప్రస్తారము లెవ్వి యనిన—

సరిగ, గరిస, రిసగ

సగరి, గసరి, రిగస

౫ వ ఉదా:— చతుర్హస్తుఁ డైనవిష్ణుమూర్తి శంఖ, చక్ర, గదా, పద్మములను తనహస్తంబుల నెన్నివిధముల ధరింపవచ్చును?

న్యాసము:—

ఇందు చేతులు ౪. ధరింపవలసినచిహ్నములు ౪. కావున ప్రస్తారభేదములు = |౪ = ౪ × ౩ × ౨ × ౧ = ౨౪.

౬ వ ఉదా:— ౮, ౬, ౪, ౩, ౫ అను ఈయయిదుసంఖ్యలను గైకొని, అయిదుస్థానంబులు గలసంఖ్య లెన్ని యేర్పఱుపవచ్చును?

ప్రస్తారభేదములసంఖ్య = |౫

= ౫ × ౪ × ౩ × ౨ × ౧ = ౧౨౦.

౭ వ ఉదా:—

"పాశాంకుశలు సర్పపతి శూల డమరుక
శర శక్తి ఖట్వాంగ చాపసహిత
మహితకపాలముల్ మార్చి మార్చి ధరించు
మూర్తిభేదము లెన్ని మొనయుచుండు?
శంకరునకు నట్ల చక్రగదాశంఖ
పద్మంబుల ధరించి బాహువులను
అన్యోన్యకలితంబు లగునట్లు ధరియింప
హరి కెన్ని భేదంబు లయినరూపు?
లటుల సేనానిభుజముల నలరుశక్తి
చాప శర శూల శతచంద్ర చర్మ ముసల
లగుడ పట్టిస పరిఘాత్తలప్రసూర్మ
ములను మార్చిన భేదముల్ కలుగు నెన్ని?"

ఇందలి మూఁడుప్రశ్నములలో

(౧) శివుఁడు పదిచేతులతో పది యాయుధములను ధరించు విధములు = |౧౦ = ౧౦ × ౯ × ౮ × ౭ × ౬ × ౫ × ౪ × ౩ × ౨ × ౧ = ౩౬౨౮౮౦౦.

(౨) విష్ణువునకు సంబంధించునది: మూఁడు ౫ వ ఉదా.

(౩) కుమారస్వామి ౧౨ చేతులతో ౧౨ ఆయుధములు ధరించు విధములు = |౧౨ = ౪౭౯౦౦౧౬౦౦.

౮ వ ఉదా:—

|౨వ / |వ = ౧ × ౩ × ౫...(౨వ − ౧) × ౨^వ అని ఋజువు చేయుము.

|౨వ / |వ = ౨వ (౨వ − ౧) (౨వ − ౨) (౨వ − ౩) (౨వ − ౪) ... × ౩ × ౨ × ౧ / వ (వ − ౧) (వ − ౨) (వ − ౩) ... ౨ × ౧

= ౨వ (౨వ − ౧) ౨(వ − ౧) (౨వ − ౩) ౨ (వ − ౨)... / వ (వ − ౧) (వ − ౨) ... ౩ × ౨ × ౧

= ౨^వ × వ (వ − ౧) (వ − ౨) ... ౨ × ౧ × (౨వ − ౧) (౨వ − ౩) ... × ౩ × ౧ / వ (వ − ౧) (వ − ౨) ... ౨ × ౧

= ౨^వ (౨వ − ౧) (౨వ − ౩) ... ౫ × ౩ × ౧

౩ వ సూత్రము:— ^వప్ఇ = వ (వ − ౧) (వ − ౨) (వ − ౩) ... (వ − ఇ − ౧) = వ × ^{వ − ౧}ప_{ఇ − ౧}

౪. సమానాంకసూత్రము:— 'క' వర్ణము లన్నియు నొక్కరకము, 'చ' వర్ణము లన్నియు నింకొకరకము, 'ట' వర్ణము లన్నియు వేఱొకరకమును ఉన్నయెడల అన్ని 'వ' వర్ణములనుండి తడవకు 'వ' చొప్పున నేర్పడు అంకపాశప్రస్తారవిధములు

= |వ / (|క |చ |ట) (వ = క + చ + ట)

౯ వ ఉదా:— 'వికటకవి' అను పదమునందలి యన్నియక్షరములతో నెన్నివివిధము లైనమాట లేర్పడును?

ఇందు 'వి' లు ౨ ను, 'క' లు ౨ ను ఉన్నవి.

∴ పైసూత్రముప్రకారము అంకపాశప్రస్తారసంఖ్య

$$= \frac{\underline{|౫}}{\underline{|౨}\,\underline{|౨}} = \frac{౫ \times ౪ \times ౩ \times ౨ \times ౧}{\underline{|౨} \times \underline{|౨}} = ౫ \times ౨ \times ౩ = ౩౦$$

ఇట్లే 'చలువవలువలు' అనుమాటలో నున్నయన్నియక్షరములతో నేర్పడుమాటలసంఖ్య $= \frac{\underline{|౭}}{\underline{|౩}\,\underline{|౩}}$

$$= \frac{౭ \times ౬ \times ౫ \times ౪ \times ౩ \times ౨ \times ౧}{౩ \times ౨ \times ౧ \times ౩ \times ౨ \times ౧} = ౭ \times ౫ \times ౪ = ౧౪౦.$$

౧౦ వ ఉదా:— ౫, ౫, ౫, ౪, ౮ అను అంకెలస్థలములు మార్చి అయిదంకెలసంఖ్య లెన్ని వ్రాయవచ్చును?

ఇందు అంకము లైదును, స్థానము లైదును అయినందున నిది వఱకు ౨ వ సూత్రముప్రకారము ప్రస్తారసంఖ్య $\underline{|౫}$ కావలయును. కాని యీయంకెలలో ౫, ౫, ౫ అనునవి మూఁడును ఒకటేవిధమైన యంకెలే కాన ప్రస్తారసంఖ్య తగ్గును. సమానాంకసూత్రప్రకారము ఇట్టియుదాహరణములలో సమానసంఖ్య లెన్ని యుండునో వాని యేకాదిగుణకముతో పూర్వప్రకారము వచ్చినప్రస్తారములను విభజింపవలెను. ఇదివఱకు వచ్చినప్రస్తారసంఖ్య $= \underline{|౫} = ౧౨౦$. దానిని $\underline{|౩} = ౬$తో భాగింపఁగా వచ్చినసంఖ్య ౨౦. కనుక నీయుదాహరణమునందు ౨౦ ప్రస్తారభేదములు కలుగు నని యర్థము.

౧౧ వ ఉదా:— బేసిసంఖ్య లెప్పుడును బేసిస్థానములం దుండులాగున ౧, ౨, ౩, ౪, ౩, ౨, ౧ అనునంకెలతో నెన్ని సంఖ్య లేర్పఱుపవచ్చును?

ఇచ్చినలెక్కలో ౧, ౩, ౩, ౧ అనునవి బేసియంకెలును, బేసిస్థానములును ౪.

కావున బేసియంకెలను, బేసిస్థానములందు $\frac{\underline{|౪}}{\underline{|౨}\,\underline{|౨}}$ విధములుగ నుంచవచ్చును.

సరియంకెలగు ౨, ౪, ౨ను సరిస్థానములలో $\frac{\underline{|౩}}{\underline{|౨}}$ విధముల నుంచవచ్చును.

$$\therefore \text{ మొత్తము విధములు} = \frac{\underline{|౪}}{\underline{|౨}\,\underline{|౨}} \times \frac{\underline{|౩}}{\underline{|౨}}$$

$$= \frac{౪ \times ౩ \times ౨ \times ౩ \times ౨}{౨ \times ౨ \times ౨}$$

$$= ౩ \times ౩ \times ౨ = ౧౮.$$

౫ వ సూత్రము:— ప్రతివస్తువును మనయిష్టము వచ్చినన్ని తడవలు మరలమరల తీసికొనినచో 'వ' వివిధవస్తువులనుండి తడవకు 'ఇ' వస్తువులచొప్పున నేర్పడు అంకపాశప్రస్తారంఖ్య $వ^{ఇ}$.

ప్రతివస్తువును మనయిష్టము వచ్చినన్నిసార్లు మరలమరల తీసికొనుటకు వీలున్నది గనుక 'ఇ' స్థానములను వరుసగ 'వ' వస్తువులలో కొన్నిటితోమాత్రము నింపుటవలన ఏదియైన అంకపాశప్రస్తార మేర్పడును. ఇట్లు ప్రతిస్థానమును 'వ' విధములుగ నింపవచ్చును. 'ఇ' స్థానములను $వ^{ఇ}$ విధములుగ నింపవచ్చును.

∴ అంకపాశప్రస్తారసంఖ్య $= వ^{ఇ}$.

౧౧ వ ఉదా:— ప్రతిబాలుఁడును అన్ని బహుమానములను పొంద నర్హుఁడైనచో నలుగురకు ౫ బహుమానము లెన్ని విధములుగ నీయవచ్చును?

బాలురు నలుగు రున్నారు గనుక బహుమతులలో నేదియైన నొకటి ౪ విధములుగ నీయవచ్చును. పిదప మిగిలిన బహుమతులలో నేదియైన నొకటి ౪ విధములుగ నీయవచ్చును; ఏల యన నదివఱకు బహుమతిని పొందినబాలుఁడుసయితము మరల బహుమతిని పొంద నర్హుఁడు.

ఇట్లు ౨ బహుమతులను $౪^{౨}$ విధములుగను, ౩ బహుమతులను $౪^{౩}$ విధములుగను, * * * * * * ౫ బహుమతులను $౪^{౫}$ విధములుగను ఈయవచ్చును.

$$\therefore ౪^{౫} = ౪ \times ౪ \times ౪ \times ౪ \times ౪ = ౧౦౨౪.$$

## అంకపాశప్రస్తారసంకలనము

అంకపాశప్రస్తారసంబంధములైన ప్రశ్నములందు కొన్ని యంకముల నిచ్చి వాని నెన్నిసంఖ్యలుగ వ్రాయవచ్చునో ౪ వ సూత్రము వలన తెలిసినది. అట్టిసంఖ్య లన్నిటిని కూడిన నెంతమొత్తము వచ్చునో కనుఁగొనువిధ మిఁకఁ దెలుపఁబడును.

౬ వ సూత్రము:— ప్రశ్నమునందలి యంకము లన్నింటిని కూడఁగా వచ్చినమొత్తమును ప్రస్తారభేదసంఖ్యచే గుణించి, వస్తుసంఖ్యచే భాగింపఁగా వచ్చినహారమును ఒకదానిక్రింద నొకదానిని ఇష్టసంఖ్య ఎంతో అన్ని పర్యాయములు ఒక్కొక్కస్థానమువెనుక కుంచుచు కూడినయెడల అంకపాశప్రస్తారసంకలనము వచ్చును.

౧౨ వ ఉదా:— ౩, ౪, ౫ అను అంకెలను రెండుస్థానములు గలయెన్నిసంఖ్యలుగాఁ వ్రాయవచ్చును? ఇట్టిసంఖ్యలమొత్త మెంత?

న్యాసము:—

ఇందులకు ప్రస్తారభేదములు $= {}^{౩}పా_{౨}$

$= ౩ \times ౨ \times ౧ = ౬$

మూఁడు అంకెలమొత్తము $= ౩ + ౪ + ౫ = ౧౨$

పైరెంటిని గుణింపఁగా వచ్చినసంఖ్య $= ౬ \times ౧౨ = ౭౨$

పైసూత్రముప్రకారము $\frac{౭౨}{\text{వస్తుసంఖ్య}} = \frac{౭౨}{౩} = ౨౪$ ను

ఇష్టసంఖ్య ౨ గనుక రెండుసార్లు ఒకదానిక్రింద నొకటి ఉంచి

```
        ౨౪
కూడఁగా  ౨౪
       ----
        ౨౬౪ మొత్తము వచ్చును.
```

ఇందులకు ఋజువు:— ౩౪ + ౩౫ + ౪౩ + ౪౫ + ౫౩ + ౫౪ = ౨౬౪.

౧౩ వ ఉదా:— ౨, ౪, ౩, ౫ అను అంకెలను ౪ స్థానములు గలయెన్నియంకెలుగా వ్రాయవచ్చును? వానిమొత్త మెంత?

నాలుగు అంకెలమొత్తము = ౨ + ౪ + ౩ + ౫ = ౧౪.

ప్రస్తారభేదములు = ౨౪.

పైరెంటిని గుణింపఁగా వచ్చినసంఖ్య = ౧౪ × ౨౪ = ౩౩౬.

వస్తుసంఖ్యతో భాగింపఁగా వచ్చినహారము = $\frac{౩౩౬}{౪}$ = ౮౪.

ఇష్టసంఖ్య ౪ గనుక ౪ సార్లు పెట్టి కూడవలయును.

```
         ౮౪
        ౮౪
       ౮౪
      ౮౪
     ------
     ౯౩౩౨౪.
```

∴ మొత్తము = ౯౩౩౨౪.

౧౪ వ ఉదా:— ౨, ౨, ౧, ౧ అను అంకెలతో నాలుగు స్థలములసంఖ్య లెన్ని వ్రాయవచ్చును? అట్టిసంఖ్యలమొత్త మెంత?

న్యాసము:—

వస్తుసంఖ్య = ౪; ఇష్టసంఖ్య = ౪

నాలుగింటిలో రెండు ౨ అంకెలును, రెండు ౧ అంకెలును ఉన్నందున ప్రస్తారభేదములు

$$= \frac{\underline{|౪}}{\underline{|౨}\,\underline{|౨}} = \frac{౪ \times ౩ \times ౨ \times ౧}{౨ \times ౧ \times ౨ \times ౧} = ౬.$$

నాలుగు అంకెలమొత్తము = ౨ + ౨ + ౧ + ౧ = ౬.

పైరెంటిని గుణింపఁగా వచ్చినసంఖ్య = ౬ × ౬ = ౩౬.

వస్తుసంఖ్యతో భాగింపఁగా వచ్చినహారము = $\frac{౩౬}{౪}$ = ౯.

ఇష్టసంఖ్య ౪ గనుక నాలుగుసార్లు ఒకదానిక్రింద నొకటి ఈక్రిందివిధమున పెట్టి కూడవలయును.

```
       ౯
      ౯
     ౯
    ౯
   ----
   ౯౯౯౯.
```

∴ మొత్తము = ౯౯౯౯.

**అంకభూపాలుఁడు దామర్ల** — శ్రీకాళహస్తిప్రభువంశములోని చెన్నభూపాలునికి తిమ్మాంబికవలనఁ గలిగిన కుమారుఁడు. ఇతని తండ్రి యైనచెన్నభూపతి క్రీ. శ. ౧౫౮౬ మొదలు ౧౬౧౪ వఱకు రాజ్యమేలిన మొదటి తిరుమలరాయలకొడు కగురెండవవేంకటపతి రాయలకాలమున నుండినవాఁ డగుటచేత ఇతఁడు క్రీ. శ. పదునేడవశతాబ్ది ప్రథమపాదమున నుండినవాఁ డని నిశ్చయింపవచ్చును. ఇతఁడు ఉషాపరిణయకథను అయిదాశ్వాసముల ప్రబంధముగఁ దెలుఁగున రచియించి శ్రీరామచంద్రుని కంకితముఁ గావించెను. ఈగ్రంథ మింకను అముద్రితము.

ఈగ్రంథమునుబట్టి యీకవి వంశావతారక్రమ మిట్లు తెలుపనగును.

దామర్ల శ్రీపాదమహీపతి
- అబ్బశౌరి
  - ధర్మరాజు
    - వరదరాజు
    - వెంగళేంద్రుఁడు = లక్ష్మమాంబ
      - ధర్మరాజు
      - వరదప్రభువు
      - వెంగళేంద్రుఁడు
        - చెన్నరాజు
          - వెంకటవిభుఁడు
          - అయ్యప
          - అంకభూపాలుఁడు (ఉషాపరిణయకృతికర్త)
          - తిమ్మవిభుఁడు
          - వెంకటవిభుఁడు
        - కేసన
        - వెంగళేంద్రుఁడు
        - వరదేంద్రుఁడు
        - కృష్ణభూపతి
        - (బహుళాశ్వచరిత్రకృతికర్త)
      - తిమ్మనృపతి
      - వెంకటమ్మ
    - తిమ్మశౌరి
    - కోనన్నృపతి

ఈగ్రంథమున శోణపురాధిపతియైన బాణాసురునికూఁతు రగు ఉషాకన్యకును, ప్రద్యుమ్నకుమారుఁ డైనఅనిరుద్ధునకును జరగిన వివాహకథ అభివర్ణిత మైనది. కవి ప్రధానముగ మొదటియాశ్వాసమున అనిరుద్ధునిజనన, విద్యాభ్యాసాదులును, ద్వితీయాశ్వాసమున ఉషాకన్య స్వప్నమును, తత్స్వప్నగతుఁ డైన అనిరుద్ధునిఁ గొనితెచ్చుటకై బాణాసురమంత్రి యైనకుంభాండకునితనయ చిత్రరేఖ ద్వారక కరుగుటయును, తృతీయాశ్వాసమున ఉషానిరుద్ధసమాగమమును, చతుర్థాశ్వాసమున తనకూఁతు రైనయుష గర్భవతియయ్యె నని విని బాణాసురుఁడు బలసమేతుఁడై వచ్చి ఏకాంతసౌధమున ఉషతో ద్యూతక్రీడావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుండిన యనిరుద్ధుని మార్కొని యుద్ధముచేసి తుద కాతనినోడించి చెఱఁబెట్టుటయును, పంచమాశ్వాసమున బలరామకృష్ణాదియదువీరులకును బాణాసురునికిని ఘోరసంగ్రామము జరగుటయు, తుద కందు రాక్షసాధీశ్వరుఁడైన బాణుఁ డోడి, ఉష నని రుద్ధున కిచ్చి పరిణయముఁ గావించుటయును అనువిషయములు వర్ణితము లైనవి. ఇవికాక కవి ప్రథమాశ్వాసమున కృష్ణ, బలరాముల

డెను. ఆశ్వాసాంతపద్యముల సంబోధన లేదు. కాని చిత్రమైనపద్ధతి యొకటి కానవచ్చుచున్నది. కథాభాగమునకుఁ జేరిన యీ యాశ్వాసములోని కడపటిపద్యము గాని, ముందటి యాశ్వాసపు కథకుం జేరిన మొదటిపద్యము గాని యేవిభక్తితో ముగింపఁబడుచున్నదో ఆవిభక్తితోడనే మనుమసిద్ధి వర్ణితుఁడు 1. ఈతఁడు కృత్యాదినే కృతిభర్తయని పేర్కొనఁబడియుండెను. షష్ఠ్యంతములు లేవు. కాని భారతమునకు వచ్చునప్పటికి సగము సంబోధనంబును, సగ మనుమతియుఁ బోయి సంబోధనంబే కానవచ్చుచున్నది. షష్ఠ్యంతములు ప్రారంభమయినవి. రచనాకౌతుకమునఁ దన ప్రబంధమందలి కథినాథుఁడు గాఁగలపురుషుం డెవ్వం డని తలఁపు గూరియుండఁ దనతండ్రి కలలోఁ గానవచ్చి హరిహరనాథునిం దన కెఱింగించినట్లును, హరిహరనాథుఁడు సాక్షాత్కరించి కృతిపతిత్వము నర్థించినట్లును, అదియే పుణ్యం బనియు "తాదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషం" బైనట్లును, మఱియుఁ దాను హరిహరనాథునకు "విన్నపంబు సేయుతెఱంగుగా" సన్నిధిం గల్పించికొని భారతము నుడివినట్లును తిక్కన వ్రాసియుండెను. ఇట్లగుట కృతిభర్తయనువిశేషంబును మనభాషాప్రపంచంబున మొదట వెలయించినవాఁడును, భక్తిమైఁ గృతి నిష్టదేవత కర్పించునాచారమును బ్రారంభించినవాఁడును, మొత్తముమీఁద నేటిపద్ధతి నంకితమును నెలకొల్పినవాఁడు నీతఁడే 2.

తిక్కనఘక్కని ఇటీవలికవు లందఱు నంకిత మొనర్చుట విడువనివిధి యయ్యె. కావున నంకితపుఁజరిత్రమున వ్రాయందగువిశేషములు మిక్కిలి తక్కువ. కృతి యొకటి పుట్టినఁ గృతిభర్త యుండి తీరవలసివచ్చెను. మనవాఙ్మయమున మొన్నటిదనుక నిరుతెఱంగుల కృతిభర్తలు సాధారణముగఁ గానవచ్చుచుండిరి—ఇష్టదేవతలు, పోషకులు. ఈరెండవతెగయందు కరణము మొదలు చక్రవర్తివఱకును గలరు. ఇట్టినరాంకితములను పోతనామాత్యాదిమహాకవు లెంత ఖండించినను నవి నేఁటివఱకు నున్నవి. ఒక్క పింగళిసూరనార్యుఁడుమాత్రము పితృపూజనార్థమై ప్రభావతీప్రద్యుమ్నమును దనతండ్రికిఁ గృతి యిచ్చియుండెను. సామాన్యమైన బాటను వదలి కూచిమంచిజగ్గకవి చంద్రరేఖావిలాపమును కఠినోక్తు లాడుటకునై విరోధంబునఁ జింతలపాటినీలాద్రినృపున కంకితము చేసియుండెను.

నేఁ డన్నో అంకితములు ఇంగ్లీషుపద్ధతిని, అంతకంటె విశేషభిన్నము గాని తెలుఁగుపద్ధతిని సమన్వయము చేసికొని యల రారుచున్నవి.

(గా. హ.)

**అంకిదేవుఁడు** — క్రీ. శ. ౧౨౯౯-వ సంవత్సరము ప్రాంతముననుండిన రట్టవంశజుఁ డగు నొకమహాసామంత ప్రభువు.

**అంకిరెడ్డిపల్లి** — ఇది కడపజిల్లా కమలాపురము తాలూకాకుఁ జెందిన గ్రామము. ఇచటిజనసంఖ్య ౪౧౯.

**అంకిరెడ్డిపాలెము** — ఇది గుంటూరుజిల్లా గుంటూరు తాలూకాయందలి గ్రామము. ఇందలిజనసంఖ్య ౫,౦౦౩.

**అంకిసెట్టిపల్లి** — ఇది చిత్తూరుజిల్లా మదనపల్లి తాలూకాయందలి ఈనాము గ్రామము. ఇందలిజనసంఖ్య ౧౯౪.

**అంకుడు** — ఇది గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకా జమీన్‌దారీగ్రామము. ఇచటిజనసంఖ్య ౭౨౧.

**అంకుపల్లి** — నెల్లూరుజిల్లా రాపూరు తాలూకాయందలి గ్రామములలో నొకటి. ఇచటిజనులమొత్తము ౩౨౦ మాత్రమే.

**అంకుపాలెము** — విశాఖపట్టణముజిల్లా వీరవల్లి తాలూకాయందలి జమీన్‌దారీగ్రామములలో నొకటి. ఇచటిజనసంఖ్య ౯౩౧.

**అంకులపాటూరు ఏరూరు** — ఇది నెల్లూరుజిల్లా గూడూరుతాలూకాకుఁ జెందిన గ్రామము. ఇందలిజనులసంఖ్య ౨౧౮.

**అంకుళ్లవలస** — ఇది విశాఖపట్టణముజిల్లా పార్వతీపురముతాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౮౪.

**అంకెవాలియా** — బొంబాయిరాజధానియందలి కాఠేవాడునం దున్న యొకచిన్నస్వదేశసంస్థానము. ఇచ్చటిరాజు ఝాలా రాజపుత్రకులజుఁడు. ఈరాజ్యమున మూఁడుగ్రామములు గలవు; జనసంఖ్య ౧,౨౬౪. ఆదాయము సంవత్సరమునకు రు. ౧౨,౩౫౬ లు. ఈసంస్థానమువా రింగ్లీషుప్రభుత్వమువారికిని, జునాగడ్ సంస్థానాధీశ్వరునకును గలిపి సంవత్సరమునకు రు. ౧,౫౩౦ లు కప్పము చెల్లింపవలెను.

**అంకేపల్లి** — ఇది నెల్లూరుజిల్లా పొదిలిడివిజనునకుఁ జెందిన గ్రామము. దీనిజనసంఖ్య ౫౪౦.

**అంకోటము** — ఇది యొకయోషధీవిశేషము. దీనికి అంకోలమనియుఁ బేరు కలదు. దీనినూనెలో బీజములను నానవేసిన వెంటనే మొలచు నని ప్రతీతి కలదు. కుష్ఠరోగమున కిది మంచిమం దని వైద్యులు కొందఱు చెప్పుదురు. హిమాలయపర్వతప్రాంతములను, ఉత్తరహిందూస్థానమునను ఇది విశేషముగఁ బెరుఁగును.

**అంకోనా** — ఇటలీదేశమున రోమునగరమున కీశాన్యముగ ౧౩౨ మైళ్లదూరమున నుండు నొక సుందరమైన రేవుపట్టణము. ఇది ఏడ్రియాటిక్కు సముద్రతీరమున కిరియాకో, కొనీరో యనంబడు

1. దీనివలన తిక్కనామాత్యుఁడు తనకృతిభర్తయొక్క వర్ణనకూడ కథాభాగములోనిదివలె కన్పట్టునట్లు చేయఁ బ్రయత్నించెనని చెప్పనొప్పును.

2. ఇటీవల ప్రచురింపఁబడిన నన్నెచోడుని కుమారసంభవమున షష్ఠ్యంతములును, నిర్వచనోత్తరరామాయణమునందలి యంకితపుగుణములును గలవు. కాని ఈకవికాలము నిశ్చయముగఁ దెలియదు. కాన నీతని ప్రశంస యిట నెత్తికొన వీలు లేదు.

రెండుగుట్టలమధ్యభాగములోని అర్ధగోళాకారప్రదేశమునఁ గట్టఁబడి యున్నది. ఈపట్టణపువీథు లిఱుకులై వంకరటింకరలుగ నున్నను ఇందు దర్శనీయనిర్మాణము లనేకములు గలవు. ఏడ్రియాటిక్కు సముద్రతీరమునఁ గలయుత్తమమైన బందరులలో నీ అంకోనాబందరొక్కటి. ఈపట్టణ మొకప్పుడు విస్తారవ్యాపారమున కునికిపట్టయి యుండెను గాని ౧౮౯౬-వ సంవత్సరమున కొన్ని వ్యాపారనిర్బంధములు తటస్థించినందునను, క్రమముగ బందరు పూడుకొనుచు వచ్చుచున్నందునను ఈపట్టణపుదశ చెడినది. క్రీ. పూ. ౩౯౦-వ సంవత్సరమున సిసిలీదీవిలోని సైరాక్యూసు అనుపట్టణమును డయోనీసియ సను ఆక్రమికుఁడు నిరంకుశముగ నేలుచుండెను. కొందఱు ప్రజలు వాని బారినుండి తప్పించుకొన నెంచి సిసిలీదీవినుండి లేచివచ్చి యీయంకోనా పట్టణమును గట్టుకొనిరి. కొంతకాలము పేరుప్రఖ్యాతులు గాంచి నెగడి రోమనులకు లోఁబడి యనంతర మెన్నియో పాట్లుపడి తుదకు క్రీ. శ. ౧౫౩౨ వఱకు నీనగరము రోమకమహామతాచార్యులకుఁ జెందినప్రజాసత్తాకముగ నుండెను. కాని మరల నీనగరము స్వాతంత్ర్యమును గోలుపోయి పలువుర ప్రభుత్వమునుండి ౧౮౬౧-వ సంవత్సరమున నేర్పడిన యిటలీసామ్రాజ్యమున లీన మయిపోయెను.

**అంకోలా** — బొంబాయిరాజధానియందలి ఉత్తరకన్నడ జిల్లాయొక్క పడమటితాలూకా. ఇది ౧౪° ౩౮', ౧౪° ౫౩' ఉత్తరకును ౭౪° ౧౫', ౭౪° ౪౦' తూర్పుకును లోపుననుండి ౩౭౫ చదరపుమైళ్లు విస్తీర్ణము గలిగియున్నది. ఇందు ౯౦ గ్రామములు కలవు కాని ఒక పట్టణమైనను లేదు. జనసంఖ్య ౧౮౯౧ సంవత్సరములో ౩౬,౯౮౮; ౧౯౦౧-వ సంవత్సరములో ౩౯,౬౬౫. ఇచ్చట జనులు చదరపు మైలునకు ౧౦౬ గురు చొప్పున నున్నారు. ౧౯౦౩-౪ సంవత్సరములో భూమిసిస్తుయొక్క పరిమితి రు. ౭౯,౦౦౦ లును, పన్నుల యొక్క పరిమితి రు. ౬,౧౦౧ లును. ఈతాలూకా కంకోలా ముఖ్యస్థానము. ఇది పూర్వము కుమ్తతాలూకాయందలి యొకభాగముగా నుండెను. కాని దాననుండి ౧౮౮౦-వ సంవత్సరమున వేఱుపఱుపఁబడినది. లోతై, నీటివసతి గలిగి, చిన్నగుట్టలమధ్య నుండి పడమటి కనుమలలోనికిఁ బోవులోయలలో నెల్ల విలువగల పెద్ద పోఁకతోఁటలు కలవు. సముద్రతీరముపొడుగునను చాలభాగ మిసుకనేలగా నున్నది. కాని కడమచోట్ల నేల యెఱ్ఱబిళ్లరాలతో నిండియున్నది. ఇచ్చట సగటున సంవత్సరమునకు ౧౩౨ అంగుళములు వర్షము పడును.

**అంక్లేశ్వర తాలూకా** — బొంబాయిరాజధానియందలి భడోచ్ (బ్రోచి) జిల్లా యొక్క దక్షిణపుతాలూకా. ఇందు చిన్నదగు హాన్సోటుసబుడివిజన్ కూడ చేరియున్నది. ఇది ౨౧° ౨౫', ౨౧° ౪౩' ఉత్తరకును, ౭౨° ౩౫', ౭౩° ౦౯' తూర్పుకును లోపున నుండి ౨౯౪ చదరపుమైళ్లు వైశాల్యము గలిగియున్నది. జనసంఖ్య ౧౮౯౧-వ సంవత్సరమున ౭౦,౭౦౩. ౧౯౦౧-వ సంవత్సరమున ౬౧,౧౩౧. ఇచ్చట సగటున చదరపు మైలునకు ౨౦౯ గురు జనులు గలరు. ఇందు ౯౯ గ్రామములును, ౨ పట్టణములును గలవు. ఆరెంటిలో ౧౧,౨౨౫ జనసంఖ్య గలిగి యీతాలూకాకు ముఖ్యస్థానమైన అంక్లేశ్వరమే పెద్దది. ౧౯౦౩-౪ సంవత్సరమున భూమిసిస్తును, పన్నులును గలసి ౫.౯ లక్షలు. ఇందు ఈనాముగ్రామములే ౭ చదరపుమైళ్ల నేల నాక్రమించియున్నవి. ఇచ్చట మంచినీటిసదుపాయము గలదు; బొంబాయి, బరోడా, మధ్యఇండియాయినుపదారికిఁ దూర్పుగా ౩ మైళ్లదూరమునఁ గొంచె మెత్తనిపట్టెలవరుస గలదు. అచ్చటనుండియే యీతాలూకా క్రమక్రమముగా నర్మదానదివైపు ఏటవాలుగా నున్నది. వర్షకాలమధ్యమం దనేకగ్రామములు వఱదచే మునిఁగిపోవును. నర్మదానది కుత్తరప్రదేశము తాలూకాలోనికెల్ల మిక్కిలి సారవంతమైనది. కీము, నర్మదానదులకు మధ్య ద్వీపకల్పమున నుండుభూములకెక్కువవర్షము కావలసియుండును. అచ్చట గోదుమలును, జొన్నలును పైరగుచున్నవి.

అంగడి — మైసూరుసంస్థానము, కడూరుజిల్లా మడ్గెరె తాలుకాయందలి యొకపల్లె. జనసంఖ్య ౫౩౫. దీనికిఁ బూర్వము సొసెవూర్, శశిపురము, శశికపురము అన్నపే ళ్లుండె ననియుఁ, హొయసలబల్లాళులు మొదట నిచ్చటివారే యనియుఁ జరిత్రకారుల యభిప్రాయ మైనందున నీపల్లెకుఁ బ్రాముఖ్యము వచ్చెను. ఇచ్చటఁ బూర్వవైభవసూచకము లైనజీర్ణదేవాలయములు మొదలైనవి పెక్కు గలవు. ఇప్పు డిచ్చట వసంతమ్మ యనుదేవత భజింపఁబడుచున్నది.

అంగద — ఇది బొంబాయిరాజధానిలోని 'రేవాకాంత' యను 'ఏజెన్సీ' భాగమునఁ గలయొక చిన్నసంస్థానము. ఇది యిద్దరు నాయకులయధీనమున నున్నది. వీ రందఱును బరోడా మహారాజునకుఁ గప్పము గట్టుదురు.

**అంగదజీ** (౧౫౦౪-౧౫౫౨) — సిక్కులగురుపరంపరలోని రెండవవాఁడు. ఈయనతండ్రి పేరు ఫీరుమల్ ఖత్రీ. ఫీరోజపురవాస్తవ్యుఁడు. తల్లి పేరు సుభరాయీజీ. ౧౫౧౯-వ సంవత్సరమున అంగదజీకి వివాహమయ్యె. ఇద్దఱు పుత్త్రులును, ఇద్దఱు పుత్త్రికలును పుట్టిరి. ౧౫౩౧ న నతఁడు నానక్ గురువునకు శిష్యుఁడయ్యెను. గురునానకు పరమపదమునకుఁ బోవునప్పుడు, తనకుఁ బుత్త్రులున్నను ఈతనినిరుపమభక్తికి మెచ్చి, సింహాసనాధికార మీతనికే యిచ్చినందున నితఁ డాసిక్కుమతమునకు ద్వితీయాచార్యుఁ డయ్యెను. ఇతఁడు సత్యసంధుఁడు: దాత. ఇతఁడు చేసినయద్భుతకృత్యములను గుఱించి పెక్కుకథలు కలవు. ఖండౌరనామకగ్రామమునందు సమాధిస్థుఁ డయ్యెను. జననము ౧౫౦౪. మరణము ౧౫౫౨. ఈయనసమాధిపూజనిమిత్తము కొంతయీనాముభూమి కలదు.

అంగదీయపురి — దాశరథిలక్ష్మణపుత్త్రుఁ డైన అంగదుని రాజ్య మగుకారుపథదేశమునకు రాజధాని. దీనికి 'అంగదనగర' మనియు, 'అశ్వనగర' మనియు నామాంతరములు కలవు.

(వా. రా. ఉత్తర. స. ౧౦౨.)

**అంగదుఁడు** — (౧) వాలికిని, ఆతనిభార్య యగు తారకును పుట్టినవాఁడు. ఇతఁడు రామసాహాయ్యార్థము బృహస్పత్యంశమునఁ బుట్టినవాఁడు. కావున సంభాషించుటలో మిక్కిలి చాతుర్యముఁ జూపువాఁడు. వాలిమరణకాలమున నీతఁడు వయస్సునందు మిక్కిలి పెద్దవాఁడు కానందున 'నీబాలుని దయతోఁ గాపాడు' మని వాలి శ్రీరామునిఁ బ్రార్థించెను. శ్రీరాముఁడు కిష్కింధారాజ్యమునకు సుగ్రీవునికిఁ బట్టము కట్టినప్పు డీతనికి యౌవరాజ్యాధికార మొసఁగెను (చూఁడు: వాలి ౨). సీతను వెదకుటకు దక్షిణదిక్కునకుఁ బంపఁబడిన హనుమంతుఁడు మొదలగువానరులలో నీతఁడు ప్రముఖుఁడుగా నుండెను. ఒక నెలవఱకు వెదకినను సీత కానరావందున నిరాశుఁడై యీతఁడు ప్రాణములను త్యజించుటకు నిశ్చయించెను. కాని వారికి సంపాతి కానవచ్చి సీత లంకకుఁ గొంపోఁబడినవార్తఁ దెల్ప నితఁడు హనుమంతుని లంకకుఁ బంపి యాతఁడు సీతను జూచి మరల వచ్చిన తరువాత రామునికడకుఁ బోయెను.

యుద్ధమునకుఁ బూర్వ మీతఁడు శ్రీరామునికై రావణుని యొద్దకు రాయబారము పోయెను. కాని యీతనిసామవచనములు రావణుండు విననందున విఫలమనోరథుఁడై మరలివచ్చెను. రామ రావణయుద్ధమునం దితఁడు శ్రీరామునిపక్షమునఁ బోరాడి రావణ భటు లయినవికట, కంపన, ప్రజంఘాదిరాక్షసులను జంపెను.

శ్రీరాముఁడు నిజధామమునకుఁ బోవునప్పుడు సుగ్రీవుఁ డాతనివెంటఁ బోవ నంగదుఁడు కిష్కింధకు రా జయ్యెను.

౨. (సూ. వం.) దశరథపుత్త్రుఁ డైనలక్ష్మణునకు ఊర్మిళయందుఁ బుట్టినయిద్దఱు కొడుకులలోఁ బెద్దవాఁడు. ఇతఁడు 'అంగదీయ' మనుపురమును గట్టించి దానికి రా జయ్యెను.

౩. భారతయుద్ధమునఁ గౌరవపక్షమునఁ బోరాడి హతుఁడైన యొకరాజు (భార. ద్రో. అ. ౨౫).

**అంగదేశము** — హిందూదేశాంతర్గత మైన యొక ప్రాచీన దేశము. ఛప్పన్న దేశములలో మొదటిది. దీనియుత్పత్తినిగుఱించి రామాయణమునం దిట్లున్నది. ఇచ్చటఁ గామదేవుఁడు శివునికోపమువలన భస్మీభూతుఁ డై దేహము విడలెను. కావున దీని కంగదేశ మని పేరు వచ్చెను (వాల్మీ. బాల. స. ౨౩). భారతమునం దీదేశముయొక్క యుత్పత్తి మఱియొకవిధముగఁ జెప్పఁబడియున్నది. బలి యనురాజునకుఁ బుత్త్రులు లేనందున నతనియాజ్ఞప్రకార మాతనిభార్య యైన సుదేష్ణ దీర్ఘతమఋషియొక్కస్పర్శవలన అంగుఁడు, వంగుఁడు, కళింగుఁడు, పుండ్రుఁడు, సుహ్ముఁడు అనునయిదుగురు సుతులఁ గనియె. వారివారిరాజ్యములకు వారివారిపేళ్లు వచ్చెను (ఆది. అధ్యా. ౧౧౩). ఈదేశపువిస్తీర్ణ మెల్లప్పుడును ఏకరీతిగా నుండలేదు. అప్పుడప్పుడు మాఱుచువచ్చినట్లు కానవచ్చుచున్నది. బృహత్సంహితలో "ఆగ్నేయ్యాం దిశి కోసలకలింగవంగోపవంగజఠరాంగాః" అని చెప్పఁబడినందున నిది యుత్తరహిందూదేశమునకు మొదట నాగ్నేయదిశయం దుండెనేమో యని సంశయింపవలసియున్నది. రామాయణీయకాలమున నిది సరయూభాగీరథులకు నడుమనున్నట్లుకానవచ్చెడిని (బాల. స. ౨౩). మహాభారతమునందలిసభాపర్వాంతర్గత మైనదిగ్విజయాదివర్ణనములు చూడఁగా నప్పటి కీదేశమునకుఁ దూర్పున మగధదేశమును, పశ్చిమమున హస్తినాపురప్రదేశంబును, దక్షిణంబున వంగంబు నున్నట్లు కానంబడియెడి. ఉత్తరమునఁ జంపారణ్య ముండవచ్చును. దశరథునికాలమం దీదేశము లోమపాదుఁ డనురాజుచేఁ బాలింపఁబడుచుండెను. ఇతఁడు దశరథునకు స్నేహితుఁడు. శాంత యనుతనబిడ్డను ఋష్యశృంగున కిచ్చి వివాహముచేసెను. హిందువులకాలమం దీరాజ్యము దుర్యోధనునిచేఁ గర్ణున కీయఁబడెను. తరువాతిచరిత్రకాలమం దీదేశ మంతగాఁ బ్రఖ్యాతి చెందినది కాదు. మగధదేశమునకు లోఁబడి క్రమముగ నందులోనే యిమిడిపోయెను. దీనికి రాజధాని చంపానగరము. ఈదేశము ప్రస్తుతము భాగల్ పుర్ అనఁబడుజిల్లా యున్నస్థానమం దుండె నని చరిత్రకారులయభిప్రాయము.

బంగాళరాజధానియందలి క్రొత్తజిల్లా లగు ఉత్తరమాంఘీరము, ఉత్తరభాగల్పురము, మహానందానదికిఁ బశ్చిమమున నుండుపూర్ణియాయును కలసి పూర్వపు అంగరాజ్యమునకు సరిపడుచున్నవి. తొమ్మిదవ శతాబ్దియం దిచ్చటనే 'పాల'వంశ మభివృద్ధిలోనికి వచ్చినది.

అంగన — ౧. ఉత్తరపుదిక్కున నుండు ఆఁడేనుఁగు.

౨. భారతవర్షమునం దున్న యొకమహానది.

(భార. భీష్మ. అ. ౯)

**అంగన్యాస కరన్యాసములు** — మంత్రాధిష్ఠానదేవతను ఆవాహనమును, విసర్జనమును చేయుటయం దంగన్యాస, కరన్యాసములు వినియోగపడుచున్నవి. మంత్రోపాసనయందును, దేవతాప్రతిష్ఠలయందును మంత్రభాగములతో మంత్రదేవతను దేహాదులందు నిలుపుటయును, విసర్జించుటయును అంగన్యాస, కరన్యాసములవు ఫలము. విశ్వవ్యాపకమైన శక్తిని మంత్రమూలమునను ఆవాహన చేయుటయే న్యాసము. బాహ్యశక్తి దేహమునందలి గ్రంథిస్థానములందుఁ గల శక్తితోఁ గలియుటకై న్యాసరూపమునను ఆవాహనచేయఁబడుచున్నది. ఈశక్తిని దేహాంగములందు ప్రసరింపఁజేయుటయె న్యాసము. ఇపుడు మంత్రోపాసకులు న్యాసప్రయోజనమును విడిచి కేవలము స్పర్శనము చేయుచున్నారు. న్యాస మనఁగా ఉంచుట; వాడుకయందు స్పృశించుట. మంత్రోచ్చారణపూర్వకముగా శరీరమందలి భిన్నాంగములం దాయాదేవతలను నిలుపుట అంగన్యాసము. అట్లే చేతి వ్రేళ్లయం దుంచుట కరన్యాసము. సంధ్యావందనాదివిధులయందును, దేవతార్చనాది నిత్యకర్మములయందును, తంత్రోక్తవిశేషకర్మములయందును ఈయంగన్యాస, కరన్యాసములు చేయుప్రసంగములు గలవు. వేఱువేఱుకర్మములయందు వేఱువేఱుమంత్రము లుండును. ఇట్లు ఉపాసింపఁబడుమంత్రముల కన్నిటికిని అంగన్యాసకరన్యాసము లేర్పఱుపఁబడియున్నవి. ఇందు కుదాహరణములు :

### గాయత్త్రీమంత్రము:—అంగన్యాసము

ఓం తత్సవితుః, బ్రహ్మాత్మనే హృదయాయ నమః,— మంత్రశక్తిని హృదయమునం దావాహన చేయవలయును. కాని వాడుకగా ఇట్లని గుండెకాయ ముట్టుకొనఁబడును.

ఓం వరేణ్యం విష్ణ్వాత్మనే శిరసే స్వాహా,— మంత్రశక్తిని శిరసునం దావాహన చేయవలయును. కాని వాడుకగా ఇట్లని తల ముట్టుకొనఁబడును.

ఓం భర్గో దేవస్య రుద్రాత్మనే శిఖాయై వౌషట్,— మంత్రశక్తిని శిఖయం దావాహన చేయవలయును. కాని వాడుకగా ఇట్లని శిఖ ముట్టుకొనఁబడును.

ఓం ధీమహి సత్యాత్మనే కవచాయ-హుమ్,—మంత్రశక్తిని కవచమునం దావాహన చేయవలయును. కాని వాడుకగా ఇట్లని భుజములు ముట్టుకొనఁబడును.

ఓం ధియో యో నః జ్ఞానాత్మనే నేత్రత్రయాయ వౌషట్,— మంత్రశక్తిని నేత్రత్రయమునం దావాహన చేయవలయును. కాని వాడుకగా ఇట్లని కనులును భ్రూమధ్యభాగమును ముట్టుకొనఁబడును.

ఓం ప్రచోదయాత్ సర్వాత్మనే అస్త్రాయఫట్—మంత్రశక్తిని అస్త్రమునం దావాహన చేయవలయును. కాని వాడుకగా ఇట్లని చేయి చుట్టు త్రిప్పి రెండుచేతులతో చప్పుడు చేయుదురు.

ఈన్యాసమందుఁ బెద్దక్షరభాగములు గాయత్త్రీ మంత్రమందలి భాగములు. ఇట్లే యితరమంత్రములయందలి భాగములను విడివిడిగాఁ దీసి యొక్కొక దేవతతో దానికి నైక్యమును, దేహముయొక్క యొక్కొక యింద్రియముతో దానికి న్యాసమును కల్పింపఁబడియున్నది.

### కరన్యాసము

పైవిధముననే మంత్రోచ్చారణపూర్వకముగా చేతియైదువ్రేళ్లయందును శక్తిని న్యాసముచేయుట కరన్యాస మనఁబడును.

**అంగములు** — పెక్కువిధము లైనయంగములు కలవు. వానిలో ముఖ్యము లీక్రింద వివరింపఁబడును.

౧. శరీరాంగములు ఆఱు:— నాలుగుశాఖలు (రెండుచేతులు రెండుకాళ్లు), స్కంధము, శిరస్సు.

౨. సంగీతశాస్త్రమునం దంగము లాఱు:— శిరస్సు, చేతులు, వక్షస్సు, పార్శ్వములు, కటి, పాదములు. స్కంధములుకూడఁ గలుపుకొని సప్తాంగము లని మఱికొందఱి యభిప్రాయము.

౩. నమస్కారవిషయమున నంగము లెనిమిది:— కరములు, పాదములు, బొమ్మ, లలాటము, భుజములు కలసి యెనిమిది. కొందఱిమతమున పాదములు, మోకాళ్లు, ఎద, శిరస్సు హస్తములు, దృష్టి, వాక్కు, బుద్ధి.

౪. వేదాంగము లాఱు:— శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము.

౫. రాజ్యాంగము లేడు:— రాజు, మంత్రి, మిత్త్రము, కోశము, రాష్ట్రము, దుర్గము, సైన్యము.

౬. మంత్రాంగము లైదు:— సహాయులు, సాధనోపాయములు, దేశకాలవిభాగము, విప్రతిపత్తిక్రియ, సిద్ధి.

౭. యోగాంగము లెనిమిది:— యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి.

౮. చికిత్సాంగము లెనిమిది:— కాయము, బాల, గ్రహము, ఊర్ధ్వాంగము, శల్యము, విషము, రసాయనము, వాజీకరణము.

౯. తాళాంగము లైదు:— అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము. చూడామణికారమతమున అనుద్రుత మనుదానిని దీసివేసి నాలుగంగములుగనే యెంచవలయును. అనుద్రుతమును ద్రుతములోనిదిగా నెంచి దానికిబదులుగా విరామ మనుదానిని గైకొనవలె నని ఆంజనేయునియభిప్రాయము. విరామ మనుదానిని పాటింపక ద్రుతశేఖర, అనుద్రుతములను కలుపుకొని యాఱంగములుగ నెంచవలె నని కొందఱియభిప్రాయము. ఎనిమిదివిధము లని మఱికొందఱు. తాళ మనఁగాఁ బాడునపుడు జరగెడుకాలపరిమాణము.

౧౦. అధికరణాంగము లైదు:— విషయము, సంశయము, పూర్వపక్షము, ఉత్తరము, సంగతి.

౧౧. కాలసంబంధ మైనవి పంచాంగములు:— తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము.

౧౨. సేనాంగములు నాలుగు:— రథము, గజము, అశ్వము, పదాతి.

౧౩. శ్వేతాంబర జైన వేదగ్రంథములకు అంగము లని పేరు. ఇవి పండ్రెండు కలవు. అవి యేవన (౧) ఆచారాంగము (౨) సూత్రకృతాంగము (౩) స్థానాంగము (౪) సమవాయాంగము (౫) వ్యాఖ్యాప్రజ్ఞప్త్యంగము లేక వివాహప్రజ్ఞప్తి లేక భగవతి (౬) జ్ఞాతృధర్మకథాంగము (౭) ఉపాసకాధ్యయనాంగము (౮) అంతకృద్దశాంగము (౯) అనుత్తరోపపాదకదశాంగము (౧౦) ప్రశ్నవ్యాకరణాంగము (౧౧) విపాకసూత్రాంగము (౧౨) దృష్టిప్రవాదాంగము.

**అంగర** — ఇది తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకాయందలి గ్రామము. క్రీ. శ. ౧౯౨౧ సంవత్సరపుజనాభా ప్రకార మిచటిజనసంఖ్య ౩,౧౯౯.

**అంగరసింగి** — గంజాముజిల్లాయందలి పర్లాకిమిడి తాలూకా జమీందారీగ్రామము. జనసంఖ్య ౧౨౫.

**అంగరేజాబాదు** — బంగాళరాజధానిలోని మాల్డా జిల్లాయందొక పట్టణము. ఈపేరున కింగ్లీషువారిపట్టణ మని యర్థము.

**అంగల్ జిల్లా** — బేహారురాజధానియందలి ఒరిస్సాడివిజనునకు నైరృతిమూలగా స్వదేశసంస్థానములనడుమ నున్నయొక జిల్లా. ఇది ౨౦° ౧౩', ౨౧° ౧౦' ఉత్తరమును, ౮౩° ౫౦', ౮౫° ౪౩' తూర్పును నడుమ నున్నది. వైశాల్యము ౧,౬౮౧ చదరపుమైళ్లు. ఈజిల్లా అంగల్, ఖోండుమాలు అనురెండుసబుడివిజనులుగా విభజింపఁబడియున్నది. చెన్నపురరాజధానియందలి గంజాముజిల్లా ఈజిల్లాకు దక్షిణపు సరిహద్దు.

నైసర్గికస్వభావములు

అంగలుసబుడివిజనునందు కొండలు మెండుగాఁ గలవు. ఇచ్చట ౬౨౯ చదరపుమైళ్ల రక్షితారణ్యము కలదు. కొండలనడుమ వేసవియందెండిపోవు నసంఖ్యాకము లగువాఁగులు కలవు. వానిసాహాయ్యముననే యిచ్చట సేద్యము జరగుచున్నది.

ఖోండుమాలు అనుప్రదేశము ౧,౭౦౦ అడుగులు ఎత్తుగలపీఠభూమి. ఇచ్చట అడవులు ౫౦౦ ల చదరపుమైళ్లనేల నాక్రమించుచున్నవి. మహానదీ, బ్రాహ్మణీనదులందుఁ గలయు ఉపనదు లిచ్చటి కొండలయందే పుట్టుచున్నవి.

ఇందలియరణ్యము లెల్లతరగతులవన్యమృగములకును రక్షకస్థానములు. కారెనుములు, ఏనుఁగులు సాంద్రాటవులయందును, పెద్దపులులు, చిఱుతపులులు, తేళ్లు, అడవికుక్కలు మున్నగునవి చిట్టడవులయందును, ఎలుఁగుగొడ్లు అన్నికొండలమీఁదను ఉండును. ఈయడవిమృగములచే మానవాదిప్రాణులకును, పంటలకును గల్గునష్ట మపారము.

శీతోష్ణస్థితి

ఇచ్చటిశీతోష్ణస్థితి అనారోగ్యకర మైనది. ఈజిల్లాలో ఖోండుమాలులు మిక్కిలి అనారోగ్యకరము లైనవి. అచ్చట చలిజ్వరము లెక్కువగ నుండును.

వర్షపాత మిచ్చట అనిశ్చయము. ఒకవేళఁ గురిసినను జిల్లాయందంతట సమముగా కురియదు. సాంవత్సరికవర్షపాత మీజిల్లాకు సగటున ౫౩ అంగుళములు.

చరిత్ర

అంగల్ జిల్లా మొట్టమొదట నారణ్యకు లగుఖోండుజాతులకు నివాసస్థానము. పిదప వారలు హిందువులచే కొండదుర్గములలోనికిఁ దఱుమఁగొట్టఁబడిరి. అనేకశతాబ్దులు గడచినతరువాత ఒరిస్సాకొండప్రదేశములందున్న చిన్నసంస్థానము లనేకములు జగన్నాథయాత్రకు వచ్చిన రాజపుత్త్రులవశ మయ్యెను. మొదటిపరిపాలకు లెల్లరును పరస్పరము కుట్రలు పన్నుచు కలహించుచు నొండొరులదుర్గములం బట్టుకొనుచు వచ్చిరి. తుదకు అంగల్ రాజ్యముకూడ రాజపుత్త్రులచేతం బడియెను. ఇరుగుపొరుగుసంస్థానములవలెనే అంగల్ రాజ్యమును ఒక్కొక్కప్పుడు యుద్ధముల జయించి కొన్నికొన్ని గ్రామములం బట్టుకొనుచు, మఱి యొకప్పు డోటుపడి కొన్నిటిని నష్టపడుచువచ్చెను. ఒరిస్సాప్రాంతమునందు నాగరకత కొంతవఱకభివృద్ధి గాంచినను పర్వతప్రదేశములు మాత్ర మనాగరకములుగనే యుండెను. అచ్చటిపూర్వరాజు లెల్లరు జగన్నాథపురాజునకు సామంతులుగ నుండుట కంగీకరించిరి. ఆప్రదేశము లీస్టు ఇండియాకంపెనీవారియధీన మైనపుడు కొండరాజు లెల్లరు వారియొద్దనుండి సన్నదు లందుకొని కప్పము చెల్లించుట కొప్పుకొనిరి. ౧౮౪౬-వ సంవత్సరమున అంగల్‌ను పరిపాలించినరాజు సోమనాథసింగు. అతఁడు నిరంకుశాధిపత్య మొనర్చుచు, ప్రజాకంటకుఁడై యుండుటచే శీఘ్రముగనే తనదేశమునం దపకీర్తిని గాంచెను. ౧౮౪౬-౪౭ సంవత్సరములలో ఖోండుమాలులో ఖోండులపితూరీలలో సోమనాథసింగుకూడఁ గలియుటచే దొరతనమువారి కితనితో సంబంధము కలుగఁజేసికొనవలసివచ్చినది. పిదప దొరతనమువారికి శత్రువై యితఁడు వర్తించుటంజేసి ౧౮౪౭-వ సంవత్సరము డిశంబరు నెలలో వారు అంగల్‌ను తమరాజ్యమునకుఁ జేర్చుకొన్నట్లు ప్రకటించి, దానిని స్వాధీనము చేసికొనుటకును, రాజును బట్టుకొనుటకును కొంతసైన్యమును బంపిరి. కాని యొక్కతుపాకి నైనఁ బ్రేల్చకుండ అంగల్ రాజ్యము వారివశమయ్యెను. హజారిబాఘునందు రాజామరణము చెఱ నుంచఁబడెను. ౧౮౯౧-వ సంవత్సరము వఱకును అంగల్ రాజ్యము ఒరిస్సా 'ట్రిబ్యూటరీమహాలు'ల సూపరింటెండెంటుక్రింద నున్న తహాశీలుదారుని యధికారమున నుండెను. పిదప ఖోండుమాలులను జేర్చి అంగల్ ప్రత్యేకముజిల్లా చేయఁబడినది.

పూర్వము ఖోండుమాలులు బౌద్ స్వదేశసంస్థానములోని యొక భాగముగా నుండెను. కాని ఖోండులు స్వతంత్రులయట్లు నడచుచుండుటచే రాజు వారిని స్వాధీనపఱచుకొనుట కశక్తుఁడై యుండెను. ఖోండులలో నరబలు లధిక మైనందున బ్రిటీషుప్రభుత్వమువారు దురాచారము నణఁప నిశ్చయించుకొనిరి. అందువలన బౌద్ సంస్థానపురాజు ౧౮౩౫-వ సంవత్సరమున ఖోండులు నివసించినప్రదేశమును ప్రభుత్వమువారియధీనము చేయుట కంగీకరించెను. ఖోండులలో ప్రబలుచున్న నరబలుల నణఁచుటకు మొదట గంజాముసరిహద్దువరిగా ప్రత్యేకముగా నొకయేజెన్సీని చెన్నపురప్రభుత్వమువా రేర్పఱిచిరి. బౌద్ నివాసు లగుఖోండులు దొరతనమువారు తమ దురాచారము నణఁచుచున్నప్పుడు వారిని పెక్కువిధములఁ జిక్కులుపెట్టి, అంతతోఁ దృప్తినొందక తుదకు ౧౮౪౭-వ సంవత్సరమునందు పితూరీ కేగిరి. ఆయల్లరులెల్ల నణఁగినతరువాత ౧౮౫౫-వ సంవత్సరమందు వారిదేశపరిపాలనము కటకమునకు మార్పఁబడెను. ౧౮౯౧-వ సంవత్సరమువఱకును ఆప్రదేశ మొకతహసీలుదారుక్రింద నుండి పిదప అంగల్ జిల్లాయందలి సబుడివిజనుక్రిందఁ జేర్పఁబడెను.

ఈజిల్లాయందలిజనసంఖ్య ౧,౯౧,౯౧౧. వీరిలో నూటికి ౨౨ వంతున క్షుద్రదేవతారాధకు లగుఖోండులు కలరు. మిగిలినవారు హిందువులు. క్రైస్తవులు ౩౩ గ్గురు మాత్రము గలరు.

చరిత్రను, మతమును, భాషను ఒకపద్ధతి చట్టమును స్వకీయ మగుభూవసతిని గలిగినఖోండులు ఖోండుమాలులో నివసించు నొక ప్రత్యేకజాతిగాఁ గన్పట్టుచున్నారు. భూదేవి యనుగ్రహమును సంపాదించుటకుఁ దమమతధర్మము ననుసరించి నరబలు లొసంగుకతన ౧౮-వ శతాబ్ది యాదిని ఖోండులు ప్రాముఖ్యములోనికి వచ్చిరి. బలి యొసంగుటకు మనుజులను వారు కొనుచుండిరి. అట్టివారిని సంపాదించుట, వారి నలెనే యారణ్యకులగు 'పాను' లనువారి కర్తవ్యమై యుండెను. బ్రిటీషు ప్రభుత్వమువారిచే అతికష్టముమీఁద నీ నరబలు లణఁచివేయఁబడినవి. పానులు నేఁతకాండ్రు, పేరుపడిన దొంగలు.

ఖోండులు

ఉరియా, ఖోండు లేక కుయీ అచ్చటిభాషలు. ఖోండు తెలుఁగునకు సంబంధించిన ద్రావిడభాషలలోనిది.

అంగల్ నీటివసతి గల్గిన పల్లపుప్రదేశము. ఖోండుమాలులు మాత్రము పర్వతపీఠభూమిగా నున్నవి. వేసవికాలమం దడవులు కొట్టి తగులఁబెట్టి తొలకరించినవెంటనే విత్తులు చల్లుట ఖోండుల వ్యవసాయపుఁబద్ధతి. మొట్టమొదట నట్టి భూము లొకటిరెండుసంవత్సరములవఱకును వదలి వేయఁబడుచుండెడివి. కాని క్రమక్రమముగా జనసంఖ్య యభివృద్ధి యైనకొలఁది నదివఱ కున్న యలవాటు మాఱిపోయి ఏటవాలుప్రదేశము లెల్ల సరిగా సేద్యము చేయఁబడి తుదకు మధ్యమధ్య నాఁపుదలలు లేకుండ ప్రతిసంవత్సరమునను దున్నఁబడుచున్నవి. ఇచ్చటిముఖ్య మయినపంట వరి. సాగుచేయఁబడుచున్న విస్తీర్ణములో అది సగము భాగము నాక్రమించుచున్నది. అది ముఖ్యముగా అంగల్ సబుడివిజను నందుమాత్రమే పైరగుచున్నది. ఖోండుమాలులలో వరిపంట యతి స్వల్పము. ఖోండులు పండించుపంటలలో ముఖ్యమైనది పసుపు. వారు దాని నెగుమతి చేయుటకు విస్తారముగాఁ బండించుచున్నారు. అదిగాక జొన్నలు, కాయధాన్యములు, మొక్కజొన్నలు, నూనె విత్తులును వారు పండించుకడమపంటలు. సాగుచేయఁబడుప్రదేశము క్రమక్రమముగా ఎక్కుడగుచున్నది. అయినను సాగుచేయవలసిన ప్రదేశములు చాల మిగిలియేయున్నవి. ఇఱుకులోయలకడ్డముగా గట్లు వేయుచు, ప్రవహించునీటి నాఁపి, ఆచుట్టుప్రక్కల నున్నపొల ములకు పెట్టుకొని సేద్యము చేయుచున్నారు. అటువంటి అడ్డగట్లు అంగల్ లో ౫౦౦ లు కలవు.

వ్యవసాయము

నేలబొగ్గు అప్పుడప్పుడు కనఁబడుచుండుట కలదు. కాని దాని నింతదనుక నెవరును ఉపయోగింప లేదు. అచ్చటచ్చట ఇనుపరాయియు, అభ్రకమును దొరకుచున్నవి.

బట్టలనేఁతయు, గంపలు, చాపలు అల్లుటయు, ఇనుము, ఇత్తడి, కంచుపనులును ఇచ్చటిచేతిపనులు.

ఈజిల్లాకు కటకముతోడను, జగన్నాథము గంజాములతోడను వర్తకము కలదు. ధాన్యము, జొన్నలు, ఉలవలు, పెసలు, కాఁచు, బెల్లము, నూనెవిత్తులు, తోళ్లు, కొమ్ములు, పసుపు, ఇప్పపువ్వు, లక్క, తేనెయు ఈజిల్లానుండి ఎగుమతులు. అంగల్ సబుడివిజనులోని అంగల్, శంఖపురము, బాగ్దియాయు వర్తకవ్యాపారములముఖ్యస్థానములు.

వర్తకము

ప్రతిచోటను వర్షపాతము సమముగ లేకుండుటచే ఈజిల్లాకుఁ దఱచుగఁ గఱవు వచ్చుచుండును. ౧౮౯౭, ౧౮౯౮, ౧౯౦౦ ల సంవత్సరములలోఁ గఱవులు కలిగినవి. ఆయాసమయములందు జనులను కాటకపుబాధనుండి తప్పించుటకు దొరతనమువారు విశేషద్రవ్యమును వెచ్చించి యుండిరి.

కఱవులు

ఈజిల్లాను, ప్రత్యేకముగా నేర్పఱిచిన ౧౮౯౪-వ సంవత్సరపు ౧-వ చట్టము ననుసరించి యిది పరిపాలింపఁబడుచున్నది. పరిపాలన సౌకర్యముకొఱకై ఈజిల్లా రెండు సబుడివిజను లుగా విభాగింపఁబడియున్నది. అంగల్ ను, ఫుల్బానియు వరుసగా వానికి ముఖ్యస్థానములు. ఈజిల్లా అధికారి డిప్యూటీకమీషనరు. అంగల్ లో డిప్యూటీమేజస్ట్రేటును, ఖోండుమాలులో సబుడివిజనల్ ఆఫీసరును ఉందురు.

పరిపాలన

అంగల్ సబుడివిజనులో ౧౮౯౫, ౧౮౯౭-వ సంవత్సరములలో సెటిల్ మెంటు (Settlement) జరిగినది. ఇప్పటిశిస్తు రు. ౧,౦౦,౦౦౦ లు.

సర్బరాకారు లనుగ్రామకరణములచే పన్ను వసూలుచేయఁబడుచున్నది. వరి పండుభూముల కెకరమునకు దాదాపుగా రు. ౧-౫-౪ ను, తక్కినభూములకు రు. ౦-౮-౬ మొదలు రు. ౧-౨-౨ ల వఱకును పన్ను విధింపఁబడియున్నది. ఖోండుమాలులలో పన్ను చెల్లింపఁబడుట లేదు. రోడ్డుఫండునకుఁగాను అరకకు మూఁడణాలు పన్నుమాత్రము వసూలు చేయఁబడుచున్నది.

ఈజిల్లాయందు ౨ ఠాణాలును, ౬ 'నాకా' లును గలవు. ఇచ్చటి రక్షకభటసైన్యమున కసిస్టెంటుసూపరింటెండెంటు అధికారి. గ్రామరక్షకభటులపనిని చౌకీదార్లు అనువారు చూచుచున్నారు. ఆపనిని చేసినందులకు వారికి నౌకరీఈనాముల నిచ్చియున్నారు.

బేహారురాజధానిలోనున్న యేయితరజిల్లాకన్నను ఇచ్చట విద్య తక్కువగా నున్నది. ౧౯౧౧-వ సంవత్సరపు జనసంఖ్యనుబట్టి చూచిన నూటికి ఇద్దఱిచొప్పుననే చదువను వ్రాయను నేర్చియున్నారు. ఇప్పుడు క్రమముగా విద్య అభివృద్ధి నొందుచున్నది.

విద్య

(మ. సో. శ.)

**అంగల్ సబుడివిజను** — బేహారురాజధానిలోని అంగల్ జిల్లాలో ముఖ్యస్థానమును గలిగియున్న సబుడివిజను. ఇది ౨౦° ౩౨', ౨౧° ౧౦' ఉత్తరను, ౮౪° ౧౮', ౮౫° ౪౩' తూర్పును నడుమ నున్నది. వైశాల్యము ౮౮౧ చదరపుమైళ్లు. ఇది యెల్లఁ

పర్వత ప్రదేశము. ఇందు విశేషముగా అడవి కలదు. దక్షిణభాగమున సాత్పురాపర్వతశ్రేణియొక్క చివరభాగ మున్నది. నైరృతమూల నుండి వాయవ్యమూలగా బోవుచున్న పర్వతములవరుస దక్షిణదిక్కున నుండి మహానదిలో గలయు ఉపనదులయొక్కయు, ఉత్తరదిక్కున నుండి బ్రాహ్మణీనదిలో గలయు ఉపనదులయొక్కయు జలాధార స్థానము. ౧౯౧౧-వ సంవత్సరపు జనాభాలెక్కలనొప్పున ఇచ్చట చదరపుమైలునకు ౧౪౫ మంది జను లున్నారు. ఇచ్చట పన్నులు తక్కువగ నుండుటచే యిరుగుపొరుగు ప్రదేశములనుండి విస్తారముగా జను లిచ్చట నివసింప వచ్చుటకు గారణము. ఈసంస్థానమునందు ౮౫౩ గ్రామములు కలవు గాని యొక్క పట్టణ మయినను లేదు.

**అంగలకుదురు** — ఇది గుంటూరుజిల్లా తెనాలితాలూకా యందలి యొక ప్రధాన గ్రామము. ౧౯౨౧-వ జనాభా ప్రకార మిచటి జనసంఖ్య ౩,౮౬౫.

**అంగలూరు** — ఈ పేరుగల గ్రామములు ఒకటి గుంటూరు జిల్లా వినుకొండతాలూకాయందును, రెండవది కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాయందును ఉన్నవి. వీనిలో మొదటిది యీనాం గ్రామము. దీనిజనసంఖ్య కేవలము ౬౨౩. రెండవదాని జనసంఖ్య ౩,౫౮౫.

**అంగలేపపురి** — భారతవర్ష మునందలి యొకనగరము. ఇది పశ్చిమదిక్కున నుండును. (భారతవర్షాచా ప్రాచీనకోష్)

**అంగల్లు** — చిత్తూరుజిల్లా మదనపల్లితాలూకాయందలి గ్రామము. ఇందలిజనసంఖ్య ౧,౪౮౧.

**అంగవైరోచనుఁడు** — మూర్ధాభిషిక్తుఁ డయిన యొకరాజు. ఆత్రేయుఁ డను ఉదమయుఁ డితనికిఁ బురోహితుఁడు. (ఐతరేయ బ్రాహ్మణము)

**అంగసకల్లు** — ఇది బళ్లారిజిల్లా ఆలూరుతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩౯౬.

**అంగాం** — పారసీక సింధుశాఖ ముఖద్వారమునఁ గల యొకద్వీపము. ఇంచుమించుగ నెనిమిదిమైళ్లు పొడువు గలిగి యుండును. శిథిలములై యున్న గృహములనుబట్టియు, విశాలములగు నుపవన ప్రదేశములనుబట్టియు నొకకాలమున నీదీవి గొప్పవైభవము ననుభవించె నని తెలియవచ్చును. ఉత్తరపుదెస నొకపట్టణ ముండినజాడలుగూడఁ గానవచ్చును. దీనికి 'అంగార్' అనియుఁ బేరు కలదు.

**అంగాడీపురము** — చెన్నపురిరాజధానిలో నున్న మలబారుజిల్లాలోని యొక గ్రామము. ఇందలిజనసంఖ్య ౪,౫౦౦. ఇది వలవనాడుతాలూకాకు ముఖ్యస్థానము. ఇచ్చట నొకడిస్ట్రిక్టు మునసబును, స్టేషనరీసబుమేజస్ట్రేటును ఉందురు. ఇచ్చట వర్తక వ్యాపారము విస్తారము జరగును. గొప్ప మాహాత్మ్యముగల యొకపవిత్ర దేవాలయ మీగ్రామమం దున్నది. ౧౮౪౯ లో నిచ్చట మతావేశ లైనమాపిళ్ల లనుజాతివారు హిందువులతోఁ బ్రాణములకుఁ దెగించి పోరాడిరి.

**అంగార్** — 'భోర్' లోయయందలి యొక చిన్న జమీన్దారీ. దీనివైశాల్యము ౬౬ చ. మైళ్లు. ఇందు ౩౮ గ్రామములు కలవు. క్రీ. శ. ౧౬౯౬-వ సంవత్సరమున మహారాష్ట్ర ప్రభువులు సోనాపటేల్ కుంబీ అనువానికి దీని నొసంగిరి. నాఁట నుండియు నిది తద్వంశజులక్రిందనే యున్నది.

## అంగాపూర్కర్ (హరి)

— శాలివాహనశకము ౧౬౧౪ సంవత్సరమునాఁటి మహారాష్ట్రకవి. ఇతఁడు రచించిన గ్రంథము కేదారవిజయ మొక్కటియే లభించినది. దీనినిబట్టి యితఁడు హరినారాయణుఁ డనునతనికి శిష్యుఁడని తెలియుచున్నది. ఈగ్రంథమున ౩౫ అధ్యాయములు కలవు. కవులను స్మరించువిషయమునఁ గాళిదాసును బేర్కొన్న ప్రాచీనమహారాష్ట్రకవి యితఁ డొకఁడే.

## అంగామీనాగులు

— ఆస్సాముదేశమునకు దక్షిణ దిగ్భాగంబున నాగా యనుపర్వతం బొండు గలదు. రాజకీయవ్యవహారమున నాగాపర్వతము లొకజిల్లాగా నెంచఁబడును. ఇందు నాగా లను పేరుగల అనాగరకులైన ఆరణ్యకజాతివారి తెగలు పెక్కు గలవు. వారిలో అంగామీ లనఁబడువా రొక ముఖ్యమైనతెగలోనివారు. జనసంఖ్య ౨౬,౫౦౦. వీరియుత్పత్తినిగుఱించి పెక్కు కథలు కలవు. అందు నీక్రిందికథ యొకటి. ఆస్సాముదేశమునం దున్న జయంతపురపురాజు తమ్ముఁడు వదినెగారిని లేవఁదీసికొని దిమాపురమునకుఁ బోయెను. రాజసైన్య మచ్చటికిని వెంబడింప నతఁడు నాగపర్వతమునందు దాఁగి యుండెను. అతనిసంతతియే యిప్పటి అంగామీనాగులు. నాగులలో కడమతెగలవారు పొట్టివారుగను, కురూపులుగను ఉందురు కాని అంగామీనాగులుమాత్రము కురూపులు గారు. వీరిస్త్రీలు మిక్కిలి చక్కనివారు. పాతివ్రత్యాదిసుగుణభూషితలు. యుద్ధమునకు సిద్ధమై రణవేషమును ధరించిన అంగామీపురుషులు చూచుటకు వినోదముగ నుందురు. వీరు సాహసవంతులు; రణనిపుణులు; సాధారణముగా సత్యవ్రతులు. ఇంకొకతెగవారితో శత్రుత్వము వచ్చినయెడల నా తెగలోనిపురుషులను, స్త్రీలను, బాలురను నిర్దయులై సంహరించెదరు. ఒక్కొక్క అంగామీయొద్ద నొక్కొక్కపుఱ్ఱె యయినను ఉండవలయు నని వీరియభిప్రాయ మైయున్నది. అంగామీలయొక్కొక్క యిల్లు ఒక్కొక్కకోటగా నెంచవలయును. పర్వతశిఖరముమీఁద మిక్కిలి కఠినమైన స్థానమున వీ రిల్లు కట్టెదరు. తడవ కొక్కరుఁడు తప్ప నెక్కునజను లచ్చటికిఁ బోవీ లుండదు. నాగులలోఁ గడమ తెగలవారు వస్త్రములను ధరింపరు గాని అంగామీలుమాత్రము వస్త్రముల ధరించుటయేకాక మోటువస్త్రములనేఁతయు నెఱుంగుదురు. వీరు భూషణములనుగూడ ధరించెదరు. వివాహము కానిబాలికలకు నెత్తిమీఁద వెండ్రుక లుండవు. వివాహమైనతరువాత వెండ్రుకలఁ బెంచెదరు. వీరు వ్యవసాయమునుగూడఁ జేయుదురు. పర్వతముమీఁద

నచ్చుటచ్చుట రాతిగోడలను గట్టి విషమప్రదేశములను సమప్రదేశములుగా మార్చి యెంతయో తెలివిని గనఁబఱుచుచు కాలువలను దీసి పంటను బండించెదరు. తమయింటిచుట్టును ఈప్రకారము పంటలు పండించెదరు. వీరిలో రాజు లేఁడు. చిన్నచిన్న కుటుంబములవారు కలసి యుండెదరు. ఈకుటుంబమునకు ఖేల్ అని పేరు. ఒకపల్లెయం దిట్టిఖేలులు పెక్కు లుండును. ఏఖేలున కాఖేలు స్వతంత్రమై యుండును. ఒక్కొక్కఖేలున కొక్కొక్కసర్దారు లేక నాయకుఁ డుండును. వానికి ‘పిడమా’ యని పేరు. అతఁడు వృద్ధుఁడుగను, మాటకారిగను, గోధనము గలవాఁడుగను, యుద్ధమునందు శౌర్యముఁ జూపినవాఁడుగను ఉండును. సామాన్యవ్యవహారము లన్నియు నితఁడే పరిష్కరించును. రెండుతెగలవారు పోరాడునప్పుడు మూఁడవపక్షమువా రెవరిపక్షమును అవలంబింపక తటస్థులై యుందురు. వీరిలో వివాహ మైచ్ఛికము. పిల్లవాఁడును, పిల్లయుఁ బెద్దవారయిన తరువాత వివాహము జరగును. ఒకపురుషుఁ డొకస్త్రీని వరించి యాసమాచారము తనతండ్రితోఁ జెప్పును. అతఁ డాపిల్లతండ్రికి వార్త పంపును. అతఁడు సమ్మతించెనేని యీసంబంధము శుభప్రదమా, అశుభప్రదమా యని కోడిని గోసి శకునము చూచెదరు. అశుభశకున మైనచో సంబంధము మానుకొందురు. శుభశకున మయినయెడల నాసమాచారము పెండ్లికూఁతునకుఁ దెల్పెదరు. ఆపిల్ల కీపురుషుఁ డిష్టము కానియెడల మూఁడుదినములలోపలఁ దెల్పవలయును. ఆమె సమ్మతించినయెడల కొన్నియుత్సవములతో వివాహము జరగును. ఒకపురుషున కేకకాలమున నొకభార్యయే యుండును. వీరిలో దాంపత్యవిమోచనమును, వితంతువివాహమును గలవు. వీరు చచ్చినవారిని తమగృహములకు నాతిదూరమునఁ బాఁతివేయుదురు. సమాధిలో బియ్యము, ప్రప్పు మొదలైనవి వేసి పూడ్చెదరు.

**అంగార** — ఆసియాఖండములోని రషియాదేశమునందలియొకనది. ఇది యొకసరస్సులో పడి యటనుండి మరల వెలువడి ప్రవహించుటవలన దీనిని రెండునదులుగా వ్యవహరించుటయుఁ గలదు. ఇది బైకలుసరస్సునకుఁ దూర్పున నుండుపర్వతములలోఁ బుట్టి రమారమి ౩౦౦ల మైళ్లు ప్రవహించి బైకలుసరస్సులో నుత్తరభాగమునందు ప్రవేశించుచున్నది. దానిదక్షిణపుచివరను మరల నిర్గమించి ఇర్కుట్స్కు పట్టణముప్రక్కగ ప్రవహించి ౧,౦౦౦ల మైళ్లు ప్రయాణముచేసి ఎనీసెహానదిలో సంగమించుచున్నది. ఈభాగమున అంగార నదికి టంగోన్స్కా యనుపేరును గలదు. ఈనది ప్రవహించుదేశమంతయు ఇర్కుట్స్కమండలము. నదీప్రవాహము సమము గాక అనేకపాతముల కాకర మైనందున వేగము మిక్కుటముగ నుండును. దీనికిరుప్రక్కల నుండుభూమి పలుపట్ల రమణీయము.

అంగారక — ఒకరాక్షసి. (భా. ప్రా.)

**అంగారకతైలము** — పండునిప్పులయందు పక్వము చేయఁబడుటచే నియ్యది యంగారకతైల మనంబరఁగు. దీని నాయుర్వేదతంత్రములయందలి జ్వరప్రకరణంబునఁ గాంచనగును.

పచ్చిలక్క, చాగ, పసుపు, మ్రానిపసుపు, మంజిష్ఠ, చేదుపుచ్చ, వాకుఁడు, సైంధవలవణము, చెంగల్వకోష్టు, సన్నరాష్ట్రకము జటామాంసి, పిల్లిపీచర వీనిని వెవ్వేఱుగ నొకటి న్నరపలము గ్రహించి మూర్ణముఁ జేసి యా చూర్ణమును నీటితోఁ గల్కమువలె ముద్ద యగునటులు నూరి, యాముద్దను ఎనిమిదిసేర్ల యావనాళము (కడుగునీళ్లు - కలి) రెండుసేర్ల మంచినూనెలోఁ గలిపి పండునిప్పులమీఁద క్రమముగ నీ రిగురునంతవఱకును కాఁచవలయును. మంచివాసనయు, రుచియు వచ్చుసమయమున నీ రంతయు నిగిరినట్లు తెలిసికొని మధ్యమపాకమును (కల్కము నెత్తి చేతితో నలిపి చూచిన నలుఁగుబిండివలె నలిగినను లేక నిప్పుమీఁద వేసిన చుఱచుఱ శబ్దము లేకయుండినను మధ్యమపాకము వచ్చిన దని తెలియునది) కనిపట్టి దింపవలయును.

*చేయు క్రమము.*

ఇట్లు సిద్ధమగుతైలమును సమయభేదముల నెఱింగి యభ్యంజన మొనర్చిన సంతత (ఏడుదినములు విడువక యుండుజ్వరము), సతత (ఒకయహోరాత్రమున రెండుతడవలు వచ్చి విడుచుజ్వరము), అన్యేద్యుష్క (ఒకయహోరాత్రకాలమున నొక్కమాఱు వచ్చి విడుచుజ్వరము), త్రైహిక (దినము విడిచి దినము వచ్చుజ్వరము), చాతుర్థిక (రెండుదినములు విడిచి యొకదినము వచ్చుజ్వరము) జ్వరములు, అస్థిగతజ్వరములు, పురాణజ్వరములు నివర్తించును.

*ఉపయోగము.*

(చక్రదత్త - కలకత్తాముద్రణము. పుట ౬౨)

**అంగారకుఁడు** — ఆకాశమండలి గ్రహవిశేషము. (గ్రహములకును, సామాన్యనక్షత్రములకును గలభేదము తెలిసికొనవలయునన్న “గ్రహములు” అనుశబ్దము చూడనగును). అంగారకునకు భౌముఁడు, మంగళుఁడు, కుజుఁడు, వక్రుఁడు, భూమిపుత్త్రుఁడు అను మాఱుపేళ్లు కలవు.

### ౧. వర్ణనము

సూర్యునిచుట్టును దిరుగుచుండెడిగ్రహములలో నంగారకుఁడు నాల్గవవాఁడు. ఇయ్యది మూఁడవగ్రహ మైనమనభూమికిఁ దరువాత నుండును. దీనికిఁ దరువాత నైదవగ్రహ మగుబృహస్పతి కలఁడు.

అంగారకగ్రహము సూర్యునియొద్దనుండి మధ్యమమానమున ౧౪, ౧౫, ౦౦, ౦౦౦ (పదునాలుగుకోట్ల, పదియైదులక్షల) మైళ్ల మీఁద నున్నది. మనభూమి సూర్యునియొద్దనుండి ౯, ౨౯, ౦౦, ౦౦౦ (తొమ్మిదికోట్ల యిరువదితొమ్మిదిలక్షల) మైళ్లమీఁద నున్నది. కావున నాయంతరమునుండి యీయంతరమును తీసివేయఁగా నంగారకుఁడు మనభూమియొద్దనుండి ౪, ౮౬, ౦౦, ౦౦౦ (నాలుగుకోట్ల యెనుబదియాఱులక్షల) మైళ్లమీఁద నున్నట్టు తేలుచున్నది. ఇది మధ్యమ

*అంతరము.*

మానము, అనఁగా నొకప్పు డంగారకుఁడు సూర్యునియొద్దనుండి యింత కంటెఁ దక్కువదూరమునం దుండును; ఒకప్పు డింతకంటె నెక్కుడు దూరమునం దుండును. కావున నీరెండు అంతరముల మధ్యమానము పైనఁ జెప్పఁబడినది. ఇట్లు కాలభేదమునుబట్టి యంతరభేద ముండు టకుఁ గారణ మే మనఁగా నంగారకునికక్ష్యయు (Orbit), నితర గ్రహములకక్ష్యలును పూర్తిగ వర్తులాకారములుఁ గలవి కావు. సూర్యుని చుట్టును గ్రహములు తిరుగుమార్గములకుఁ గక్ష్య లని పేరు. ఇవి పూర్తిగ వర్తులాకారముగ (వృత్తాకారముగ) నుండి సూర్యుఁడు కేంద్రస్థాన మున మధ్య నుండినయెడల సూర్యునకును, గ్రహములకును గలయంతర మెప్పుడును ఒకవిధముగనే యుండును. కాని గ్రహకక్ష్యలు దీర్ఘ వర్తులాకారముగ (అండవృత్తాకారముగ – Ellipse) నున్నవి. ఈదీర్ఘ వర్తులమునకు రెండుకేంద్రములు (Focii) ఉండును. సూర్యుఁ డొక కేంద్రస్థానమున నుండును. పూర్ణవృత్తముకంటె గ్రహకక్ష్యరూప మైన యీదీర్ఘవృత్తమునకు నెంతవఱకు తక్కువ యుండునో దానికి కేంద్రచ్యుతి (Eccentricity) యని పేరు. ఈచ్యుతి బుధునకుఁ దప్ప నితరగ్రహములకంటె నంగారకున కెక్కువ. అంగారకుని కేంద్రచ్యుతిపరిమాణము ౦.౦౯౩౩౦౯. ఇందుచే దీనికి సూర్యుఁడు నడుమ నుండక కొంచె మొకవైపున నుండును. అందువలన గ్రహములు సూర్యునిచుట్టును దిరుగునపు డొకప్పుడు సూర్యునకు సమీపమం దుండుటయు, నొకప్పుడు దూరమం దుండుటయుఁ దటస్థించును. గ్రహము సూర్యునకు దూరమునం దున్నప్పు డది యుచ్చస్థానమం దున్న దనియు (Aphelion), సమీపమం దున్నపుడు నీచస్థానమం దున్న దనియుఁ (Perihelion) జెప్పెదరు. అంగారకుఁ డుచ్చ స్థానమం దున్నప్పుడు సూర్యునకు ౧౫,౪౦,౦౦,౦౦౦ మైళ్లకంటె నెక్కువదూరమునను, నీచస్థానమం దున్నపుడు ౪,౮౬,౦౦,౦౦౦ మైళ్లదూరమునను ఉండును. ఈక్రిందిపటమువలనఁ బైవిషయములు స్పష్టపడఁగలవు.




౧-వ పటము

ఈపటమునందు "సూ" సూర్యుఁడు. గుండ్రముగాఁ జూపఁ బడినది యంగారకునికక్ష్య: అనఁగా నాగ్రహము సూర్యునిచుట్టును తిరుగుమార్గము. అంగారకగ్రహము అ ౧ అనుచోట నున్నప్పుడు సూర్యునకు దూరముగను, అ ౨ అనుచోట నున్నప్పుడు సూర్యునకు సమీపమందును ఉండు ననుట స్పష్టము. కావున అంగారకుఁడు అ ౧ అనుచోట నుచ్చస్థానమందును, అ ౨ అనుచోట నీచస్థాన మందును ఉన్నాఁ డని చెప్పవలెను.

ఇఁక భూమ్యంగారకులకు వానిచలనమువలనఁ గలుగునంతర భేదములను మాత్రము. అంగారకకక్ష్య భూకక్ష్యకు వెలుపల నున్నది. నడుమ సూర్యుఁడు; తరువాత భూకక్ష్య, తరువాత నంగారకకక్ష్య. కావున నొకప్పుడు భూమినడుమ, ఒకవైపు సూర్యుఁడు, మఱియొక వైపు అంగారకుఁడు ఉండుట తటస్థించును. అట్టిస్థితికి షడ్భాంతరము




౨-వ పటము – షడ్భాంతరము

(Opposition) అని పేరు. షడ్భాంతర మనఁగా ఆఱురాసుల యంతరము. సూర్యునకు, నంగారకునకు నట్టిస్థితిలో నాఱురాసుల యంతర ముండును. షడ్భాంతర మగునప్పుడు గ్రహములు సూర్యా స్తమయము కాఁగానే యుదయించి, సూర్యోదయమువఱకు నుండును. ఒకప్పుడు గ్రహమునకును, భూమికిని నడుమ సూర్యుఁ డుండుట తట స్థించును. అప్పుడు సూర్యునకును, ఆగ్రహమునకును యోగము (Conjunction) కలిగిన దందురు. అట్టియెడల గ్రహము లస్తమించి యుండును. సూర్యునకును, గ్రహమునకునుగలయంతరములో సూర్యు నకును, భూమికిని గలయంతరమును గలిపిన నాగ్రహమునకును, భూమి కిని యోగసమయమునఁ గలయంతరము వచ్చును. సూర్యునకును, గ్రహమునకును గలయంతరమునుండి సూర్యునకును, భూమికిని గల యంతరమును దీసివేసినయెడల షడ్భాంతరసమయమున భూమికిని ఆగ్రహమునకును గలయంతరము వచ్చును. కావున నంగారకుఁడు భూమియొద్దనుండి షడ్భాంతరమునప్పుడు ౪,౮౬,౦౦,౦౦౦ (నాలుగుకోట్ల యెనుబదియాఱులక్షల) మైళ్లమీఁదను, యోగసమయ మున ౨౩,౪౪,౦౦,౦౦౦ (ఇరువదిమూఁడుకోట్ల నలువదినాలుగు లక్షల) మైళ్లమీఁదను ఉండును: అనఁగా షడ్భాంతరకాలముకంటె యోగకాలమునందు నంగారకగ్రహము మనకు నైదురె ట్లెక్కుడు సమీపమం దుండును. అందువలన నంగారకుఁడు సూర్యునిసమీపమం దుండి, అప్పుడే యుదయ మై కాని అస్త మగుసమయము సమీపించు నప్పుడు గాని యెంతవాఁడుగఁ గానవచ్చునో యంతకుఁ బదు నైదురెట్లకంటెఁ బెద్దవాఁడుగ షడ్భాంతరకాలమందుఁ గానవచ్చును. ఈగ్రహము సూర్యునియొద్ద నున్నప్పుడు సాయంకాలము సూర్యాస్త మయ మయినకొలఁదికాలమునకే యస్తమించును; లేక యుదయమున

సూర్యోదయకాలమునకుఁ గొంచెముకాలముపూర్వమే యుదయించును. అప్పుడు దానిని గుర్తించుట మిక్కిలి కష్టము. అప్పు డది యొక చిన్న నక్షత్రమువలె నుండును. మధ్యాంతరవేళను తేజస్సునందు కొంచెము హెచ్చుతగ్గగ బృహస్పతిని పోలి యుండును (అంగారకుని మధ్యాంతరము యోగము స్పష్టముగఁ దెలియుటకై ౨-వ, 3-వ పటములఁ జూచునది).




3-వ పటము-యోగము

త్రిభాంతరము

గ్రహమునకును సూర్యునకును, మూఁడురాసులయంతరము కలిగెనేని దానిని త్రిభాంతర మందురు. సూర్యునకుఁ దూర్పునందు గ్రహమున్నపుడు జరగుత్రిభాంతరమును పూర్వత్రిభాంతర మందురు. ఇదియోగమునకుఁ బూర్వము సంభవించును. అప్పుడు సూర్యాస్తమయకాలమున గ్రహము మధ్యాహ్న దశయందు (ఆకాశమధ్యమున) నుండును. సూర్యునకుఁ బశ్చిమమున గ్రహ మున్నప్పుడు త్రిభాంతరమయ్యేనేని దానిని పశ్చాత్త్రిభాంతర మనియెదరు. ఇది యోగముతరువాత సంభవించును. అప్పుడు సూర్యోదయకాలమున గ్రహము మధ్యాహ్న దశయం దుండును.

అంగారకావలోకనమునకు ఉత్తమకాలము

అంగారకుఁడు నీచస్థానమం దున్నప్పుడు మధ్యాంతర మగునేని యప్పు డంగారకుఁడు భూమికి మిక్కిలి సమీపమం దుండును. సాధారణముగ నంగారకుఁడు ఆగస్టునెల ౨౬-వ తేదిని నీచస్థానమం దుండును. అప్పుడు మధ్యాంతర మగునేని అంగారకుఁడు మనకు మూఁడుకోట్లయేఁబదిలక్షలమైళ్లమీఁద నుండును. సాధారణముగ ఫిబ్రవరి ౨౨-వ తేదికి నంగారకుఁ డుచ్చస్థానమం దుండును. అప్పు డీ గ్రహము ఆఱుకోట్లముప్పదిలక్షలమైళ్లమీఁద నుండును. కావున నీ గ్రహము ఫిబ్రవరి నెలలోని మధ్యాంతరకాలమునకంటె నాగస్టునెలలోని మధ్యాంతరకాలమున రమారమి మూఁడున్నరరెట్లు ఎక్కుడు ప్రకాశవంతముగా నుండును. ఇట్టిసమయమును వేచి జ్యోతిష్కు లంగారక నిరీక్షణమును జేయుచుందురు. నీచమధ్యాంతరములలోను కొన్ని సంభవించినప్పటికంటెఁ గొన్ని సంభవించినప్పు డంగారకుఁడు భూమికి మిక్కిలి సమీపమం దుండును. ఇట్లు భూమ్యంగారకులు మిక్కిలీ సమీపమం దుండుమధ్యాంతరములు ౧౮౭౭ లోను, ౧౮౯౨ లోను, ౧౯౦౭ లోను, ౧౯౨౪ లోను సంభవించినవి.

౪-వ పటములో ౧౯౦౯ మొదలు ౧౯౪౧-వ సంవత్సరమువఱకు నంగారకునిసంబంధ మైనయనుకూలమధ్యాంతరము లెప్పు డెప్పు డేయే నెలలో ఆకాశమునం దెచ్చట సంభవించునో చూపఁబడినవి. ఈ పటములో వెలుపలిది అంగారకకక్ష; లోపలిది భూకక్ష. ఈ పటమువలన నిట్టిమధ్యాంతరములు మధ్యమమానమున ౧౬ సంవత్సరముల కొక్కసారి యనఁగా ౧౫ సంవత్సరముల కొకసారి గాని, ౧౭ సంవత్సరముల కొక్కసారి గాని తటస్థించును అని తెలియఁగలదు.



౪-వ పటము

ఆకారము

అంగారకుఁడు భూమికంటెఁ జిన్నవాఁడు (౫-వ పటముఁ జూడుఁడు). అంగారకునియక్షము (Axis) ౪,౧౯౦ మైళ్లు పొడుగున్నది: అనఁగా భూమియొక్కయక్షములో సగమునకంటెఁ గొంచె మధికము. ఏడుగు రంగారకు లైనఁగాని యొక భూమి కారు! అనఁగా అంగారక




౫-వ పటము

గ్రహగోళములవంటియేడుగోళములను గలిపి ముద్ద చేసినఁగాని భూమి యంతటిగోళము కానేరదు. అంగారకునిమీఁదిద్రవ్యమునకు భూమి

మీఁదిద్రవ్యమునకంటెఁ బదిరెట్లు గురుత్వము తక్కువ. గురుత్వమనఁగా భారము, బరువు. ఇచ్చటఁ బదిసేర్లు తూఁగువస్తువు అచ్చట నొకసేరే తూఁగవలెను. కాని అంగారకునియక్షము భూమియక్షమునకంటెఁ జిన్నది యైనందున నచ్చట గురుత్వాకర్షణము (Gravitation) భూమిమీఁదికంటె నెక్కువ. కావున ఈరెండుశక్తులును కలసి భూమిమీఁదివస్తువునకును, అంగారకునిమీఁదివస్తువునకును బరువువిషయమున ౨౬ కి ౧౦ వంతుల ప్రకారము సంబంధ మేర్పడినది: అనఁగా భూమిమీఁద ౨౬ సేర్లయెత్తున్నవస్తువు అంగారకునిమీఁదఁ దూఁచినయెడల ౧౦ సేర్లే యుండును! అంగారకునకును, మనకును రాకపోక లున్నయెడల వర్తకమునిమిత్తమున సరకులు భూమిమీఁదివా రంగారకునిమీఁదికిఁ దీసికొనివెళ్లిన నేమియు లాభ ముండదు; అంగారకునిమీఁదివారు భూమిమీఁదికిఁ దెచ్చిన మిక్కిలి లాభ ముండును!!

## దినములు - సంవత్సరములు

మన ముందునీభూమిమీఁద దినము అనఁగా భూమి తనచుట్టు నొక్కసారి తిరుగుకాలము. ఇది రమారమి ౨౪ గంటలకాల మని మన మెఱిఁగియే యుంటిమి. అట్లే యంగారకుఁడు తనచుట్టును తిరుగుకాలము అంగారకదిన మగును. భూమివలెనే అంగారకుఁ డాత్మప్రదక్షిణము చేసికొనుచు సూర్యప్రదక్షిణములు చేయుచుండును. అంగారకుఁడు తనయక్షముపై నొక్కయాత్మప్రదక్షిణము చేయుటకు ౨౪ గంటలు, ౩౭ మినిట్లు, ౨౨ $\frac{౩౩}{౫౦}$ సెకెండులు పట్టును. ఇదియే యీగ్రహముమీఁదిదినప్రమాణము. భూమివలెనే అంగారకుఁడును జీఁకటిగోళము. దానికి వెలుతురు సూర్యునివలనఁ గల్గును. కావున సూర్యునివంక నున్నభాగమున పగలును, దానికి నావల నున్నభాగమున రాత్రియు నుండును. ఇట్లు మనదినమునకంటె నంగారకునిదినము అఱగంట హెచ్చు.

అంగారకునిదినప్రమాణ మింత యని యెట్లు కనుఁగొని రని కొందఱకు సందేహము కలుగవచ్చును. దుర్భిణిలోనుండి యంగారకునిఁ జూచి దానిమీఁద నున్నయొకానొకచుక్కను గుర్తుపెట్టుకొని, యది క్రమముగాఁ గదలి మరల యథాస్థానమునకు అనఁగా మనదృష్టిపథమున కెంతకాలములో వచ్చునో కనుఁగొనినయెడల నాగ్రహము తనచుట్టు నెంతకాలములోఁ దిరుగునో తెలియును. పాశ్చాత్త్యజ్యోతిర్విదులు నక్షత్రశాలలలో నీగ్రహముయొక్క దైనందినగతిని మిక్కిలి సూక్ష్మమానముతోఁ బరీక్షించిరి.

భూమి సూర్యునిచుట్టు నెంతకాలములో నొక ప్రదక్షిణము చేయునో యంతకాలమును మనము సంవత్సర మందుము. అట్లే యంగారకుఁ డెన్నిదినములలో నొకసూర్యప్రదక్షిణము చేయునో యాదినములసంఖ్య కంగారకసంవత్సర మని పేరు. అంగారకుఁడు సూర్యునిచుట్టు ౬౮౬.౯౮ దినములకు అనఁగా స్థూలమానమున ౬౮౭ దినముల కొకసారి తిరిగి వచ్చును. మనసంవత్సరపుమానము స్థూలమానమున ౩౬౫ దినముల ౬ గంట లని చదువరు లెఱిఁగియే యుందురు. కావున అంగారకసంవత్సరము మనసంవత్సరమునకంటెఁ జాలఁ బెద్దది. మనకు నొకయేఁడు గడచి పైని ౩౨౨ దినము లయినఁగాని అంగారకున కొకసంవత్సరము కాదు. మనకు ౫౭ దినము లయినఁగాని వారి కొకసౌరమానము కానేరదు!

మనకు ఋతువు లున్నటులే యంగారకగ్రహముమీఁదను ఋతువు లున్నవి. భూమిమీఁదిఋతువులకు ముఖ్యకారణము భూమియొక్కయక్షము (Axis) దానికక్షుమీఁద నిట్టనిలువుగాఁ దిరుగక కొంచెము వంగి తిరుగుట. అట్లే యంగారకునియక్షముకూడ దానికక్షువైపు ౨౩ మొదలు ౨౪ అంశములవఱకు వంగి యున్నందున నచ్చటను ఋతువు లున్న వనియే యూహింపనచ్చును. కాని యచ్చటి సంవత్సరము మనసంవత్సరమునకంటెఁ బెద్దది గనుక ఋతువులును పెద్దవే యై యుండును. అచ్చట ౩౮౧ దినము లెండకాలమును, ౩౦౬ దినములు చలికాలమును ఉండును. అచ్చట వర్షకాల మున్నట్టు నిశ్చయముగఁ దెలియదు. ఈగోళముయొక్క పైసగముభాగమున నుత్తరగోళార్ధ మనియు, క్రిందిసగముభాగమునకు దక్షిణగోళార్ధ మనియుఁ బేళ్లు పెట్టుదము. గ్రహము ఉచ్చస్థానమం దున్నప్పుడు ఉత్తరగోళార్ధమును, నీచస్థానమం దున్నప్పుడు దక్షిణగోళార్ధమును మనకుఁ జక్కఁగఁ గనఁబడును. అప్పుడు సూర్యునివలన దక్షిణగోళార్ధమునకు నెక్కుడు ఉష్ణమును, ఉత్తరగోళార్ధమునకుఁ దక్కువయుష్ణమును గలుగును. కాని యుత్తరగోళార్ధమందలియుష్ణకాలము దక్షిణగోళార్ధమందలియుష్ణకాలముకంటె నెక్కుడుదినము లుండును.

## అంగారకగమనము

ఆకాశమునం దీగ్రహ మెట్లు తిరుగునో నిత్యము శ్రద్ధతోఁ జూచువారికిఁ బెక్కువింతలు కానఁబడును. కొంతకాల మిది తిన్నగ నడచుచుండును. కొంతకాలము దీనివేగము హెచ్చును. కొంతకాలము మిక్కిలి మందముగా నుండును. సాధారణముగాఁ బశ్చిమమునుండి తూర్పునకు ననఁగా నితరబహిర్వర్తిగ్రహములవలెనే అశ్వినినుండి భరణికిని, భరణినుండి కృత్తికకును పోవుచుండును. పోవుచుఁ బోవుచు నొకప్పుడు క్రమక్రమముగా మందమై యట్టె నిల్చిపోవును. దీనినే కుజస్తంభ మనియెదరు. ఇట్లు కొంతకాలము నిలిచి, మరలఁ బ్రయాణ మగును. కాని యీతడవ ముందునకుఁ బోవుటకు మాఱుగా వెనుకవెనుకకుఁ బోవ నారంభించును! అనఁగా కృత్తికనుండి భరణికిని, భరణినుండి యశ్వినికిని పోవును! ఇట్టిగమనమునకు వక్రగమనము (Retrograde motion) అని పేరు. ఇట్లగునప్పుడు గ్రహము వక్రించినది యనియెదరు. ఇట్లు కొంతకాలము వెనుకకుఁ బోయి యీగ్రహము మరలఁ దనపూర్వపుక్రమ మైనత్రోవను నడచుటకారంభించును.

పైన వర్ణింపఁబడినకుజస్తంభమును, కుజవక్రమును వ్యావహారికములే కాని పారమార్థికసత్యములు కావు. అవి నిజముగ జరగునవి

# అంగారకుడు



ఈ పటమును ఎమ్. ఆంటోనియార్డి వ్రాసెను. దీనిని ముప్పాతికమైలు దూరమునుంచి చూచినచో ఇది భూమికి మిక్కిలి దగ్గఱగ వచ్చినప్పటి అంగారకగ్రహమునకంటెను పరిమాణమున పెద్దదిగ నుండును. దీనినిబట్టియే మనకు ఈగ్రహమునకు ఎంతయంతరము (౪ కోట్ల ౮౦ లక్షల మైళ్లు) కలదో కొంత బోధపడగలదు.

కావు. అంగారకుఁ డండవృత్తమార్గముననే పోవుచుండును. ఎప్పుడును ముందునకుఁ బోవుచుండునే కాని వెనుకకుఁ బోఁడు. కాని భూమియొక్కచలనమునుబట్టియు, అంగారకునిచలనమునుబట్టియు మన కిట్టి దృగ్భ్రమ కలుగుచున్నది. భూమిమీఁదనుండి కాక నిశ్చల మైన మఱియొకగోళముమీఁదనుండి యంగారకచలనమును జూచితిమేని యీ విచిత్రము లేమియుఁ గానరావు.

గ్రహాదులస్థలముల నెఱుఁగుటకై యాకాశ మంతయుఁ బండ్రెండురాసులుగను, ఇరువదియేనిమిదినక్షత్రములుగను విభజింపఁబడినది. రాశినే యిల్లందురు. ఒక్కొక్కరాశి ౩౦ అంశములు (భాగములు - Degrees). ఖగోళ మంతయు నిట్లు ౩౬౦ అంశములు. అంగారకునకు, సూర్యునకు యోగము కలిగినప్పు డనఁగా నంగారకుఁ డొకవైపునను, భూమి మఱియొకవైపునను, నడుమ సూర్యుఁడును సమసూత్రమునం దుండుట తటస్థించినప్పు డంగారకునకును సూర్యునకును అంతరము లేనందున నాగ్రహము నిరంశ మగును: అనఁగా దూరముననుండి చూచుమనకు సూర్యుఁడును, అంగారకుఁడును కలసి యొక్కయింటనే యున్నట్లు కానవచ్చెదరు. అచ్చటనుండి యంగారకుఁడు మరలఁ బయన మయి పలుపోకలఁ బోవును. మొదటియింట (రాశిలో) ఇరువదియంశముల మేర నడచి, యా వెనుకఁ దూర్పున నుదయింప మొదలుపెట్టును. రెండవయింట సమగతికన్న హెచ్చగు అనుగతితో నడచును. దీనికి శీఘ్రగతి యని పేరు. మూఁడవయింట సమగతితో ననుగతిగ నడచును. దీనిని సమగతి యందురు. నాల్గవయింట సమగతికంటెఁ దక్కువగ నుండి క్రమముగ వృద్ధి యగువేగముతోఁ బోవును. దీనిని మందగతి యందురు. అయిదవయింట సమగతికంటెఁ దక్కువగ నుండి క్రమముగ తగ్గెడి వేగమున నడచును. దీనిని మంథరగతి యనియెదరు. ఆఱవయింట, ఏడవయింట సమగతికంటె తగ్గుచు వెనుకకు నడచును. ఇదియే వక్రగతి. ఎనిమిదవయింట సమగతికంటె హెచ్చినగతితో వెనుకకు నడచును. ఇది అనువక్రగతి. తొమ్మిదవయింట నిశ్చలముగ నుండును. ఇది వికలగతి లేక స్తంభము. పదియవయింట సమగతితోఁ బోవును. ఇది ఋజుగతి. పదునొకండవయింట, పండ్రెండవయింట సమగతికన్నఁ గ్రమముగ హెచ్చగువేగముతో నడచును. దీనికి శీఘ్రతరగతి యని పేరు. ఇట్లు సూర్యుని విడిచి మరల సూర్యునియొద్దకు వచ్చువఱకును ఈగ్రహము నడచునడకలకు మనవారు శ్రద్ధతోఁ బేళ్లుపెట్టిరి.

(వరాహమిహిరుఁడు)

స్థూలమానమునఁ జెప్పవలె నన్న అంగారకుఁడు సూర్యుని విడిచి ౩౬ దినములకు ౧౫ అంశముల దూరము చేరి, ౧౦౦ దినములకు ౬౦ అంశములు నడచి, ౧౦౦ దినములకు ౬౦ అంశములు పోయి, ౭౨ దినములకు ౯౦ అంశములు గడచి, ౬౦ దినములకు ౫౦ అంశములు దాఁటి, ౪౮౦ దినములకు ౭౦ అంశము లాక్రమించి యాకాశమున నొకప్రదక్షిణము పూర్తిచేసి ప్రారంభించినస్థలమునకు వచ్చును.

(వరాహమిహిరుఁడు)

అంగారకుఁడు మీన, మేష, ధను, వృశ్చికరాసులందు వక్రించెనేని ౫౬ దినములకు ౯ అంశములును, ౪౨ దినములకు ౭ అంశములును, ౬౦ దినములకు ౧౬ అంశములును నడచి యనుగతుఁ డగును.

వృషభ, మిథున, కన్యా, తులలలో వక్రించెనేని ౪౦ దినములకు ౭°, ౪౦ దినములకు ౧౦°, ౬౩ దినములకు ౧౭° నడచి యనుగతుఁ డగును: అనఁగా మరల క్రమమైనదిక్కునకుఁ బోవ నారంభించును.

కర్క, సింహములందు వక్రించెనేని ౪౪ దినములలో ౭°, ౪౦ దినములకు ౬°, ౬౦ దినములకు ౧౫° నడచి యనుగతుఁ డగును.

మకర, కుంభములలో వక్రించెనేని ౩౨ దినములలో ౬°, ౩౯ దినములకు ౯°, ౫౭ దినములకు ౧౫° నడచి యనుగతుఁ డగును.

షడ్భాంతరముదినమున గ్రహము రాత్రి యంతయుఁ గానవచ్చును. పూర్వరాత్రమంతయుఁ దూర్పువైపునను, ఉత్తరరాత్రమందుఁ బశ్చిమమువైపునను ఉండును. తరువాత పూర్వత్రిభాంతరమువఱకు ననఁగా గ్రహ మాకాశమందు ౯౦ అంశములు నడచువఱకుఁ గ్రమక్రమముగా సూర్యాస్తమయమునకుఁ బూర్వమే యుదయించుచు, మధ్యరాత్రికిఁ బూర్వమే ఆకాశమధ్యమునకు వచ్చును. సూర్యోదయమునకుఁ బూర్వ మస్తమించును. పూర్వత్రిభాంతరమునాఁడు గ్రహము పగలు మధ్యాహ్నమునప్పుడే యుదయించి, సూర్యాస్తమయమువఱకు నాకాశమధ్యమున నుండి మధ్యరాత్రివఱకే యస్తమించును. యోగమునాఁడు గ్రహము సూర్యునితో నుదయించి సూర్యునితో నస్తమించును. కాన నెవ్వరికిని గానరాదు. తరువాత పశ్చాత్త్రిభాంతరమునాఁటికి గ్రహము మధ్యరాత్రి యుదయించి, యుదయమువఱకు నాకాశమధ్యమునం దుండి పగలు మధ్యాహ్నమువఱ కస్తమించును. అప్పటనుండి మధ్యరాత్రికిఁ బూర్వమే యుదయించుచు, షడ్భాంతరమునాఁటికి సూర్యాస్తమయకాలమునకు నుదయించును.

కుజాస్తము

శుక్రబృహస్పతుల కున్నట్లు కుజునకుఁగూడ నప్పుడప్పు డస్తము కలదు. ప్రతినిత్యము గ్రహములకుఁ గల యస్తమునకంటె నీయస్తము వేఱు. గ్రహములు సూర్యుని మిక్కిలి సమీపించినపుడు వాని తేజస్సులో గ్రహము తేజస్సు లోపించిపోవును. దానినే అస్త మందురు. గురు,శుక్రులయస్తములను మనవారు పాటించెదరు. కాని అంగారకాస్తమును పాటింపరు. అంగారకునియస్తోదయము లన్నియు రమారమి ౨ సౌరసంవత్సరములు, ౪౯ దినములకాలమునకుఁ బూర్తి యగును. అంగారకుఁ డొకసారి యుదయించి ౨౧ లేక ౨౨ నెలలవఱకుఁ గానిపించుచుండును. తరువాత నస్తమించి ౩ మొదలుకొని ౫ నెలలవఱకును కనిపించకయుండును.

అంగారకుఁడు సూర్యునిచుట్టును తిరుగువేగము భూమివేగమునకంటె మందమై సెకను (లిప్త)కు దాదాపుగా పదునేనుమైళ్లనఁగా

గంటకు ౫౫,౦౦౦ మైళ్లచొప్పున నుండును. గ్రహ

వేగము

మునకు సూర్యునినుండి దూర మధిక మయినకాలం దిని, అనఁగా గ్రహ ముచ్చముగా నున్నప్పుడు సూర్యాకర్షణము తక్కు వగుటచేత గ్రహవేగము తగ్గుచుండును. ఈ గ్రహముయొక్క స్థిత్యాదులు స్థూలమానమున ౨ డేండ్ల ౪౯ దిన ముల కొక్కసారి పునరావృత్తు లగుచుండును: అనఁగా మరలమరల నావిధముగనే వచ్చుచుండు నని యర్థము.

భూమికిఁ జంద్రుఁ డెట్టులో అంగారకుని కట్లు చుట్టును దిరుగుచుండెడియుపగ్రహములు రెండు కలవు. ౧౮౭౭-వ సంవత్స రమువఱకు నీసమాచారము జ్యోతిష్కులకుఁ దెలి

ఇద్దరు చంద్రులు

యదు. ఈయుపగ్రహములు మిక్కిలి చిన్నవి యగుటచే నెట్టిదుర్భిణికిని గానవచ్చినవి కావు. అంగారకునకు నుపగ్రహములు లేవనియే జ్యోతి ర్విదులు నిశ్చయపఱుచుకొనిరి. కాని ౧౮౭౭ న నంగారకగ్రహము భూమికి మిక్కిలి సమీపించినపుడ్యాంతరకాలమందు ప్రొఫెసర్ హాల్ అను జ్యోతిష్కుఁడు మిక్కిలి పరిశ్రమ చేసి గొప్పదుర్భిణియొక్క సాయముచే నూతనముగ ఈరెండు ఉపగ్రహములను గనుఁగొనియెను. జ్యోతిర్విదులలోక మంతయు నచ్చెరువును, ఆనందమును పట్టఁ జాలఁడయ్యె!

ఈరెంటిలో నొకటి డీమస్ (Deimos) అనునది అంగార కునకు రమారమి ౧౪,౫౦౦ మైళ్లమీఁదను, రెండవది ఫోబోస్ (Phobos) అనునది అంగారకునకు రమారమి 3,౭౦౦ మైళ్లమీఁదను ఉన్నవి. కావున మొదటిదానిని వెలుపలి (Outer) యుపగ్రహ మనియు, రెండవదానిని లోపలి (Inner) యుపగ్రహ మనియు నందురు. వెలుపలియుపగ్రహ మంగారకునిచుట్టు 3౦ గంటల, ౧౮ మినిట్లు, ౫౪ సెకనులకాలమునకుఁ జుట్టివచ్చును. లోపలియుప గ్రహము ౭ గంటల, 3౯ మినిట్లు, ౧౪ సెకనులకాలమున కంగార కునిఁ జుట్టివచ్చును. ఇది యొకవింత. అంగారకునిమీఁదిదినము ౨౪ గంటల, 3౭ మినిట్లు. కావున ఈలోపల చంద్రుఁ డంగారకుని చుట్టును రోజునకు మూఁడుసారులు తిరిగివచ్చును! ఇన్నిసారులును ఈచంద్రునికళలకు క్షయవృద్ధులు కలుగును! ఇట్టివింత మఱియే గ్రహముమీఁదను గానరాదు. ఉపగ్రహ మెప్పుడును మూలగ్రహము దినప్రమాణమునకంటె నెక్కుడుకాలములోనే దానిచుట్టును తిరుగును. ఈయొకయుపగ్రహముమాత్రము తద్విరుద్ధముగ గ్రహముచుట్టును దినమునకు మూఁడుసారులు తిరుగును. అంగారకునిపై జను లున్న యెడల వారి కొక్కరాత్రి యిద్దఱుచంద్రులును, ఒకచంద్రునికళలు వెంటవెంట నభివృద్ధి యగుటయు, తగ్గుటయుఁ గానవచ్చి మిక్కిలి వినోదకరముగ నుండును. లోనిచంద్రుఁడు పశ్చిమమున నుదయించి, అయిదుగంటలనఱనే పాకాశమునం దుండి తూర్పున నస్తమించును. వెలుపలియుపగ్రహము తూర్పున నుదయించి క్షితిజము (Horizon) పై రెండుదినములకంటె నెక్కుడుకాల ముండి పశ్చిమమున నస్తమిం చును! ఈగ్రహము లాకారమునందు మిక్కిలి చిన్నవి. వీనివ్యాసము (Diameters) లిరువదిమైళ్లకంటెఁ గాని, ముప్పదిమైళ్లకంటెఁ గాని పెద్దవి కా వని తజ్జ్ఞులయభిప్రాయము. ఈయుపగ్రహము లంగార కునియుత్తర, దక్షిణ ధ్రువములయొద్దనుండి కానరావు. లోపలిచంద్రుని వెన్నెల మనచంద్రునివెన్నెలలో సగమువెల్తురు నిచ్చును.

ఇతరగ్రహములకంటె నంగారకగ్రహము నవలోకించుటయు, దుర్భిణిలోనుండి పరీక్షించుటయు నధికసుకర మగుటచే ఈగ్రహము మీఁదిస్థితినిగుఱించి మన కెక్కుడుసంగతులు తెలి

అంగారక లోకమందలి వింతలు.

సినవి. ఒకదినములోపల నంగారకగోళముయొక్క పైభాగ మంతయు మనకుఁ గానవచ్చును. జ్యోతి ష్కులు మూఁడునాలుగువందలసంవత్సరములనుండి యు నీగ్రహముపైఁ దాము చూచినవిశేషములను చూపుచుఁ బటముల వ్రాయుచున్నారు. ఇప్పు డీగ్రహముఛాయా పటములు తీయుచున్నారు. ఇందువలన నీలోకముమీఁద నేమి యున్నదియుఁ గొంతవఱకుఁ దెలియుచున్నది. ఈగ్రహముమీఁదఁ గొంతభాగము నలుపుగను, కొంతభాగ మెఱుపుగను, బచ్చగను కాన్పించుచున్నందున నలుపుభాగములు సముద్రము లనియు, మెఱుపు భాగములు భూఖండము లనియు వారు నిశ్చయించిరి. ఈప్రదేశముల కన్నిటికిని వేఱువేఱుపేళ్లు పెట్టిరి. కాని యిప్పటిజ్యోతిష్కులు నలుపు అనునది కేవలము నలుపు కా దనియు, ఇనుమురంగునకును, ఆకుపచ్చరంగునకును మధ్యవర్ణముగ నుండు ననియు, ఎఱుపనునది కేవల మెఱుపు గాక నారింజరంగులో నెక్కుడుతెలుపు గలిపిన నెట్లుండునో యావర్ణ మనియు వర్ణించెదరు. నలుపుభాగముగం గొప్ప దును ఒకటేవిధముగ నుండక ఋతుమానమును బట్టి మాఱుచుండును. ఎండకాలమున నాకుపచ్చగను, శరదృతువులోఁ గొంచెము పసుపు పచ్చగాను గానవచ్చును. ఈప్రదేశములలోనుండి కాలువలుకూడఁ బోయిన ట్లున్నందున నవి సముద్రములు కా వనియు, వృక్షాదులు పెరిగియున్నప్రదేశము లనియు నిప్పటివారిమతము. నల్లగాఁ గాన వచ్చు రెండుమూఁడుప్రదేశములుమాత్రము సముద్రము లై యుండ నోపు. ఈగోళముమధ్యరేఖకుఁ జుట్టు నున్నప్రదేశములు విశాలము లైనయిసుకమైదానములవలెఁ గానవచ్చుచున్నవి. అంగారకునిమీఁద మిక్కిలి పెద్ద వైనపర్వతములు లేనందున సమప్రదేశములే విశేష ముగాఁ గానవచ్చును.

ఈగోళములోనియుష్ణకటిబంధమునందును, సమశీతోష్ణకటిబం ధమునందును అప్పుడప్పుడు తెల్లచుక్కలు కానవచ్చును. అవి యా గోళమున మంచు పేఱినందునఁ గానవచ్చు నని యూహించెదరు. చలికాలమందు సమశీతోష్ణప్రదేశము కొంతవఱకుఁ దెల్లనివస్త్రము పరి ధానముచేసికొన్న ట్లుండును. ఇవి బహుశః మేఘము లై యుండనోపు!

అంగారకునిమీఁదివింతలలో నచ్చటికాలువ లొక పెద్దవింత యై యున్నవి. వేలకొలఁదిమైళ్లు పొడువుగల కాలువలు గ్రహముమీఁద

అంగారద్వ్యామ్లజనిదము రెండవయాంగారికవాయువు. ఇందు ౧౨ భాగములయంగారమునకు 3౨ పాళ్లు ప్రాణవాయు వుండును. సున్నపురాలను గాని, సోడా ఉప్పును గాని శంఖద్రావకములో (Hydro-chloric acid) కరఁగించినప్పు డంగారద్వ్యామ్లజనిదము కలుగును.

సీమసున్నమును పొడిచేసి యొకగాజుకుప్పెయం దుంచి దాని బిరడాగుండా ఒకవక్రనాళికను, మఱియొక కరాటగొట్టము (Funnel tube)ను దూర్పవలెను. వక్రనాళిక యొక్క రెండవకొన నొకసీసాలోనికి దింపి కరాటగొట్టముగుండా శంఖద్రావకమును బోయవలెను. వెంటనే గాజుకుప్పెలో 'గుడ' 'గుడ' ధ్వని పుట్టును. ఇప్పుడు సీసాలో సున్నపుతేటను బోసినయెడల నది తెల్లఁబడును. ఇది కర్బనద్వ్యామ్లజనిదము వచ్చుచున్న దని సూచించును. ప్రాణికోటి లోపలికిఁ బీల్చెడిప్రాణవాయువు ఊపిరితిత్తులయందు బొగ్గుపులుసువాయువుగా మాఱి ఉచ్ఛ్వాస,నిశ్వాసములు జరుగునప్పుడు వెలువడును. ఈవాయువు ప్రాణహానికర మగునది కావున జంతువులను దీనిలోఁ బడవైచినప్పుడవి చనిపోవును. తడిసున్నమునఁ గలసినప్పుడు సున్నముయొక్క గాటు చచ్చి సీమసున్నమువంటిపదార్థ మేర్పడును.

ప్రయోగము

అంగారద్వ్యామ్లజనిదము నీటిలోఁ గరఁగుటవలన 'సోడావాట' అగుచున్నది. సోడాబుడ్డి కొట్టునప్పు డీవాయువు బుడగలుగ బయలుదేరి బుసబుస మని పైకి వచ్చును. తక్కిన యాంగారికద్రవ్యములను గుఱించి 'సచేతనరసాయనశాస్త్ర' మనువ్యాసమునందు సవిస్తరముగ వ్రాయఁబడును.

(వే. వి. శ.)

**అంగారవాహిక** — భారతవర్షమునందలి యొకనది. (భార. భీష్మ. అ ౯)

**అంగారుఁడు** — ఒకరాజు. ఇతఁడు మాంధాతతోఁ బోరాడెను. (భార. శాంతి. అ. ౨౯)

**అంగిందశిఖరము** — మలబారునందలి పడమటి కనుమలలోఁగల గొప్పశిఖరములలో నిది యొకటి. నీలగిరిసరిహద్దులలో నున్నది. దీనియెత్తు ఇంచుమించుగ ౮,౦౦౦ ల అడుగు లుండును.

**అంగిరసుఁడు** — ౧. (స్వాయం. వం.) ఉత్తానపాదవంశీయుఁ డైనయుల్ముకుఁ డనురాజునకుఁ బుష్కరిణి యను స్త్రీయందుఁ గల్గినయాఱ్గురుపుత్త్రులలో నైదవవాఁడు.

(భాగ. స్కం ౪)

౨. స్వాయంభువమన్వంతరమునందుఁ బ్రజోత్పాదనార్థము బ్రహ్మదేవుఁడు పదుగురు మానసపుత్త్రులఁ బుట్టించెను. వారిలో అంగిరసుఁ డొక్కఁడు. ఇతఁడు బ్రహ్మదేవుని ముఖమునుండి పుట్టెను (భాగ. 3 స్కం. అ ౧౨. శ్లో, ౨౨-౨౪). కర్దమప్రజాపతికూఁతు రగు శ్రద్ధ యీతనిభార్య. ఆమెయం దితనికి బృహస్పతి, ఉతథ్యుఁడు, సంవర్తుఁడు అనుముగ్గురుపుత్త్రులును, సినీవాలి, కుహూ, రాక, అనుమతి యనునల్గురు కన్యలును పుట్టిరి. ఈమన్వంతరమున మహాదేవునిశాపముచే బ్రహ్మమానసపుత్త్రు లందఱును భస్మీభూతు లయిరి (చూడు: మహర్షులు).

3. పూర్వపు బ్రహ్మమానసపుత్త్రులు మరణముఁ జెందఁ బ్రజోత్పాదనార్థము బ్రహ్మదేవుఁడు వారిని మరల వైవస్వతమన్వంతరారంభమునందుఁ బుట్టించెను. ఇతఁడు వరుణునియజ్ఞమునందుఁ బుట్టిన ముగ్గురుఋషులలో నొక్కఁడు. ఇతనికి వారుణ్యాంగిరసుఁ డని పేరుగలదు. వరుణయజ్ఞమునందలియగ్ని యీతనిని పుత్త్రత్వమున స్వీకరించెను (మత్స్య. అ ౧౯౪). అగ్ని కొంతకాలమునకు భూమిమీఁదనుండి యదృశ్యుఁ డైనప్పు డీతఁ డగ్నియై యాతనికార్యములను చక్కఁబెట్టెను. (భార. వన. అ ౨౧౭)

ఈకథ మఱియొకవిధముగఁ జెప్పఁబడుచున్నది. "తొల్లి యగ్నిదేవుఁడు దేవతలయందలి యలుకచే హవ్యంబుల వహింప నొల్లక వనమునకుఁ జన దేవత లధికతపోవిజృంభితుఁ డగునంగిరసుని అగ్నిపదమునం దుంచిరి. అంతఁ గొంతకాలమునకు వెనుక నగ్ని మరలి రాఁగా అంగిరసుఁ డతనిని ప్రథమాగ్ని యై యుండు మని తా నతనికి ప్రథమపుత్త్రుఁ డయి అగ్నిసారూప్యమునఁ దేజరిల్లె. ఈరూపమున నితనికి 'శివ' యనుభార్యయందు బృహజ్జ్యోతి, బృహత్కీర్తి, బృహన్మఖుఁడు, బృహన్మతి, బృహద్భానుఁడు, బృహస్పతి, బృహన్ బ్రహ్మ అనునేడుగురు కొడుకులును, అనుమతి, రాక, సినీవాలి, కుహూలవు, అర్చిష్మతి, హవిష్మతి, మహామతి అనునేడుగురు కూఁతులును పుట్టిరి. వీరును, వీరిసంతతివా రందఱును అగ్నిస్వరూపు లయియుండురు" (పు. నా. చం).

ఇతనికి మరీచిఋషికన్య యైనసురూప భార్య. బృహస్పతి, ఉతథ్యుఁడు, పయస్యుఁడు, శాంతి, ఘోరుఁడు, విరూపుఁడు, సంవర్తుఁడు, సుధన్వుఁడు అను నెనమండ్రీతనిపుత్త్రులు (భార. అను. అ ౮౫).

ఈ ఋషి కాంగిరసు లనుపదుగురు పుత్త్రులు పుట్టినట్లు కానవచ్చుచున్నది. వారిపేళ్లు: ఆత్మ, ఆయువు, దముఁడు, దక్షుఁడు, సదుఁడు, ప్రాణుఁడు, హవిష్మంతుఁడు, గవిష్ఠుఁడు, ఋతుఁడు, సత్యుఁడు (మత్స్య. అ ౧౯౫).

ఇతనివంశమునం దీతనితోఁ గూడ ముప్పదిముగ్గురుఋషులు మంత్రద్రష్ట లైరి. వా రెవ్వ రనిన, ౧. అంగిరసుఁడు ౨. త్రితుఁడు 3. భరద్వాజుఁడు ౪. లక్ష్మణుఁడు ౫. కృతవాక్కు ౬. గర్గుఁడు ౭. స్మృతి ౮. సంకృతి ౯. గురువీతుఁడు ౧౦. మాంధాత ౧౧. అంబరీషుఁడు ౧౨. యువనాశ్వుఁడు ౧3. పురుకుత్సుఁడు ౧౪. స్వశ్రవుఁడు ౧౫. సదస్యవంతుఁడు ౧౬. అజమీఢుఁడు ౧౭. అస్వహార్యుఁడు ౧౮. ఉత్కలుఁడు ౧౯. కవి ౨౦. పృష

దశ్వుఁడు ౨౧. విరూపుఁడు ౨౨. కావ్యుఁడు ౨౩. ముద్గలుఁడు ౨౪. ఉతథ్యుఁడు ౨౫. శరద్వంతుఁడు ౨౬. వాజశ్రవుఁడు ౨౭. అపస్యౌషుఁడు ౨౮. సుచిత్తి ౨౯. వామదేవుఁడు ౩౦. ఋషిజుఁడు లేక ఉశిజుఁడు ౩౧. బృహచ్ఛ్లుఁడు ౩౨. దీర్ఘతముఁడు ౩౩. కక్షీవంతుఁడు.

కేవలాంగిరసులు, గౌతమాంగిరసులు, భారద్వాజాంగిరసులు అని యీవంశము యొక్క ముఖ్య శాఖలు మూఁడు

మొదటివా రగుకేవలాంగిరసులలో హారీత, కుత్స, కణ్వ, రథీతర, విష్ణువృద్ధ, ముద్గలు లను నాఱు భేదంబులు కలవు. వీరి ప్రవరల వివరము: హారీతకులోత్పన్నులు ఆంగిరస, ఆంబరీష, యౌవనాశ్వ లను త్రిప్రవరులు. కుత్సకులోత్పన్నులు ఆంగిరస, మాంధాతృ, కౌత్స లను త్రిప్రవరులు. కణ్వకులోత్పన్నులు ఆంగిరస, ఆజమీఢ, కాణ్వులను త్రిప్రవరులు. మఱియు వీరిలోఁ గొందఱు కాంగిరస, వైరూప, పార్షదశ్వ లను వేఱు ప్రవరలును గలవు. విష్ణువృద్ధకులోత్పన్నులు ఆంగిరస, పౌరుకుత్స్య, త్రాసదస్యవు లను త్రిప్రవరులు. ముద్గలకులోత్పన్నులలోఁ గొందఱకు తార్క్ష్య, భార్మ్యాశ్వ, మౌద్గల్యము లను త్రిప్రవరములును, కొందఱు కాంగిరస, తార్క్ష్య, మౌద్గల్యము లను త్రిప్రవరములును గలవు.

రెండవది యగుగౌతమాంగిరసవంశమాలికలోఁ బది భేదములు కలవు. ౧. ఆయాస్య గోత్రము; ఆంగిరస, ఆయాస్య, గౌతమ ప్రవరలు. ౨ శారద్వత గోత్రము; ఆంగిరస, గౌతమ, శారద్వత ప్రవరలు. ౩. కౌమండ గోత్రము; ఆంగిరస, ఔచథ్య, కాక్షీవత, గౌతమ, కౌమండ; ఆంగిరస, ఔచథ్య, గౌతమ, ఔశిజ, కాక్షీవత; ఆంగిరస, - ఆయాస్య, ఔశిజ, గౌతమ, కాక్షీవత - అనుమూఁడువిధము లైనపంచప్రవరలు కలవు: మఱియు, ఆంగిరస, ఔచథ్య, కాక్షీవత; ఔచథ్య, గౌతమ, కౌమండ — అను రెండువిధము లైన త్రిప్రవరలు కలవు. ౪. దీర్ఘతమస గోత్రము; ఆంగిరస, ఔచథ్య, కాక్షీవత, గౌతమ, దైర్ఘతమస — అను పంచప్రవరలును, ఆంగిరస, ఔచథ్య, దైర్ఘతమసము లను త్రిప్రవరలును కలవు. ౫. కరేణుపాల గోత్రము; ఆంగిరస, గౌతమ, కారేణుపాల ప్రవరలు. ౬. వామదేవ గోత్రము; ఆంగిరస, వామదేవ్య, గౌతమ త్రి ప్రవరలు లేక ఆంగిరస, వామదేవ్య, బార్హదుక్థ త్రిప్రవరలు. ౭. ఔశనస గోత్రము; ఆంగిరస, గౌతమ, ఔశనస త్రిప్రవరలు. ౮. రహూగణ గోత్రము; ఆంగిరస, రాహూగణ, గౌతమ త్రి ప్రవరలు. ౯. సోమరాజ గోత్రము; ఆంగిరస, సౌమరాజ్య, గౌతమ త్రి ప్రవరలు. ౧౦. బృహదుక్థ గోత్రము; ఆంగిరస, బార్హదుక్థ, గౌతమ త్రిప్రవరలు.

మూఁడవది యగుభారద్వాజాంగిరసవంశమునందు ముఖ్య భేదములు నాలుగు: ౧. భారద్వాజ ౨. గర్గ ౩. ఋక్ష ౪. కపివంశములు. వారిలో భారద్వాజకులోత్పన్నులును, వారి ప్రవరలును ఇట్లున్నవి: రెండవయుచథ్యుఁడు, రెండవగౌతముఁడు, తౌలేయుఁడు, అభిజిత్తు, సార్ధనేమి, లౌగాక్షి, క్షీరుఁడు, కౌష్ఠికి, రాహుకర్ణి, సౌపరి, కైరాతి, సామలోమకి, పైష్కుంజితి, భార్గవత్, పోరీడవుఁడు, కారోటుకుఁడు, సజీవి, ఉపబిందు, సురైషి, వాహినీపతి, వైశాలి, కోష్ఠుఁడు, ఆరుణాయని, సోమోత్రాయని, కాసోరు, కైశిల్యుఁడు, పార్థివుఁడు, రౌహిణ్యాయని, రేవాగ్ని, మూలపుఁడు, పాండు, క్షుపావిశ్వకరుఁడు, అరి, పాచికారేవి — వీ రందఱు ఆంగిరస, ఔచథ్య, ఔశిజప్రవరులు. గర్గకులోత్పన్నులు ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, శైన్య, గార్గ్య లను పంచప్రవరులును, ఆంగిరస, శైన్య, గార్గ్య లను త్రిప్రవరులును గలరు. వీరిలో ఆంగిరస, తైత్తిర, కాపిభువు లన్న ప్రవరలు గల భేద మొకటి గలదు. ఋక్షకులోత్పన్నులు ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, వాందన, మాతవచసు లను పంచప్రవరులును, ఆంగిరస, వాందన, మాతవచసు లను త్రిప్రవరులును గలరు. కపికులోత్పన్నులు ఆంగిరస, ఆమహాయ్య, ఔరుక్షయ్యు లను త్రిప్రవరులు.

పైన వర్ణింపఁబడినవారు గాక యీశాఖయందు ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజప్రవరలు గలయీ క్రిందిఋషులు కానవచ్చుచున్నారు: ఆత్రేయాయని, సౌవిష్ట్యుఁడు, అగ్నివేశ్యుఁడు, శిలాతలి, బాలిశాయని, ప్రాలేపి, వారాహి, బాష్కలి, సౌటి, త్రికర్ణి, ప్రావహి, ఆశ్వలాయని, రెండవవారాహి, బర్హిసాది, శిఖాగ్రీవి, కారకి, మహాకపి, ఉడుపతి, కౌచకి, ధూమితుఁడు, పుష్పాన్వేషి, బ్రహ్మతన్వి, సోమతన్వి, సాలాడి, బాలడి, దేవరాతి, దేవస్థాని, హరికర్ణి, సరిద్భువి, ప్రాలేపి, సాద్యసుగ్రీవి, గోమేధగంధికుఁడు, మత్స్యాచ్ఛాద్యుఁడు, మూలోహరుఁడు, ఫలాహారుఁడు, గాంగోదధి, కౌరుపతి, కౌరుక్షేత్రి, నాయకి, జైత్యద్రోణి, జైహ్వలాయని, ఆపస్తంబి, మార్జవృష్టి, మరార్ష్టపింగలి, పైలుఁడు, శాలంకాయని, ద్వ్యాఖ్యేయుఁడు, మారుకుఁడు. ఆంగిరస, సాంకృత్య, గౌరవీతు లని త్రిప్రవరులు ఈక్రిందిఋషులు కానవచ్చుచున్నారు: కపీతరుఁడు, స్వస్తితరుఁడు, దాక్షి, శక్తి, పతంజలి, భూయసి, జలసంధి, బింటు, మాది, కుసీదకి, ఊర్వుఁడు, రాజకేశి, వౌషడి, శంసపి, శాలి, కలశకంఠుఁడు, కారీరయుఁడు, కాట్యుఁడు, ధాన్యాయని, భావాస్యాయని, భారద్వాజి, సౌబుధి, లఘ్వి, దేవమతి, రెండవయాంగిరసుఁడు, దముఁడు, బాహ్యుఁడు, ఉరుక్షయుఁడు, పరస్పరాయణి, అపర్ణి, లౌక్షి, గార్గ్యుఁడు, హరి, గాలవి, ప్రాతిమాషుఁడు, తండి.

ఆంగిరస, మాత్స్యదగ్ధ, మౌద్గల్య లను త్రిప్రవరలు గలవారీక్రిందిఋషులు: విష్ణువృద్ధి, శివమతి, జతృణుఁడు, కతృణుఁడు, పుత్రవుఁడు, వైరపరాయణుఁడు.

ఆంగిరస, తార్క్ష్య, మౌద్గల్య లను త్రిప్రవరు లీక్రిందివారు: హంసజిహ్వుఁడు, అగ్నిజిహ్వుఁడు, దేవజిహ్వుఁడు, విరాడపుఁడు, అపాగ్నేయుఁడు, అశ్వయుఁడు, పరణ్యుఁడు, స్తాపి, రెండవ మౌద్గల్యుఁడు.

అపాండు, గురువు, శకటాయనుఁడు, ప్రాగాథుఁడు, మానారి, మార్కండుఁడు, అమరణుఁడు, శివుఁడు, కటువు, మర్కటపుఁడు, నాడాయనుఁడు, శ్యామాయనుఁడు అనువారలు ఆంగిరస, ఆజమీఢ, కాణ్వు లనుత్రిప్రవరములు కలవారు.

ఆంగిరస,బార్హస్పత్య, భారద్వాజ, మాంత్రవర,ఆత్మభువులు ; ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, శౌంగ, శైశిరులు అని యాంగిరసగోత్రమునందు రెండువిధములయిన పంచప్రవరలు కలవు. కాని గార్గ్య, ఋక్ష, భరద్వాజ, హుత, ఆక్షీల, శౌంగఋషు లాంగిరసగోత్రములోనికిఁ బరగోత్రమునుండి వచ్చిరి గనుక ద్వ్యాముష్యాయణులు; అనగా ద్విగోత్రులు అని యెఱుంగునది.

౮. ఒక బ్రహ్మర్షి : జనమేజయుని సర్పసత్రమునందు 'బ్రహ్మ' యను ఋత్విజుఁడుగా నుండెను (చూడు: జనమేజయుఁడు). (భా. ప్రా. కో.)

**అంగిరుఁడు** — ఉల్ముకుని కుమారుఁడు. అంగనితమ్ముఁడు. ఇతనిభార్య స్మృతి.

**అంగిరేకులపాడు** — నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకాయందలి జమీన్దారీగ్రామము. జనులమొత్తము ౨౭౮.

**అంగుఁడు** —౧. (స్వాయంభువవంశము) ఉత్తానపాదవంశజుఁడగు ఉల్ముకుఁడను రాజునకుఁ బుష్కరిణియను స్త్రీయందుఁ బుట్టిన యార్గురుపుత్త్రులలోఁ బెద్దవాఁడు. వీనిభార్య సునీథ. వేనుఁ డనువాఁడు వీరిపుత్త్రుఁడు.

౨. (సో. వం.) ఆయువంశములోత్పన్నుఁడును, యయాతిపుత్త్రుఁడును అగుబలి అనురాజువంశమునఁబుట్టిన బలిరాజుయొక్క యార్గురు పుత్త్రులలోఁ బెద్దవాఁడు. ఇతఁడు బలియొక్క క్షేత్రమునందు దీర్ఘతముఁ డనుఋషివలనఁ బుట్టెను. ఈతనికి దధివాహనుఁ డను నామాంతరము గల ఖనపానుఁ డనుకొడుకు గలఁడు.

౩. భారత యుద్ధమునందుఁ గౌరవుల పక్షమునఁ బోరాడిన మ్లేచ్ఛరాజు. ఇతఁడు కర్ణునకు మాండలికుఁడు. ఇతఁడు భీమసేనునిచేఁ జచ్చెను (భార. ద్రోణ. అ ౨౬).

**అంగుత్తరనికాయ** — పాలీభాషయందున్న బౌద్ధమతగ్రంథములగు త్రిపిటకములయందలి రెండవది యగుసుత్తపిటకపు అయిదునికాయములలో ఇది నాల్గవది. ఏకోత్తరసంఖ్యాభివృద్ధిక్రమంబున విషయములను జెప్పునది యగుటంజేసి దీనికి అంగుత్తరనికాయ మని పేరు కలిగెను. ఇందు నిపాతము లనుపేర పదునొకండు విభాగములు కలవు. ఏకనిపాతము, దుకనిపాతము, తికనిపాతము, చతుక్కనిపాతము అని యివి సంఖ్యానామములతోనే యొప్పుచున్నవి. ఒక్కొక్కనిపాతము మరల వర్గులుగ విభజింపఁబడి యున్నది. ఒక్కొక్కనిపాతమున మూఁడు మొదలు పదిపదునైదువర్గులవఱకు నుండును. ఇరువది, యిరువదియేడువర్గులు కలనిపాతములును గొన్ని కలవు. గ్రంథ మంతయు ప్రాకృత(పాలీ)భాషయం దుండుటవలన నిపాతములయొక్కయు, వర్గములయొక్కయుఁ బేళ్లన్నియు ప్రాకృతమున నే కలవు.

ఈయంగుత్తరనికాయమునందలి పదునొకండవనిపాతముకడపటిశ్లోక మిది :

నవసుత్తసహస్సాని భియ్యోపంచసతానిచ,
సత్తపన్నాససుత్తాంతా అంగుత్తరసమాయుతా.

దీని ననుసరించి యిందు ౯,౫౫౭ సూత్రములు (వీనికే సుత్తాంతము లనియుఁ బేరు) కల వని తెలియుచున్నది. కాని క్రీ. శ. అయిదవశతాబ్దియం దుండిన బౌద్ధవేదభాష్యకర్త యని చెప్పఁదగు బుద్ధఘోషాచార్యుఁ డప్పటి కీనికాయమున ౨,౩౪౪ సుత్త (సూత్ర) ములుమాత్రమే కల వని చెప్పియుండెను. కాలక్రమమున నిందలి సూత్రములసంఖ్య పెరిగియుండవచ్చును.

ఈనికాయమునందలిసూత్రములలోఁ గొన్ని ఒక్కపంక్తికి మించనంత చిన్నవి: మఱికొన్ని మూఁడునాలుగుపుటలాక్రమించునంత పెద్దవి. కాని మొత్తముమీఁద నీసూత్రములలో చాలభాగము చిన్నవే. ఇవి బౌద్ధమతనీతిని, నిర్వాణోపలబ్ధికై యాత్మశిక్షణవిధానసూత్రములను దెలుపును.

పరంపరాగతార్థము ననుసరించి బుద్ధఘోషుఁడు వీనికి వ్యాఖ్యానములు వ్రాసెను. ఈవ్యాఖ్యానములకే 'అత్థకథ'లని పేరు. బుద్ధఘోషవిరచిత మైనయీయంగుత్తరనికాయపు అత్థకథకు 'మనోరథపూరణి' యని పేరు. దీనికి 'అంగుత్తరాగమాత్థకథ' యనియు నామాంతరము కలదు. ఇదికాక 'సారత్థమంజూషనటీక' యనియొకటీకకూడఁ గలదు. పరాక్రమబాహువు (సింహళదేశాధిపతి?) యొక్క కోరిక ననుసరించి సారిపుత్త్రుఁ డను అర్హతుఁడు దీనిని రచియించెను.

బుద్ధనిర్వాణానంతర మతనిబోధనలను మరల ననువదించుటకై 'రాజగృహ'మున ప్రథమ 'సంగీతి' జరగినయనంతరము జాగ్రత్తగఁ జదివి యధ్యయనాభ్యాసములు చేయుటకు 'మహాథేర'ల శిష్యులలో వేఱువేఱుశాఖలవారికి త్రిపిటకములయందలి వేఱువేఱుభాగముల నిచ్చిరి. అం దంగుత్తరనికాయము అనిరుద్ధునివశ మయ్యెను. దీని ననుసరించి సుత్తపిటకమునందలి యీనికాయము చాల ప్రాచీన మైనదనియు, దీనిని బాగుగ అధ్యయనము చేయువా రనియుఁ దెలియుచున్నది.

హిందూదేశమునఁ గానవచ్చు క్రీస్తుపూర్వపుశాసనములలో ఈయైదునికాయములను అధ్యయనము చేయువారును, అనుసరించువారును గూడ పేర్కొనఁబడియుండిరి. ప్రజలందఱును చదివి, విని,

మననము చేసి, జీవితమును తరింపఁజేసికొనుటకై యీయంగుత్తర నికాయము 'తికనిపాతము'నందలి 'అనాగతభయము' ('అనాగతభయాని') లకు సంబంధించినవిషయములను అశోకవర్ధనచక్రవర్తి తన 'బాభ్రా' శిలాశాసనమునఁ జెక్కించియుండెను. ఈవిషయములవలన ఈనికాయమునకుఁ బ్రజలలో నెట్టిగౌరవ ముండెనో, రాజులుకూడ నెట్టియాదరమును జూపుచుండిరో తెలియఁగలదు.

ఈయంగుత్తరనికాయమునకు సరిపచ్చుగ్రంథ మొకటి చీనాభాషయందుఁ గల దంపురు. అనువాదము చేసినచో ఆగ్రంథముపేరు 'ఏకోత్తరాగమసూత్ర' మగును. 'సుత్తపిటకము' నందలి యంగుత్తరాదినికాయముల కాగమము లనియుఁ బేరు కలదు. అది క్రీ. శ. ౩౮౫-వ ప్రాంతమున ధర్మనందిచేతను చీనాభాషయం దనువదింపఁబడెనఁట. నామసామ్యము ననుసరించి రెండుగ్రంథములు నొక్కటే యని యూహింప నవకాశ మున్నను చీనాగ్రంథమునందలివిభాగములకు అంగుత్తరాగమములోవలె 'నిపాతము'లని కాక 'వగ్గ'ము లని పే రుండుటవలన కొంత ఱిందునుగూర్చి యనుమానించుచున్నారు.

అంగురు — ఔడవౌడవరాగము: ఏడవ మేళకర్తయగు సేనావతీజన్యము. సగమధనిస – సనిధమగస యని ఆరోహణావరోహణముల సంచారము.

**అంగులేమి** — చార్లస్ డి వాలాయ్. ఇతఁడు ఫ్రెంచిరాజగు తొమ్మిదవ చార్లెసునకుఁ బుత్త్రుఁడు. వాలాయ్ ప్రభువు. క్రీ. శ. ౧౫౭౩-వ సంవత్సరము, ఏప్రిల్ నెల ౨౮-వ తేది జననమందెను. ఇతనితండ్రి సంవత్సరములోపుగనే మృతి నొందెను. ఆతనికిఁ దరువాత ఫ్రాన్సుదేశమునకు రా జయిన యీతనిపినతండ్రి మూఁడవహెన్రీ తనయన్నగారిమాటను పాలించి ఈచార్లసు అంగులేమిని సంరక్షించెను. ఇతనికి మంచి విద్యాభ్యాసము చేయించెను. పదునాఱు సంవత్సరముల వయస్సుననే అంగులేమి మిక్కిలి ప్రౌఢుఁడనువిఖ్యాతి గనెను. ౧౫౮౯ లో మూఁడవహెన్రీ చంపఁబడెను. నాలవహెన్రీ రాజ్యమునకు వచ్చి మూఁడవహెన్రీ సిఫారసుమీఁద అంగులేమిని గొప్పపదవులకు నియోగించెను. అంగులేమితల్లి తొమ్మిదవచార్లెసు చచ్చినపిదప మఱియొక ప్రభువును పెండ్లాడెను. వీరికి నైన సంతానమున హెన్రీయెట్టా యనుపుత్త్రిక యొకతె కలదు. ఆమె నాలవహెన్రీకి ఉంపుడుకత్తె యయ్యెను. దానిని సహింపక అంగులేమి యొకకుట్రయందు చేరెను. అది కనిపట్టఁబడ నితనికి నాలుగు మాసములు కారాగృహమునం దుండవలసివచ్చెను. మరల స్పెయిను రాజుతోఁ జేరి కుట్ర చేయుచుండుటవలన నితనిని పట్టుకొని ప్రాణదండన విధించిరి. ఈతని యాస్తి యంతయుఁ బోయెను. ఇతఁడు ౧౧ ఏండ్లు బందెయం దుండి విడుదల నంది మరలఁ దనయాస్తిపై స్వామ్యము సంపాదించుకొనెను. తరువాత నితఁడు రాజకార్యముల ధీరుఁడును, వీరుఁడు ననిపించుకొనెను. ఇతఁడు క్రీ. శ. ౧౬౫౦ లో ౭౫ సంవత్సరములవయస్సున మృతి నొందెను. ఫ్రెంచిభాషయం దితఁడు వ్రాసినగ్రంథములు మూఁడు కలవు.

అంగూరు — ఈ పేరను రెండుగ్రామములు, ఒకటి గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకాయందును, రెండవది బళ్లారిజిల్లా హడగల్లితాలూకాయందును ఉన్నవి. మొదటిది జమీన్‌దారీగ్రామము. దీనిజనసంఖ్య ౨౫౫. రెండవదానిజనసంఖ్య ౪౧౮.

అంగేరిచెఱువు — చిత్తూరుజిల్లా కాళహస్తితాలూకాయందలి యీనాంగ్రామము. దీనిజనసంఖ్య కేవలము ౬౪౪.

అంగోనీలాండ్ (Angoni-land) — దక్షిణఆఫ్రికాదేశమునందలి యొకభాగము. ఇది సముద్రపుమట్టమునకు ౪,౦౦౦ ల అడుగులయెత్తున నున్న యొకపీఠభూమి. ఇందు నివసించు అంగోనీ లనునొక తెగప్రజలను బట్టి దీని కీ పేరు వచ్చినది.

**అంగోరా** — తురక్కరాజ్యమున కిది రాజధాని. ఇది కాన్‌స్టాంటినోపిల్ నగరమునకు ౨౨౦ మైళ్లదూరమున నొకకొండమీఁదఁ గలదు. ఈకొండ ప్రాచీనదుర్గశిథిలావశేషములతో సుందరమై చూచుటకు సొంపుగ నుండును; కాని పట్టణ మంత బాగుగఁ గట్టఁబడినది కాదు. వీథు లిఱుకుగ నుండును. ఇండ్లయిండ్లు ఎండఁ బెట్టినయిటికలతోఁ గట్టినవి. అయినను ఇచట ప్రాచీనములైన గ్రీకు, రోమను, బిజాన్‌టైన్ వాస్తుశిల్పావశేషములు కడు మనోహరమైనవి కలవు.

ఇది చాల చరిత్రప్రాముఖ్యముగల నగరము. ఇది క్రీస్తునకుఁ బూర్వము ౨౫ లో రోమనురాష్ట్రమైనగలేషియాకు రాజధానిగ నుండెను. ప్రాచ్యరోమకసామ్రాజ్యకాలమునను ఇది చాల ప్రాముఖ్యము గలిగియుండెను. దీనిని పారసీకులును, అరబ్బులును ముట్టడించి పట్టుకొనిరి. అటుపిదప క్రీ. శ. ౧౩౬౦ లో నిది 'ఆటోమన్' తురుష్కులవశ మయ్యెను. క్రీ. శ ౧౪౦౨ లో అంగోరాప్రాంతమున నొకమహాసంగ్రామము జరగెను. అందు తార్తారువిజేత తైమూరు తురక్కసుల్తాను బయిజీద్‌ను ఓడించి, బందీకృతునిం గావించెను. కాని ౧౪౧౫ లో మరల తురుష్కులు దీనిని స్వాధీనపఱుచుకొనిరి. అప్పటనుండి యిది 'ఆటోమన్' సామ్రాజ్యముననే యుండెను. ౧౮౩౨ లో ఇబ్రహీమ్ పాషానాయకత్వమున ఈజిప్టుదేశీయులు దీనిని బట్టుకొనిరి.

ఉన్ని, మేఁకబొచ్చు, ధాన్యములు అంగోరానుండి యెగుమతియగువస్తువులు. ఇక్కడ మేఁకబొచ్చుతో బట్ట తయారగును. ఈనగరము తేనెకు, పండ్లకు ప్రసిద్ధి కెక్కినది.

౧౯౧౯ లో ముస్తాఫాకెమాల్ బయలుదేఱఁదీసిన తురక్కజాతీయోద్యమమునకు ఫలితముగ ౧౯౨౦-వ సంవత్సరము ఏప్రిల్ నెలలో అంగోరాలో జాతీయప్రభుత్వ మేర్పాటయ్యెను. గ్రీకులకును, వారియిరుగు, పొరుగురాజ్యములవారికిని సుకరముగ ముట్టడించుటకు వీలు లేనంతదూరమున నుండుటచేతను, ఆనటోలియన్ రైలుదారిమీఁద

ముఖ్యస్థానముగ నుండుటచేతను తుర్కీ-జాతీయోద్యమమున కీనగరము ప్రధానస్థాన మయ్యెను. అంగోరాకు చుట్టుపట్ల నుండు ప్రదేశములు ఆహారపదార్థములకును, పారిశ్రామికవస్తువులకును నిలయము లగుట కూడ దీని ప్రాధాన్యమునకు మఱింత తోడుపడెను. ౧౯౨౩-వ సంవత్సరము అక్టోబరు ౧౩-వ తేదిని తుర్కీ-జాతీయ ప్రభుత్వరాజ్యాంగ సభవారితీర్మానము ననుసరించి అంగోరా తుర్కీ-రాజ్యమునకు రాజధాని యయ్యెను. అంగోరా, కాన్‌స్టాంటినోపిల్ పట్టణములు రెండును ఆనటోలియారైలుదారిమీఁదనే యుండుటచేత నీరెంటికినిగల సంబంధము మఱింత యధికమయ్యెను. అంగోరానుండి స్కుటారీ, సివస్ మొదలగు మఱికొన్ని చోట్లకు రైలుదారులు కలవు.

క్రొత్తగా వచ్చినరాజకీయ ప్రాముఖ్యము ననుసరించియు, క్రమాభివృద్ధి నందుచున్న జనసంఖ్య ననుసరించియుఁ జూచినచో జననివాసమునకుఁగాని, ప్రభుత్వమునకుఁగాని తగినయానుకూల్యములు లేక ప్రాంతపట్టణము చాల ఇఱుకుగఁ గన్పట్టెను. రాచబాటలు సరియైనవి లేవు. పారిశుధ్యము తక్కువ. వీథు లిఱుకుగ నుండెను. ఇండ్లు నివాసమున కంత యనుకూలముగ నుండవయ్యెను. అందువలన ౧౯౨౫-వ సంవత్సరమునఁ బై విషయములలో మునిసిపాలిటీవారు చాల శ్రమపడి రాజధానిని మంచిస్థితికిఁ దీసికొనివచ్చిరి. ప్రభుత్వ కార్యాలయములకు వలయుకట్టడము లన్నియుఁ దయారైనవి. పట్టణములోనిమఱికినీరు వెలుపలికిఁ బోవుటకును, పట్టణమున కంతకు వలయునంతమంచినీరు లభింపఁజేయుటకును దగినప్రయత్నములు జరగుచున్నవి. వేలువేలు పరిశ్రమల కనుకూలము లైనయంత్రాలయములను నిర్మించుట కనుభవజ్ఞు లైన యింజనీర్లను జర్మనీనుండి రప్పించిరి. నగరమున విద్యుద్దీపములకును, గొప్పఅతంత్రి (Wireless) కార్యాలయ సంస్థాపనమునకును తగినయేర్పాటులు జరగుచున్నవి. విదేశపురాయబారుల కార్యాలయములు చాలవఱకు కాన్‌స్టాంటినోపిలునుండి అంగోరాకు మార్పఁబడినవి.

అంగోరిష్టుఁడు -- ఒకరాజర్షి (భా. ప్రా. కో).

**అంగోర్ను** — మధ్యఆఫ్రికాలో బోర్నుసీమలో ఛాదు సరస్సునకు నైరృతమూల నుండు నొకపట్టణము. ఇచ్చట గొప్ప సంతలు జరగును. ప్రత్తి, అంబరు, లోహములు, పవడములు మున్నగు వస్తువులయందు వ్యాపారము మెండు. బానిసవ్యాపారమును జరగుచున్నది. సాధారణపువేళల నీనగరపుజనసంఖ్య ౩౦,౦౦౦ లు. సంతలకాలమున నింతకంటె మిక్కిలి యెక్కువగా నుండును.

**అంగోలా** — ౧. పశ్చిమ ఆఫ్రికాయందు పోర్చుగీసువారి స్వాధీనమునఁగల దేశము. ఆఫ్రికాయొక్క నైరృతమూలను గల జర్మనువారిరాజ్యపుసరిహద్దులనుండి కాంగోనదివఱకు నుండు తీరభూమియు, దాననుండి చక్కఁగఁ దూర్పున ఖండపుమధ్యమువఱకును గలభూప్రదేశమును ఈదేశమునకుఁ జేరిన దని పోర్చుగీసువారివాదము. తీరభూమి వారికిఁ జేరినదే కాని లోభాగముమాత్రము పూర్ణముగ వారిస్వాధీనమం దున్న దని చెప్పుటకు వీలులేదు. ఈదేశపువైశాల్యము ౪,౮౪,౦౦౦ చదరపుమైళ్లు. జనసంఖ్య ౪౦,౦౦,౦౦౦. అందు ౧౧,౦౦౦ ఐరోపీయనులు. ఈదేశమున కుత్తరమున కాంగోఫ్రీస్టేటును, తూర్పున కాంగోఫ్రీస్టేటు బ్రిటీషుమధ్యాఫ్రికాలును, దక్షిణమున బ్రిటీషుదక్షిణాఫ్రికాయును జర్మనునైరృత ఆఫ్రికాయును, పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రమును గలవు.

ఈదేశపుదక్షిణమునఁ గొంత భాగమును, మఱికొన్ని భాగములను దప్ప మిగతప్రదేశము ఫలవంత మయినదియుఁ గాదు, ఆరోగ్యవంత మయినదియుఁ గాదు. తీరభూమి ఇసుకపఱ్ఱ. లోభాగము పర్వతప్రాంతము. అయినను గొన్నిభాగములు మిక్కిలి సారవంత మైనవి గలవు. అచ్చట తాటి, నిమ్మ, అరఁటి, చింత, మామిడి, చెఱకు మున్నగునవి పుష్కలముగఁ బండును. భూగర్భమున సీసము, గంధకము, ఇనుము, రాగి, మట్టినూనె విశేషముగ దొరకును. కాఫీ, తోలు, రబ్బరు, బంకలు, మైనము, దంతపుకొమ్ము ఎగుమతివస్తువులు. దేశీయు లనాగరకులు. వారికి మతాచార్యనామధారులే దేవతలు. వివాదములు వచ్చినప్పుడు సత్తెములు చేయించి న్యాయములు చెప్పువారు వీరే. అగ్ని దోసిటఁ బోయుట, విషము దినిపించుట మున్నగు ఘోరాచారములు న్యాయవిచారణపేరిట జరగుచుండును.

ఈదేశము ౧౪౮౪-వ సంవత్సరమునఁ బోర్చుగీసువారిచేఁ గనిపట్టఁబడెను. ఈదేశ మప్పటనుండి నేఁటివఱకును వారిస్వాధీనముననే యున్నది. మధ్యకాలమున ౧౬౪౦ మొదలు ౧౬౪౮ వఱకు డచ్చివారు పోర్చుగీసువారివలన దీనిని లాగుకొనఁ జూచిరి గాని సాధ్యమయినదిగాదు. పోర్చుగీసువా రింతకాల మీదేశముపై నధికారము వహించి యుండియు విశేషలాభము కలుగఁజేయ లేదు. కొంతకాలము బానిసవ్యాపారముమాత్రము కడుతీవ్రముగా నడపుచుండిరి. ఇప్పుడది తప్పిపోయినది. ఇటీవల ఇనుపదారు లేర్పడినవి. లోయాండా నుండి మలాంజె వఱకు ౩౦౦ల మైళ్లు ఇనుపదారి పూర్తిగ వాడుకయందున్నది. మొస్సామిడిస్‌నుండి మధ్య-ఆఫ్రికాయందలి టంగనాయకా సరస్సువఱకును ౧,౫౦౦లమైళ్లు ఇనుపదారి వేయఁబడుచున్నది. పోర్చుగీసువారు దీనినే ముందునకు సాగించి ఆఫ్రికాఖండముపడమటనుండి తూర్పునకు భూమార్గ మేర్పఱుప యత్నించెద రఁట.

ఈదేశమున ముఖ్యపట్టణములు లోయాండా, బెనెగ్వాలా, మొస్సామిడిస్. అందు లోయాండా రాజధాని. మొస్సామిడిస్ ఇప్పు డిప్పు డభివృద్ధి నొందుచున్నది. కాలపరిపక్వమున నదియే ముఖ్యతమము గావచ్చు నని తోఁచుచున్నది. ఈమూఁడుపట్టణముల నుండియు మూఁడు ఇనుపదారులు దేశములోనికి వ్యాపించియున్నవి.

ఈ దేశమున నధికారము పూనుటకు పోర్చుగీసుగవర్నరులు పంపఁబడుచున్నారు. ఇచ్చటనుండి యిద్దఱు ప్రతినిధులు

పోర్చుగలునందలి రాజకీయసభ కనుపఁబడుచుండురు. ఇట్లు అంగోలా పోర్చుగలులోని మండలముగఁ బరిగణింపఁబడుచున్నది.

౨. అమెరికా సంయుక్తరాష్ట్రమునందలి డిలవేరుమండలమున నొకపట్టణము.

౩. అదే రాష్ట్రమునందలి యిండియానా మండలమున నొకపట్టణము.

౪. అదే రాష్ట్రమునందలి లూసియానా మండలమున మఱియొకపట్టణము.

౫. అదేరాష్ట్రమున న్యూయార్కుమండలమున నొకపట్టణము.

౬. ఉత్తరకరోలినాయం దొకపట్టణము.

౭. ఉత్తరకాలిఫోర్నియాయం దిబు కగు నొకసముద్రశాఖ.

(గా. హ.)

**అంగ్యి** — బర్మాలోని రంగూన్‌జిల్లాయం దొకఫిర్కా. మొదట బ్రిటిషువారికి లోఁబడకముందు ఇది డాలా (Dala) రాష్ట్రమునకుఁ జెందియుండెను. ఆకాలమున దాని కిదియే ప్రధాననగరము. డాలారాష్ట్రపురాజొకఁడు ఉత్తమ మగు యుద్ధనావ యొకటి తయారు చేయించెను. దానికి అంగ్యి అనుపేరువచ్చినది. 'అంగ్యి' అనుమాట కాశ్చర్యకర మయినది (Marvellous) యని యర్థము. నాఁటనుండియు నారాజ్యపుఁ బ్రధాననగరమునకుఁగూడ నాపేరే వాడుక యైనది.

**అంగ్రోలీ** — గ్వాలియరుసంస్థానమున నొకప్రదేశము. ౧౮౦౩-వ సంవత్సరమున దౌలత్ రావుసింధియా దీని నింగ్లీషువారికి సమర్చెను.

**అంఘాడ్** — బొంబాయిరాజధానియందు రేవాకాంత అను ఏజెన్సీయందలియొకచిన్నసంస్థానము. ఇచ్చట రాజు కోలీ అనఁగా మతరాసుజాతివాఁడు. దీనివిస్తీర్ణము ౪౨ చదరపుమైళ్లు. ఈసంస్థానమునం దొక్కటే గ్రామము కలదు. జనసంఖ్య ౨,౪౮౮. డౌలు ౫,౧౮౧. ఈసంస్థానపుప్రభువు సంవత్సరమునకు రు. ౧,౫౪౪ బరోడారా జయిన గాయకవాడునకు చెల్లింపవలయును.

**అంచనావతి** — షాడవషాడవరాగము. నలువదిమూఁడవమేళకర్త యగు గవాంభోధిరాగమున జన్యము. ఆరోహణావరోహణములందు సరిగమపధస — సధపమగరిస యని సంచారము.

**అంచలగచ్ఛ పట్టావలి** — అంచలగచ్ఛము శ్వేతాంబరజైనశాఖలలో నొకటి. గచ్ఛము లనుపేరఁ బరఁగు శ్వేతాంబరజైనశాఖలు ౮౪ కలవు. వీనిలో ఖరతర, తపా, అంచలాదిశాఖలు కొన్ని తక్కినవానికంటె గొప్పవి. అంచలగచ్ఛమునకు సంబంధించిన గురుపరంపరనుగుఱించి యీయాంచలగచ్ఛపట్టావలి తెలుపును. మతాధిపతు లనఁదగు నీజైనగురువులకు సూరు లనియు, ఆచార్యు లనియు, పట్టధరు లనియును పేర్లు కలవు.

జినుఁ డనుపేరితోఁ దనమతమును వ్యాపింపఁజేసినమహావీరుఁడు మొదలుకొని ఖరతరగచ్ఛానుసారము ముప్పదియేనిమిదవ, తపాగచ్ఛానుసారము ముప్పదియైదవ పట్టధరుఁ డగు ఉద్యోతనసూరివఱకును గల పీఠాధిపతు లన్నిగచ్ఛములకు నొక్కరే. ఉద్యోతనసూరియనంతరమే శాఖాభేదము లేర్పడియెను. అంచలగచ్ఛము క్రీ. శ. ౧౧౧౩-వ సంవత్సరమున ఆర్యరక్షితసూరి యనునాచార్యుఁడు సంస్థాపించెను. ఉద్యోతనసూరికాలమున ఈగచ్ఛమునకు వరాగచ్ఛ మని పేరు. తరువాత పాటన్ (అనహిలవాడపట్టణ) జిల్లాయందలి రాధంపురము సమీపమునందలి శంఖేశ్వరపార్శ్వనాథునితీర్థస్థాన మగు శంఖేశ్వరగ్రామమునుబట్టి వరాగచ్ఛమునకు శంఖేశ్వరనామము కలిగినది. అటుపిమ్మట నీశాఖాస్థానము నానాపీర మనునగరమునకు మాఱుటవలన దీనికి నానావాలగచ్ఛ మని పేరు కలిగెను. ఇయ్యది ఆర్యరక్షితసూరికాలమున విధిపక్షగచ్ఛ మని ప్రసిద్ధ మై తుదకు అంచలగచ్ఛనామాంకిత మయ్యెను. దీని కీపేరు వచ్చుటకు రెండుకారణములు కలవందురు: ౧. ఈశాఖకు సంబంధించినవారు తమగురువులకుఁ బ్రణామము లొనరించుకాలమున వస్త్రాంచలములను శిరమునఁదికిఁ దీసికొందురు. అంచలగచ్ఛనామము కలుగుట కిదియే కారణ మని కొందఱి మతము. ౨. చాళుక్యవంశజుఁ డైన కుమారపాలమహారాజు అనహిలవాడపట్టణమును బాలించుచుండినకాలమున ఆర్యరక్షితసూరిశిష్యుఁ డగు జయసింహుఁ డానగరమున మతబోధ గావించుచుండెను. ప్రజలెల్లరితోపాటు కుమారపాలుఁడుకూడ నచటి కేఁగి వ్యాఖ్యానము జరుగుచున్నసమయమున పూర్ణిమాతిథ్యుపవాసము నాతిథిని గాక చతుర్దశినాఁడే యాచరించుట కంగీకరించుచోఁ దా నచ్చట నుందు ననియు, లేదేని సభ విడనాడి పోయెద ననియు నుడివెనట. అందులకు జయసింహుఁడు తాను తలపెట్టినప్రసంగము ముగిసినయనంతరమా ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మొసంగెద నని చెప్పెనట. ఆప్రసంగపుమహత్త్వమును గుర్తెఱుంగనివాఁ డగుటచేత కుమారపాలుఁ డందుల కంగీకరించెను. అటువెనుక కుమారపాలుఁడు తనగురువగు హేమాచార్యునికడ కరిగి, జరిగినయావద్వృత్తాంతమును దెలుప నతఁడు జయసింహుని ప్రస్తుతప్రసంగము ముగియుటకు పండ్రెండేండ్లు పట్టు నని తెలియఁబఱచెను. అయినను తాను జయసింహున కొసంగినవాగ్దానమును తప్పక, యోపికపట్టి కుమారపాలుఁ డాపండ్రెండుసంవత్సరములును జయసింహునిప్రసంగమును అచలుఁడై యాలకించుచుండెను. ఇందువలన నీశాఖ తొలుత అచలగచ్ఛనామాంకిత మై తుద కంచలగచ్ఛముగ మాఱిన దని కొంద అందురు.

ఈశాఖవారికిని, ఇతరశాఖలవారికిని వ్రతానుష్ఠానాదులం దించుక భేదము కలదు. ఇతరశాఖాశ్రావకులు ప్రార్థనసమయములయందును, ప్రసంగావసరములందును నోటిని చిన్నవస్త్రఖండములతోఁ గప్పి

కొందఱు కాని యంచలగచ్ఛశ్రావకు లట్లు కావింపరు. వీరు తీర్థంకరులను నమ్మి కొలుతురు; జైనులనలువదియైదుసూత్రగ్రంథములును వీరికిం బ్రమాణములు.

అన్నిగచ్ఛములకు నొక్కఁరుగనే యుంచిన మొదటిముప్పది యెనమండ్రుపీఠాధిపతులలోఁ బ్రథముఁడు మహావీరుఁడు.

౧. మహావీరుఁడు. ఇతఁ డిక్ష్వాకుకులోత్పన్నుఁడు. చైత్రశుద్ధత్రయోదశి యాతనిజన్మదినము: డెబ్బదిరెండుసంవత్సరములప్రాయమున కార్తికామావాస్యదినమున పావానగరమున నిర్వాణపదము నందెను. జైనమతసంస్థాపనాచార్యుఁ డీతఁడే.

మహావీరునితరువాతిపట్టధరులనుగూర్చి ఖరతరగచ్ఛానుసరమున సవిస్తరముగ వ్రాయఁబడును గావున నిచట వారిపేరులు మాత్రమే యొసంగఁబడును.

౨. సుధర్మసూరి
౩. జంబుసూరి
౪. ప్రభవసూరి
౫. శయ్యంభవసూరి
౬. యశోభద్రసూరి
౭. సంభూతివిజయసూరి
౮. భద్రబాహుసూరి
౯. స్థూలభద్రసూరి
౧౦. ఆర్యమహాగిరిసూరి
౧౧. ఆర్యసుహస్తిసూరి
౧౨. ఆర్యసుస్థితసూరి
౧౩. ఇంద్రదిన్నసూరి
౧౪. దిన్నసూరి
౧౫. సింహగిరిసూరి
౧౬. వజ్రసూరి
౧౭. వజ్రసేనసూరి
౧౮. చంద్రసూరి
౧౯. సమంతభద్రసూరి
౨౦. వృద్ధదేవసూరి
౨౧. ప్రద్యోతనసూరి
౨౨. మానదేవసూరి
౨౩. మానతుంగసూరి
౨౪. వీరసూరి
౨౫. జయదేవసూరి
౨౬. దేవానందసూరి
౨౭. విక్రమసూరి
౨౮. నరసింహసూరి
౨౯. సముద్రసూరి
౩౦. మానవదేవసూరి
౩౧. విబుధప్రభాసూరి
౩౨. విజయానందసూరి
౩౩. రవిప్రభాసూరి
౩౪. యశోభద్రసూరి
౩౫. విమలచంద్రసూరి
౩౬. దేవసూరి
౩౭. నేమిచంద్రసూరి

౩౮. ఉద్యోతనసూరి: ఈతని కెనుబదినలుగురు శిష్యులు. వీరిలో సర్వదేవసూరి గురువునకుఁ బిదప పట్టధరుఁ డయ్యెను.

౩౯. సర్వదేవసూరి. ఇతనికిఁ బిదప

౪౦. పద్మదేవసూరి. ఇతఁడును ఉద్యోతనశిష్యులలో నొకఁడు: సాంఖ్యదర్శనవేత్తలఁ గొందఱ జైనమతావలంబులఁ గావించినకారణమున సాంఖ్యసూరి యని పేరు గాంచెను.

౪౧. ఉదయప్రభాసూరి

౪౨. ప్రభానందసూరి. ఇతనికాలముననే ఈశాఖకు నానకగచ్ఛ మనుపేరు కలిగెను.

౪౩. ధర్మచంద్రసూరి
౪౪. సువినయచంద్రసూరి
౪౫. గుణసముద్రసూరి
౪౬. విజయప్రభాసూరి
౪౭. నరచంద్రసూరి
౪౮. వీరచంద్రసూరి
౪౯. జయసింహసూరి

౫౦. ఆర్యరక్షితసూరి. ఇతనికాలమున నితనికిఁ గలిగినచక్రేశ్వరీదేవిస్వప్నము ననుసరించి యీశాఖకు విధిపక్షగచ్ఛ మనుపేరు కలిగెను. ఇతఁడు ద్రోణునికుమారుఁడు: వి. శ. ౧౧౩౬-వ సంవత్సరమున దంత్రాణగ్రామమున జన్మించెను. వి. శ. ౧౨౧౨-వ సంవత్సరమున గురువువలన విజయచంద్రోపాధ్యాయసూరి యనుపే రంది, పిదప ఆర్యరక్షితసూరి యనునామముతోఁ బట్టధరత్వము నొందెను. ఇతఁడు ౨,౧౦౦ మంది సాధువులకును, ౧,౧౩౦ మంది సాధ్వులకును దీక్ష నొసంగెను. మఱియు నితనివలన పండ్రెండుగురు సాధువు లాచార్యపదమును, ఇరువదిమంది యుపాధ్యాయపదమును, డెబ్బదిమంది పండితపదమును, నూటముగ్గురు సాధ్వులు మహత్తరపదమును, ఎనుబదియిద్దఱు సాధ్వులు ప్రవర్తినీపదమును బొందిరి. ఇతఁడు నూఱుసంవత్సరములకాలము జీవించి వి. శ. ౧౨౩౬ నందు నిర్వాణపదము నందెను.

౫౧. జయసింహసూరి — ఇతఁడు వి. శ. ౧౧౭౯-వ సంవత్సరమున కోంకణదేశమందలి సోపారపురమున జనన మందెను. ఇతని తండ్రి కోటిద్రవ్యనిధి: తల్లి నేధి. ఇతఁడు ౧౧౯౩-వ సంవత్సరమున దీక్షఁగైకొని ౧౨౦౨ న సూరిపదము నొందెను. ఇతనికి ౧౨౩౬ న ఆచార్య, పట్టధరత్వములు లభించెను. ఇతఁడు ౭౯ సంవత్సరములప్రాయమున వి. శ. ౧౨౫౮-వ సంవత్సరమున నిర్వాణపదము నొందెను. ఇతని నిస్సంగత్వమహిమను వర్ణించు నీక్రిందిశ్లోకము ప్రసిద్ధమై యున్నది:

> "మౌళిం ధునోతి స్మ విలోక్య యస్య
> నిస్సంగతాం విస్మితచిత్తవృత్తిః,
> శ్రీసిద్ధరాజా స్వసమాజమధ్యే
> సోఽభూత్తత శ్రీజయసింహసూరిః."

౫౨. ధర్మఘోషసూరి — ఇతఁడు మార్వాడదేశమునందలి మహావపురమున వి. శ. ౧౨౦౮ లో జనన మందెను. ఇతని తండ్రిపేరు చంద్రవ్యవహారి: తల్లి రాజలదేవి. ౧౨౧౬-వ సంవత్సరమున దీక్షాగ్రహణము. ౧౨౩౬-వ సంవత్సరమున ఆచార్యపదప్రాప్తి. ఇతఁడు పదునెనిమిదిప్రశ్నోత్తరముల నొప్పుశతపది యనుగ్రంథమును వ్రాసెను. ఈతఁడే శాకంభరి యందలి మొదటిరాజును జైనమతమునకుఁ దీసికొనివచ్చినట్లు మేరుతుంగుఁడు తెలిపెను. ఇతఁడు ౫౯ సంవత్సరములప్రాయమున వి. శ. ౧౨౬౮ లో నిర్వాణము నొందెను.

౫౩. మహేంద్రసింహసూరి — ఇతఁడు వి. శ. ౧౨౨౮ లో సారానగరమున జనన మందెను. ఇతనిజనకుఁడు దేవప్రసాద సేఠా: తల్లి పేరు ఖీరదేవి. సిరదేవి యని శతపదోద్ధారగ్రంథమునఁ బేర్కొనఁబడెను. వి. శ. ౧౧౩౭ లో దీక్షాగ్రహణము: ౧౨౬౩ లో నాచార్యపదము నంది, ౧౨౬౯-వ సంవత్సరమున గచ్ఛనాయకత్వము వహించెను. ఇతఁడు శతపది గ్రంథమునకు వ్యాఖ్యానమును, తీర్థమాలాస్తవమను పేర ౧౧౧ శ్లోకములుగల మఱియొక ప్రాకృతగ్రంథమును వ్రాసెను. ౮౨ సంవత్సరముల ప్రాయమున వి. శ. ౧౩౦౯-వ సంవత్సరమున నితఁడు నిర్వాణపదము నందెను.

౫౪. సింహప్రభాసూరి — ఇతఁడు వి. శ. ౧౨౮౩ లో విజాపురమున జన్మించెను. తండ్రి పేరు అరిసింహుఁడు. తల్లి ప్రీతిమతి. ౧౨౯౧ లో నితఁడు దీక్షాగ్రహణమును, ౧౩౦౯-వ సంవత్సరములో నాచార్య, గచ్ఛనాయకత్వపదములను గూడ నందెను. ముప్పదేండ్ల ప్రాయమందే వి. శ. ౧౩౧౩ లో నితఁడు నిర్వాణపదము నందెను.

౫౫. అజితసింహసూరి — వి. శ. ౧౨౮౩-వ సంవత్సరమున దోడగ్రామమున జననము. తండ్రి పేరు జినదేవసేఠా. తల్లి జినదేవి. ౧౨౯౧-వ వర్షమున దీక్షాగ్రహణము. ఇతఁడు ౧౩౧౪ లో అనహిల్లపురమునం దాచార్యపదమును, ౧౩౧౬ లో జాలోరానగరమున గచ్ఛనాయకత్వమును బొందెను. ఇతఁడు సువర్ణనగరపాలకుఁడగు రాజా సమరసింహునకు జైనమతదీక్ష నిచ్చి పదునైదుగురుశిష్యుల కాచార్యపదప్రదానముం జేసెను. ఏఁబదియాఱేండ్లవయసున నితఁడు ౧౩౩౯-వ సంవత్సరమున నిర్వాణపదముం బొందెను.

౫౬. దేవేంద్రసింహసూరి — ఇతఁడు వి. శ. ౧౨౯౯ లో పాలంపురమున జననమందెను. తండ్రి సంతూసేఠా. తల్లి పేరు సంతోషశ్రీ. తిరాద్రగ్రామమున ౧౩౦౬-వ వత్సరమున దీక్షాగ్రహణము: తిమిరపురమందు ౧౩౨౩ లో నాచార్యపద ప్రాప్తి. ౧౩౩౯ లో నితఁడు గచ్ఛనాయకత్వమును గైకొని డెబ్బదిరెండుసంవత్సరములపర్యంతము జీవించి ౧౩౭౧ లో నణహిల్లపురమున నిర్వాణపదము నొందెను.

౫౭. ధర్మప్రభాసూరి — భిన్నమాలయందలి లింబాసేఠాయొక్క పుత్త్రుఁడు. తల్లి విజలాదేవి. వి. శ. ౧౩౩౧ లో జననము. ౧౩౪౧ లో జాలోరానగరమున దీక్షాగ్రహణము. ౧౩౭౧-వ సంవత్సరమునం దనహిల్లపురమున గచ్ఛనాయకత్వప్రాప్తి. ఇతనికాలముననే భువనతుంగశాఖ మఱియొకటి పుట్టినది. ఇతనికిఁ బ్రజ్ఞాతిలకసూరి యను వేఱొకపేరుగూడఁ గలదు. ఇతఁడు కాలకాచార్యకథ యను గ్రంథము నొకదానిని వ్రాసెను. ౬౩ ఏండ్లవయసున నితఁడు ౧౩౯౩ న శోతీగ్రామమున నిర్వాణపదము నొందెను.

౫౮. సింహతిలకసూరి — ఇతఁడు వి. శ. ౧౩౪౫ లో మార్వాడదేశములోని యైకాపురమందు జన్మించెను. అసాధర శ్రేష్ఠి తండ్రి. తల్లి పేరు చంపలదేవి. వి. శ. ౧౩౫౨-వ సంవత్సరములో దీక్షను గ్రహించి ౧౩౭౧-వ సంవత్సరములో నానందపురమున నాచార్యపదము గాంచి ౧౩౯౩ లో పాటన్ లో గచ్ఛనాయకత్వము వహించెను. ఏఁబదేండ్ల ప్రాయమున ౧౩౯౫-వ సంవత్సరములో స్తంభారతీర్థమందు నిర్వాణపదము నందెను.

౫౯. మహేంద్రప్రభాసూరి — ఆశాశ్రేష్ఠికుమారుఁడు. తల్లి పేరు జీవనదేవి. వి. శ. ౧౩౬౩ లో జననము. ౧౩౭౫ లో విజాపురమున దీక్షను గైకొని ౧౩౯౩-వ సంవత్సరమున నణహిల్లనగరమం దాచార్యపదము నంది ౧౩౯౮-వ సంవత్సరమున నితఁడు స్తంభతీర్థమున గచ్ఛనాయకత్వము వహించెను. ఇతని నాయకత్వసమయమున నభయసింహసూరి పార్శ్వనాథుని విగ్రహమును జేయించెను. ఇతఁడు వి. శ. ౧౪౪౪ లోఁ దన ౮౧-వ యేట నిర్వాణపదము నొందెను.

౬౦. మేరుతుంగసూరి — నాణీగ్రామవాస్తవ్యుఁడగు వోరావైరసింహునికుమారుఁడు. తల్లి పేరు నాహూనదేవి. వి. శ. ౧౪౦౩ లో జననము. ౧౪౧౮ లో దీక్షాగ్రహణము. ౧౪౨౬-వ సంవత్సరములో శాలాగ్రామమున నాచార్యపదగ్రహణము. ౧౪౪౬-వ సంవత్సరములో నాప్రదేశమందే గచ్ఛనాయకత్వప్రాప్తి. ఇతఁడు లోలాదగ్రామమందు సర్పభయనివారణార్థము జీరికపల్లిపార్శ్వనాథుని స్తవమును వ్రాసెను. మహాకవి కాళిదాస, మాఘుల ననుకరించుచు నాభీవంశసంభవము, యదువంశసంభవము, నేమిదూత లోనగు కావ్యములను రచించెను. ఇతఁడు వ్రాసినవి నవీనవ్యాకరణము, సూరిమంత్రకల్పము మొదలగు మఱికొన్ని గ్రంథములు గలవు. మేఘదూతకావ్యము, శతపదిసముద్ధారము, శ్రీకంకలరసాధ్యాయముపై వ్యాఖ్యానము లోనగు గ్రంథములుకూడ నితని పేరనే కలవు. ఇతఁడు గచ్ఛనాయకుఁడుగ నున్నకాలమున జయశేఖరసూరి యను వేఱొకవిద్వాంసుఁడు బృహదతివిచారము, అజితశాంతిస్తవనము మొదలగు స్వల్పగ్రంథములనే కాక ౧౨,౦౦౦ ల శ్లోకములతో ఉపదేశచింతామణి, ప్రబోధచింతామణి, సంబోధసత్తరి, ఆత్మావబోధకులకము మున్నగుపలురెండు గొప్ప గ్రంథములనుగూడ రచించెను. మేరుతుంగునిశిష్యుఁడు మాణిక్యసుందరసూరి యనుమఱియొకవిద్వాంసుఁడు గుణవర్మచరిత్రము, సత్తరభేదిపూజాకథ, పృథ్వీచంద్రచరితము, చతుఃపర్వికథ, సుఖరాజకథ, మలయసుందరీకథ, సంవిభాగవ్రతకథ లోనగుగ్రంథముల రచించెను. మేరుతుంగసూరి అఱువదియెనిమిదిసంవత్సరముల ప్రాయమున వి. శ. ౧౪౭౧-వ సంవత్సరములో నిర్వాణపదము నందెను.

౬౧. జయకీర్తిసూరి — ఇతఁడు తిమిరపురనివాసి యగుభూపాల సేఠాకుమారుఁడు. తల్లి పేరు భ్రమరదేవి. వి. శ. ౧౪౩౩-వ సంవత్సరమున జననము. ౧౪౪౪ న దీక్షాగ్రహణము. ౧౪౬౭ న సూరిపదప్రాప్తి. ౧౪౭౩ న పాటననగరములో గచ్ఛనాయకత్వలబ్ధి. ఇతఁడు అఱువదియేడేండ్ల ప్రాయమున వి. శ. ౧౫౦౦-ల సంవత్సరమున నిర్వాణపదము నందెను. ఈజయకీర్తిసూరిశిష్యుఁడగు శీలరత్నసూరి మేరుతుంగుని మేఘదూతకు వ్యాఖ్యానము వ్రాసెను.

౬౨. జయకేసరిసూరి — శ్రీథాముననగరనివాసి యగు దేవసింహ సేఠాకుమారుఁడు. తల్లి లక్ష్మణదేవి. వి. శ. ౧౪౬౧ న జననము. ఇతని మొదటిపేరు ధనరాజు. ౧౪౭౫ న దీక్షాగ్రహణము. ౧౪౯౪ న ఆచార్యపదప్రాప్తి. ౧౫౦౧ లో చాంపనేరనగరమందు గచ్ఛనాయకత్వలబ్ధి. ౮౧ ఏండ్ల వయసున ౧౫౪౨-వ సంవత్సరమున నిర్వాణము నొందెను.

౬౩. సిద్ధాంతసాగరసూరి — పాటణవాస్తవ్యుఁడగు శోణిజాదవ కుమారుఁడు. పూరలదేవి మాత. ఇతని మొదటిపేరు శోణపాలుఁడు. వి. శ. ౧౫౦౬ లో సాలానగరమున జననము. ౧౫౧౨ న దీక్షాగ్రహణము. ౧౫౪౧ న నాచార్యపదలబ్ధి. ౧౫౪౨ న గచ్ఛనాయకత్వప్రాప్తి. ఇతఁడేఁబదినాలుగవయేఁట ౧౫౬౦ న నిర్వాణపదము నందెను.

౬౪. భావసాగరసూరి — ఇతఁడు నరసాణీగ్రామమునందలి వోరా సాంగునికుమారుఁడు. తల్లి పేరు శృంగారదేవి. ఇతనిమొదటి పేరు భావడుఁడు. వి. శ. ౧౫౧౦ న జననము. ౧౫౨౦ న జయకేసరిసూరివలన దీక్షాగ్రహణము. మండలగ్రామమునందు ౧౫౬౦-వ సంవత్సరమున నాచార్యగచ్ఛేశపదములఁ గైకొనెను. ఇతనికాలమున వినయహంసుఁడనునతఁడు 'దశవైకలికము' పై వృత్తిని వ్రాసెను. భావసాగరుఁడు డెబ్బదిమూఁడవయేఁట వి. శ. ౧౫౮౩-వ సంవత్సరమున నిర్వాణపదము నొందెను.

౬౫. గుణనిధానసూరి — ఇతఁడు పాటణనివాసి యగు శ్రీమాలిజ్ఞాతి ముగుటమణినగరాజసేఠాపుత్త్రుఁడు. తల్లి పేరు లీలాదేవి. ఇతని మొదటిపేరు సోనపాలుఁడు. వి. శ. ౧౫౪౮ న జననము. ౧౫౫౨ న సిద్ధాంతసాగరసూరివలన దీక్షాగ్రహణము. ౧౫౮౪ న స్తంభతీర్థమునందు సూరిగచ్ఛేశపదప్రాప్తి. ఏఁబదినాలుగేండ్లప్రాయమున ౧౬౦౨-వ సంవత్సరమున నిర్వాణము నందెను.

౬౬. ధర్మమూర్తిసూరి — ఇతఁడు తామ్రవతీనివాసి యగుశాహంస రాజవణిజునికుమారుఁడు. తల్లి హంసలదేవి. ఇతనిమూల నామము ధర్మదాసు. వి. శ. ౧౫౮౫ న జననమంది ౧౫౯౯-వ సంవత్సరమున దీక్ష గైకొనెను. పిదప నహమదాబాదునందు ౧౬౦౨-వ సంవత్సరమున నాచార్య, గచ్ఛనాయకత్వపదములఁ గాంచెను. ఇతఁడు త్యాగి యని పేర్కొనఁబడుచుండెడివాఁడు. ఇతనికాలమందే వి. శ. ౧౬౪౩-౪ సంవత్సరములలో ఉత్తరాధ్యయనదీపిక యనుగ్రంథమును, ౧౬౬౫ న వ్యవహారసూత్ర మనుగ్రంథమును వ్రాయఁబడినవి. ధర్మమూర్తిసూరి స్వయముగ వృద్ధచైత్యవందనము, ప్రద్యుమ్నచరితము అను గ్రంథములను లిఖించెను. ఇతఁడెనుబదియైదువర్షములయీడున ౧౬౭౦ లో పాటణమందు నిర్వాణపదము గాంచెను.

౬౭. కల్యాణసాగరసూరి — లోలాడగ్రామస్థుఁడగుకొఠారినానిగునిపుత్త్రుఁడు. తల్లి నామిలదేవి. మూలనామము కోడణ. వి. శ. ౧౬౩౩ లో జననము. ౧౬౪౨ లో ధవలపురమందు దీక్షాగ్రహణము. అహమదాబాదులో ౧౬౪౯-వ సంవత్సరమున నాచార్యపదప్రాప్తి. ౧౬౭౦ లోఁ బాటణమందు గచ్ఛనాయకత్వప్రాప్తి. ఇతనికాలమున ౧౬౭౩-వ సంవత్సరమున జాతకపద్ధతివృత్తియు, అభిధానచింతామణివ్యాఖ్యానమును వ్రాయఁబడినవి. ఇతఁడు కచ్ఛ (Cutch) దేశపాలకుని జైనమతావలంబునిగఁ జేసెను. ౮౫ సంవత్సరముల ప్రాయమున ౧౭౧౮-వ సంవత్సరములో భుజనగరమందు నిర్వాణపదముం గాంచెను. ఈకల్యాణసాగరసూరి శిష్యుఁడు వినయసాగరుఁడనునతఁడు భోజవ్యాకరణము నొకదానిని రచించెను.

౬౮. అమరసాగరసూరి — ఇతఁడు మేవాడదేశములోని ఉదయపురమున నివసించు శ్రీమాలిజ్ఞాతిశోధరీమోధయొక్క కుమారుఁడు తల్లి పేరు శోణ. మొదటిపేరు అమరచంద్రుఁడు. వి. శ. ౧౬౯౪ లో జననము. ౧౭౦౫ లో దీక్షాగ్రహణము. ౧౭౧౫ లో ఖంబాయతమునం దాచార్యపదప్రాప్తి. ౧౭౧౮ లో కచ్ఛదేశమందలి భుజనగరములో గచ్ఛేశపదలబ్ధి. ఇతనికాలమున నుపదేశచింతామణి యనుగ్రంథము వ్రాయఁబడినది. ఇతఁడు ౬౮ ఏండ్లప్రాయమున ౧౭౬౨-వ సంవత్సరమున ధోలకమునందు నిర్వాణము నొందెను.

౬౯. విద్యాసాగరసూరి — కచ్ఛదేశములోని ఖీరసరానివాసి యగు శాకర్సింహునిపుత్త్రుఁడు. తల్లి కమలాదేవి. మూలనామము విద్యాధరుఁడు. వి. శ. ౧౭౪౭ లో నాశ్వయుజకృష్ణతృతీయ తిథిని జననము. ౧౭౫౬-వ సంవత్సరము ఫాల్గునశుద్ధ ద్వితీయయందుదీక్షాగ్రహణము. ౧౭౬౨-వవత్సరపు శ్రావణశుక్లదశమినాఁడు ధోలకాలో నాచార్యపదప్రాప్తి. ౧౭౬౨-వ సంవత్సరము కార్తికకృష్ణచతుర్థి బుధవారమునాఁడు మాతరగ్రామమున భట్టారకపదావాప్తి. ఇతనికాలమున నిత్యలాభుఁడనునతఁడు విద్యాసాగరసూరిస్తవమును వ్రాసెను. విద్యాసాగరశిష్యుఁడగు జ్ఞానసాగరగణి గుణవర్మచరిత్రము, చోత్రీశ, అతిశయనోఛందము ననుగ్రంథములను వ్రాసెను. ఇతఁడేఁబదియవయేఁట ౧౭౯౭-వ సంవత్సరములో కార్తికశుద్ధపంచమినాఁడు నిర్వాణపదము నందెను.

౭౦. ఉదయసాగరసూరి — ఇతఁడు నవానగరవాసి యగుశాకల్యాణజీయొక్క పుత్త్రుఁడు. తల్లి పేరు జయవంతీబాయి. మొదటిపేరు ఉదయచంద్రుఁడు. వి. శ ౧౭౬౩ లో జననము. ౧౭౭౭ లో దీక్షాగ్రహణము. ౧౭౯౭-వ సంవత్సరములో మార్గశీర్షశుద్ధత్రయోదశినాఁ డాచార్యగచ్ఛేశపదముల ప్రాప్తి. ఇతఁడు స్నాత్రపంచాశిక మనుగ్రంథమును వ్రాసెను. ౧౮౨౬-వ సంవత్సరము ఆశ్వయుజశుక్లద్వితీయదినమున సూరతునగరములో అఱువదిమూఁడేండ్లప్రాయమున నిర్వాణ మందెను.

౭౧. కీర్తిసాగరసూరి — కచ్ఛదేశములోని దేసాలపురనివాసి యగు ఓసావంశజ్ఞాతీయసాహామాలాసింహునిపుత్త్రుఁడు. తల్లి పేరు ఆసాబాయి. మూలనామము కుమారజీ. వి. శ. ౧౭౯౬ లో జననము. ఇతఁడు ౧౮౦౪ లో నుదయసాగరసూరికి శిష్యుఁడై ౧౮౦౯ లో మాండవీపట్టణమున దీక్షను గైకొనెను. ౧౮౨౩-వ సంవత్సరమున సూరతులో నితని కాచార్యపదము దొరకెను. ఆసందర్భమున జరిగినమహోత్సవమునిమిత్తము శాహాఖుశాలచందు, ఘూఖణదాసు లనువారు ౬,౦౦౦ల రూప్యముల వెచ్చించిరి. ౧౮౨౬-వ సంవత్సరములో నితఁడు అంజారమున గచ్ఛనాయకత్వము గాంచెను. ఇతఁడు కేవలము ౪౮ ఏండ్లవయసు నందె ౧౮౪౩-వ సంవత్సరపు భాద్రపదశుద్ధ షష్ఠినాఁడు సూరతురేవున నిర్వాణ మందెను.

౭౨. పుణ్యసాగరసూరి — ఇతఁడు గుజరాతుదేశవాసి యగుగామా శ్రీనదోడరాన పోరవాడజ్ఞాతీయ శాహారామాసీయొక్క కుమారుఁడు. తల్లి మిఠీబాయి. ఇతనిమొదటిపేరు పానాచందు. వి. శ. ౧౮౧౭ లో జననము. ౧౮౨౪ లో కీర్తిసాగరునకు శిష్యుఁడై ౧౮౩౩ లో భుజపురములో దీక్షం గైకొనెను. ౧౮౪౩ లో సూరతునగరమున నితఁ డాచార్యగచ్ఛేశపదములఁ గాంచెను. ఇతఁ డేఁబదిమూఁడవయేఁట ౧౮౭౧-వ సంవత్సరపు కార్తికశుద్ధత్రయోదశినాఁడు పాటణనగరమున నిర్వాణపద మందెను.

౭౩. రాజేంద్రసాగరసూరి — ఇతఁడు సూరతులో జనన మందెను. వి. శ. ౧౮౯౨-వ సంవత్సరములో మాండవీనగరమున నిర్వాణ మందెను.

౭౪. ముక్తిసాగరసూరి — ఇతఁ డుజ్జయినీపురవాస్తవ్యుఁ డగు ఓస్వాలజ్ఞాతీయశాశీమచంద్రునికుమారుఁడు. తల్లి పేరు ఉమీదాబాయి. మూలనామము మోతీచందు. వి. శ. ౧౮౫౭ లో జననము. ౧౮౬౭ లో వైశాఖశుద్ధతృతీయనాఁడు దీక్షాగ్రహణము. ౧౮౯౨-వ వైశాఖశుద్ధద్వాదశినాఁడు పాటణములో నాచార్య, గచ్ఛేశపదములలబ్ధి. ఈసందర్భమున నగుఖర్చు లన్నియు సేఠానత్థూగోకలబే యొక్కఁడే భరించెను. ముక్తిసాగరుఁడు వి. శ. ౧౯౧౪-వ సంవత్సరములో ౫౭ ఏండ్లప్రాయమున నిర్వాణము నందెను.

౭౫. రత్నసాగరసూరి — ఇతఁడు కచ్ఛదేశములోని మోథాలా గ్రామనివాసి యగుశాలాడణపచాణయొక్క పుత్త్రుఁడు. తల్లి పేరు ఝూమాబాయి. వి. శ. ౧౮౯౨ లో జననము. ౧౯౦౫ లో దీక్షాగ్రహణము. ౧౯౧౪ లో నాచార్యగచ్ఛేశపదప్రాప్తి. ఇతఁడు ముప్పదియాఱేండ్లప్రాయమందే ౧౯౨౮-వ సంవత్సరపు శ్రావణశుద్ధతృతీయనాఁడు సుథరీగ్రామమున నిర్వాణ మందెను.

౭౬. వివేకసాగరసూరి —

అంచాపరగణా — గయాజిల్లాలోని ఔరంగబాదు సబుడివిజనులోని యొకపరగణా.

అంజకుఁడు — దనుపుత్త్రుఁడు.

**అంజద్ అలిషా** — ఔధ్ (అయోధ్య) నవాబులలో నొకఁడు. క్రీ.శ. ౧౮౪౨ మొదలు ౧౮౪౭ వఱకు పరిపాలించెను. ఈతని కాలముననే రాజ్యము క్షీణదశకు వచ్చెను. రానురాను రాజ్యపరిపాలనము మఱియు పాడగుచుండుటచేతఁ దగిన శ్రద్ధతీసికొని నియమితకాలమున దానిని జక్కఁబఱుపనియెడల తామారాజ్యమును స్వాధీనపఱుచుకొందు మని కుంఫిణీ (East India company) ప్రభుత్వమువారీనవాబును బెదరించిరి కాని ఫలితము లేకపోయెను.

గుమ్తి (గోమతీ) నదిమీఁదఁగలయినుపవంతెనను, హాజరత్ గంజియందలి సుందరమైనగోరీని ఈతఁడే కట్టించెను.

**అంజన్‌గామ్** — వరాడ్ (బీరార్) రాష్ట్రమున అమరావతిజిల్లాయందలి దరియాపూరుతాలూకాకుఁజెందిన యొకపెద్ద గ్రామము. ఇది ౨౧° ౧౦′, ఉత్తరను, ౭౭° ౨౦′ తూర్పున నడుమ నున్నది. జనసంఖ్య ౮,౨౮౩. ఇది షహనూరునదిమీఁద నున్నది. ఇది స్థానికవ్యాపారమునకు ముఖ్యస్థానముగ నున్నది. ఇచ్చట జరగు వర్తకములలో ముఖ్యము లయినవి, తమలపాకులు, వస్త్రములు, బుట్టలు. రెండవమహారాష్ట్రయుద్ధమునందు గావిల్‌గఢ మనుకోట యింగ్లీషువారివశ మయినతరువాత క్రీ. శ. ౧౮౦౩-వ సంవత్సరమున డిసెంబరునెలలో ౩౦వ తారీఖున దౌలతురావుసింధియాకును, ఇంగ్లీషుసేనాధిపతి యైన ఆర్థరువెల్లెస్లీకిని సంధి జరగిన దిచ్చటనే.

**అంజన్‌గో** — అరేబియన్ సముద్రతీరమున, కన్యాకుమారియగ్రమున కుత్తరముగా ౭౨ మైళ్లమీఁదను తిరువాన్‌కూరు సంస్థానముయొక్క సరిహద్దులలో నున్నయొక బ్రిటీషువారిగ్రామము. దీనివైశాల్యము ౨౫౦ యెకరములు. ఇందలిజనసంఖ్య ౩,౦౮౪. అందు సగముమంది క్రైస్తవులు. ఇది ౮° ౪౦′ ఉత్తరను, ౭౬° ౪౫′ తూర్పున నడుమ నున్నది. ఇది క్రీ. శ. ౧౯౦౬-వ సంవత్సరమున చెన్నపురరాజధానియందు మలబారుజిల్లాయందలి కొచ్చిన్‌తాలూకాయొక్క

భాగముగా నుండెను. కాని యావత్సరమున దీనిని తంగెస్సేరి యను గ్రామముతోఁ జేర్చి అంజన్ గోజిల్లా యను పేరితో తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానములం దుండు రెసిడెంటుయొక్క పాలనక్రిందికిఁ దెచ్చిరి. ప్రస్తుత మిది జీర్ణావస్థయం దుండి కుగ్రామముగా నుండినను, పూర్వ మింగ్లీషువారు మొట్టమొదట నీదేశమున నేర్పఱుచుకొనిన నివాసస్థలములలో నొకటిగా నుండి, యొకప్పుడు కొంత ప్రఖ్యాతి వహించియుండెను. ౧౬౮౪-వ సంవత్సరమున ఈస్టిండియాకంపెనీవా రిచ్చట నివసించుటకు అత్తింగల్ రాణియొద్దనుండి సెలవును బొంది, ౧౬౯౫లో నచ్చట నొకగిడ్డంగిని, కోటను గట్టుకొనిరి. ౧౭౨౧ లో అత్తింగల్ రాణిదర్శనమునకు వెళ్లినప్పుడు గిడ్డంగిముఖ్యాధికారియు, మఱి పదునురును చంపఁబడిరి. అందులకు ప్రతిఫలముగా ౧౭౩౧లో నీగ్రామమునకు చుట్టుపట్టుల నున్న కొన్ని మంచితోఁటలు తిరువాన్కూరురాజుచేతను, అత్తింగల్ రాణిచేతను కంపెనీవారి కీయఁబడెను. రే వంత మంచిదిగాకపోయినను మిరియములకును, కొబ్బరికాయలకును, కాలికోవస్త్రములకు నిది ముఖ్యస్థానముగా నుండినందున అనుకూలముగ నుండు నని కంపెనీవారు తలంచిరి. కొంతకాలమువఱకు గిడ్డంగి మంచి యభివృద్ధియం దుండెను. 'ఫాక్టరు' అనఁబడుగిడ్డంగియధికారి రాజసభలో గవర్నరునకు తరువాతివాఁడుగ నుండెను. కర్ణాటకయుద్ధములం దీగ్రామము రస్తుసామగ్రుల నుంచుచోటుగను, ఇంగ్లండునుండి వచ్చు ఓడలు నిలుపుస్థానములలో మొదటిదిగను ఉండెను. కాని ౧౮౧౨ వఱకుఁ బూర్తిగా క్షీణదశ నొందెను. అం దిప్పుడు శిథిలమయిన యొకకోటయు, పలురంగులతో వ్రాసిన మనోహరములైన చిత్రపటములు గలగోమనుకాథలిక్కు పురాతనదేవాలయమును గానవచ్చుచున్నవి. హిందూదేశపుజరిత్ర వ్రాసిన విఖ్యాతచరిత్రకారుఁడు రాబర్టు ఆర్మ్ (Robert Orme) ౧౭౨౮ లో నిచ్చటనే జనించెను.

**అంజన** — ౧. కుంజరుఁ డను వానరునకుఁ గూఁతురు. కేసరి యనువానరునకు భార్య: హనుమంతునకుఁ దల్లి. ఈమె పూర్వజన్మమునందు 'పుంజికస్థల' యను నప్సరస. శాపముచే భూమిపై వానరియై పుట్టెను. ఒకప్పు డీమె పర్వతశిఖరముపై నిలిచి యుండ గాలిచే నీమెవస్త్రము కొంచెము చెదరి, యీమెశరీరావయవములు వాయుదేవునకుఁ గానిపింప నాతఁడు మోహించి నిజస్వరూపమును బ్రకటించి యాలింగనముఁ గోరి యీమెసమీపమున నిలుపఁబడెను. అందుపై నాసాధ్వి 'నాపాతివ్రత్యమును భంగము సేయవల' దని కోరెను. అందుపై వాయుదేవుం డనుగ్రహించి 'భీతిం జెందవలదు. నీపాతివ్రత్యమును జెఱుపను. కాని నాసంకల్పమువలననే నీకు నావంటి పరాక్రమముగల పుత్త్రుఁడు పుట్టు' నని చెప్పి యంతర్హితుండయ్యె. అంత నంజన తనభర్తవలన గర్భము ధరించి హనుమంతుం గనియె.

(వా. రా. కిష్కిం. స ౬౬)

౨. ఉత్తరదిక్కునందలి యాఁడేనుఁగు.

**అంజనపర్వుఁడు** — ఘటోత్కచునిపుత్త్రుఁడు. జయద్రథునిమరణానంతరమున జరగినరాత్రియుద్ధమునం దీతఁ డశ్వత్థామచేఁ జంపఁబడియె. (భార. ద్రోణ. అ ౧౫౬)

**అంజనము** — ౧. అష్టదిగ్గజములలో పశ్చిమదిగ్గజము.

౨. భారతవర్షమందలి యొక పర్వతము. దీనిమీఁద నసితఋషియొక్క యాశ్రమ ముండెను.

౩. ఔషధవిశేషము. అంజనములన నెవ్వి? సామాన్యముగ నేత్రముల కిడునవి యంజనములా? ఈవిషయమునుగుఱించి కొంచెము విచారణ యావశ్యకము:

సామాన్యముగ నేత్రముల కిడుకాటుక కంజన మని పేరు. అందు నేత్రరోగములయందు కన్నుల కుపయోగించునవి యాయా నామభేదములతోఁ బరఁగినను చివర నంజనము లనుపదమును బ్రయోగించుట కలదు. కనుక సామాన్యముగ నేత్రముల కిడునవి యన్నియు నంజనములే యందుమా? చంద్రోదయవర్తి మొదలగువాని కంజనపదము లేనందున నేత్రముల కుపయోగింపకుండును. అట్లయిన నంజనములను కాటుక లందుమా? రసాంజనము మొదలగునవి కాటుకలు కాకపోవుటచే వాని కంజనము లని పేరు రాకపోవలసియుండును.

కావున నంజనము లనఁగా నౌషధవిశేషము లనియే యనఁదగియుండును. అందు నేత్రములకుమాత్ర ముపయోగించునవి, లోనికిఁ గూడ నుపయోగించునవి యని రెండువిధములు.

(నేత్రములకు మాత్ర ముపయోగించునవి) ౧. అమృతాంజనము, ౨. కణాద్యంజనము, ౩. గరుడాంజనము, ౪. తామ్రాద్యంజనము, ౫. చంద్రకాద్యంజనము, ౬. మూర్ణాంజనము, ౭. శ్రీనాగార్జునాంజనము, ౮. సౌవీరాద్యంజనము, ౯. నారికేళాంజనము మొదలగునవి అనేకనేత్రవ్యాధుల కుపయోగించునంజనములు.

(అమృతాంజనము) ౧. శుద్ధిచేసినసీసమును గరఁగనిచ్చి దానికి సమభాగము పాదరసము నం దునిచి రెండింటికిని సమము నీలాంజనము (సురమా) నునిచి చూర్ణముచేసి యాచూర్ణమున ౧౦-వ భాగము పచ్చకర్పూరము చేర్చి యొకడబ్బియం దునిచి ప్రతిదినమున నాయాకాలములయందు కన్నులకు శలాకతో నిడికొన నన్నినేత్రరోగములును హరించును.

౨. మైలతుత్థము, హేమాక్షికము, శంఖము, మణిశిల — వీనిభస్మము, సైంధవలవణము, జేసురు, సముద్రపునురుగు, మిరియాలు వీనిని సమముగ నిడి చూర్ణించి తేనెతోఁ గలిపి కనుల కిడిన స్రవ, తిమిరము, కాచము, శుక్లము మొదలగునేత్రరోగములు హరించును (రసమంజరి-అవ).

మిగిలినవానినిగుఱించి యాయాశీర్షికలయందుఁ గననగును.

లోనికిగూడ నుపయోగించునవి

రసాంజనము, పుష్పాంజనము, సౌవీరాంజనము, స్రోతోంజనము, నీలాంజనము అనునవి ౫ విధములగునవి లోనికిం గూడ నుపయోగింపును.

"సీ. మునినాథ! అంజనంబులు పంచవిధములై
తగ నుండు నామభేదములచేత
సౌవీరమును రసాంజనమును స్రోతోంజ
నంబును పుష్పాంజనంబు మఱియు
నీలాంజనంబు నా నెగడి యుత్తరమునఁ
దగఁ బుట్టవలె నుండు ధరణి పెరిఁగి
ఖండింప గైరికకాంతి సౌవీరంబు
నతిసిత మైన రసాంజనమ్ము
గీ. నల్లనై యున్న నీలాంజనం బటండ్రు
నల్ప నెఱు పున్న స్రోతోంజన మ్మటండ్రు
అన్ని విధముల నున్నఁ బుష్పాఖ్య మండ్రు
పసుపునను భృంగరసమునఁ బొసఁగు శుద్ధి.
గీ. అంజనంబులు సేవింప ననుదినంబు
వ్రణములను వాతపైత్యముల్ నక్రరుజలు
హిక్కలను శ్వాసకాసల నుక్కణంచి
కాంతి నిచ్చును గరళముల్ గరఁగిపోవు."

(రసప్రదీపిక. ఆ - ౨)

పైన వివరించినపద్యమునుబట్టి పై ౫ భేదములు గల యంజనము ఉత్తరదేశములయందుఁ బుట్టవలె నుండుభూమి త్రవ్వినఁ దొరకు ననియు వానిని సేవించినఁ గొన్ని రోగములు హరించు ననియు, వానిరంగిట్టి దనియు, వానిశుద్ధియుంగూడఁ దెలియనగుచున్నది.

వెనుక నుదాహరించినసౌవీరాద్యంజనము మొదలగునంజనములలో నాయాయంజనము లుపయోగపడుచున్నవి. కావున లోనికిం గూడ నుపయోగించునవి యనునంశము సుస్పష్టము.

మఱియు నీలాంజనమును శుద్ధిచేసి చూర్ణించి "సురమా" యని కనులకు శలాకల (కణికల)తో నంటింతురు. అది కన్నులచలువ కుపయోగము.

సామాన్యముగా కన్నుల కిడునంజనములు లేఖనము, రోపణము, దృష్టిప్రసాదనము అని మూఁడువిధములు. లేఖన మనఁగా శుక్లార్మాదిరోగములను శస్త్రము (కత్తులు మొదలగు యంత్రములచే) ఛేదించురీతిని ఛేదించుసాధనము. రోపణ మనఁగా నభిష్యందాది రోగములయందు కనులలో నిడునది. దృష్టిప్రసాదన మనఁగాఁ గన్నులు తేటపడుటకుఁగా నిడుసాధనము (అ. హృ. సూ. అ ౨౩).

అందు పులుసు, ఉప్పు, కారము అనునీరసములతోఁ గలసి, జింక మొదలగు జాంగలమృగములయొక్క కుడిపార్శ్వమున నుండు

లేఖన ద్రవ్యములు

"యకృత్తు" అనుకృష్ణవర్ణ (నల్లని) మాంసము, లోహ (ఉక్కు) చూర్ణము, తామ్ర (రాగి) చూర్ణము, శంఖచూర్ణము, పగడపుచూర్ణము, సైంధవలవణము, సముద్రపునురుగు, అన్నభేది, సురమారాయి (నీలాంజనము), మేఁకపెరుగుమీఁదితేట మొదలగునవి.

రోపణ ద్రవ్యములు

వగరు, చేదు అను నీరెండురసములతోఁగూడి స్నేహ (నెయ్యి, తేనె) యుక్తమైనట్టిచనుఁబాలు, కటుకరోహిణి, జింక మొదలగుజాంగలజంతువుల మాంసము మొదలగునవి.

ప్రసాదన ద్రవ్యములు

ప్రసాదనమునే స్నేహన మని కూడ వాడుదురు. మధురరసముతోఁ జేరి జాంగలజంతువులమాంసము, వస (మాంసములోని క్రొవ్వు), మజ్జ (ఎముకలలోని క్రొవ్వు), మేదస్సు (గుండెకాయలోని క్రొవ్వు), నేయి, కాకోలి, క్షీరకాకోలి మున్నగు నష్టకవర్గ మొదలైనవి.

లేఖన పుటపాకము

పై నుదాహరించినలేఖనద్రవ్యములలో జింక మొదలగువాని యకృత్తు, లోహచూర్ణము మొదలగువానిని మేఁకపెరుగు తేటలోఁ గలిపి నూరి ముద్దచేసి పుటపాక (చూడు: పుటపాకము) రీతిగ పుటం బిడి దాని రసమును ముందు వివరింపఁబోవురీతి నాశ్చ్యోతన మొనరించి ౧౦౦ నిమిషము లునిచి తీసివేయవలెను.

రోపణ పుటపాకము

పై నుదాహరించినరీతిగనే రోపణద్రవ్యములతోఁ జేసి యా రసమును ౩౦౦ ల నిమిషము లుంచి తీసివేయవలెను. (శా. ఉ. అ ౧౩)

ప్రసాదన పుటపాకము

పైరీతిగనే ప్రసాదనద్రవ్యములను పుటపాకము చేసి కన్నులకు వ్రేలితోఁ బట్టించి ౨౦౧ ల నిమిషము లుంచి కడిగివేసి గుడ్డతో వ్రేళ్లను జొనిపి తుడిచివేయవలెను. ఇచ్చట నాశ్చ్యోతన మవసరము లేదు. ఏల యనఁగా నన్నియు స్నేహ (జిడ్డు) పదార్థము లగుటచే పిడిచినరసమువలె వచ్చి నిలువయుండదు (అ. హృ. సూ. అ ౨౩).

ఆశ్చ్యోతనము

పై నుదాహరించినరెండువిధము లగురసములను గాలి లేనిస్థలమందు మనుజుని కూర్చుండనిచ్చి వైద్యుఁడు తనయెడమచేతితో వాని కన్నులను తెఱచి పట్టుకొని కుడిచేతితో నాలు చిప్పతోఁగాని, గాజుగొట్టము (అనఁగా సిరాకలములో సిరా నింపుపిచికారీ)తోఁ గాని ౨ అంగుళములదూరమునుండి కంటిలో ౧౦ గాని, ౧౨ గాని చుక్కలు సుఖోష్ణముగా నుండువానిని నల్లగ్రుడ్డుపై వదలవలెను. పిమ్మట మృదువగు గుడ్డచేత నేత్రము నద్ది సుఖోష్ణ మైననీళ్లతో తడుపఁబడిన గుడ్డతో నొత్తి చెమట కలిగింపవలెను. ఈవిధిని కఫ, వాతనేత్రరోగ

ములయందే కాని పిత్తరోగమునందు చేయంజనదు (అ హృ. సూ. అ ౨౩. శ్లో ౪).

ఇంకను పిండము, రసము, చూర్ణము అని యంజనము మూఁడువిధములుగ నుపయోగపఱుపవలెను.

పిండము — పిండ మనఁగా నాయావస్తువులచేతఁ జేయఁబడి ముద్దగా నుండునంజనము. దీనినే నేత్రములమీఁద వేసికూడ కట్టుదురు.

రసము చూర్ణము — రస మనఁగా వెనుకఁ జెప్పినద్రవరూపమగు నంజనము. మొదట నుదాహరించిన యమృతాంజనము మొదలగునవి గుండగా నుండు నంజనములు.

ప్రమాణము — పిండము తీక్ష్ణమైన ద్రవ్యములతోఁ జేయఁబడినచో బోడిసెనగంతయును, మృదుద్రవ్యములతో నిర్మింపఁబడినచో రెండంతలును ఉపయోగపఱుపవలెను.

రసము తీక్ష్ణమైన ద్రవ్యములతో నిర్మింపఁబడినచో ౬ మొదలు ౮ వఱకును, మృదువైన ద్రవ్యములతో నిర్మింపఁబడినచో ౧౦ మొదలు ౧౨ వఱకును చుక్కలుపయోగింపవలెను.

చూర్ణమును తీక్ష్ణమైనచో ౨ శలాకలును, లేనిచో 3 శలాకలు నుపయోగింపవలెను.

శలాక — ఇది లోహములతోఁ జేయఁబడి ౧౦ అంగుళములుపొడువు, పైరీపెన్సిలంత వలయమును కలిగి చివర గుండుగను, అంతయు సన్నగను ఉండవలెను. లేఖనమునందు తామ్రము (రాగి)తోఁ జేయఁబడినదియు, రోపణమునం దినుముతోఁ జేయఁబడినదియు, ప్రసాదనమునందు బంగారు లేక వెండితోఁ జేయఁబడినదియు నై యుండవలెను.

కాలము — రాత్రియందును నిద్ర లేవఁగనే పగలు ౧౦ మొదలు 3 గంటలలోఁగా మబ్బుగా నుండినదప్పుఁ దక్కినప్పుడు ప్రాతస్సాయంకాలములయందును అంజనమును ప్రయోగింపవచ్చును.

అర్హులు — భయము, వమనము, విరేచనము — వీనిసాధనము చేసికొనుట, అప్పుడే భోజనము చేసియుండుట, మలమూత్రముల బంధించుట, కోపము, జ్వరము, సూక్ష్మమైనట్టివియు, మిక్కిలి ప్రకాశము కలిగినట్టివియు నగు పదార్థములను చూచి నేత్రములను శ్రమ చెందించుట, శిరోరోగము మొదలగునవి లేకుండ నుండువార లంజనప్రయోగమున కర్హులు. (అ. హృ. సూ. అ ౨౩) (శా. ఉ. ౧౩. అ.)

(తి. ప. రా.)

**అంజనవనము** — కోసలదేశమున సాకేతనగరమునకు దగ్గర నున్నయొక ప్రాచీనమగు నరణ్యము. ఇందే బౌద్ధసూత్రము లనేకములు వెలువడినవఁట.

**అంజనవేలు దుర్గము** — ఇయ్యది బొంబాయిరాజధానియందలిరత్నగిరిజిల్లాలోనిది యైనచిపులూర్ తాలూకాలో నున్నది. ఇచ్చట పశ్చిమసముద్రపు ఉప్పుకయ్య భూమిలోనికి వచ్చును. సముద్రపుటొడ్డున నున్నపర్వతముమీఁద నీదుర్గము కట్టఁబడియున్నది. ఈదుర్గముమీఁదనుండి వేసినఫిరంగిగుండు ఉప్పుకయ్యయొక్క ముఖముమీఁదివఱకుఁ బ్రసరించును. దుర్గము రెండెకరములు వైశాల్యము కలది. దీనికి మూఁడువైపుల సముద్రమును, ఒకవైపున ఖండమును కలవు. ఇప్పుడు కందకము పూఁడిపోయినది. కోటకుఁ బదునెనిమిదిబురుజులు కలవు. లోపల మూఁడుబావులు కలవు. పూర్వము మందిరములు పెక్కు లుండెను. కాని యిప్పు డవి శిథిలము లైపోయినవి. ఈదుర్గమును మొదటఁ బదునాఱవశతాబ్దియందు విజాపురపునవాబులు కట్టిరి. ౧౬౬౦ లో శివాజీ యీదుర్గమును పట్టుకొనెను. ౧౬౯౯ లో జంజీరాకు నవా బైనహబశీఖైరాతఖాను దీనిని స్వాధీనపఱుచుకొని దీనికిఁ గ్రిందిభాగమున పడకోట యని యొకకోటను కట్టెను. ౧౭౪౪ లో తుళాజీ-ఆంగ్రే యనుమహారాష్ట్రవీరుఁడు హబశీయొద్ద నుండి యీదుర్గమును లాగుకొనియె. ఇతఁ డీకోటకుఁ బైభాగమున బాలేకోట యనుకోటను నిర్మించెను. ౧౭౫౫ లో పూనాపేష్వాలీదుర్గమున కధిపతు లైరి. వారిసుబేదా రొకఁ డిచ్చట నుండెను. ౧౮౧౮ లోఁ బేష్వాలరాజ్య మంతరింప మేనెల ౧౭-వ తేదీని కర్నల్ కెనెడీ ఈదుర్గమును స్వాధీనపఱుచుకొనెను. ౧౮౫౯ వఱకు నిచ్చట ౨౦౦ సిపాయీ లుండుచుండిరి. ఇప్పు డీకోట జనవిహీనమై జీర్ణస్థితియం దున్నది.

**అంజనావతి** — ఈశాన్యదిక్కునుండు ఆఁడేనుగుపేరు.

**అంజనుఁడు** — శాక్యవంశమునకుఁ జెందినరాజు. గౌతమబుద్ధునిమాతామహుఁడు.

**అంజనేరి** (అంజని) — బొంబాయిరాజధానియందలి నాసికజిల్లా, నాసికతాలూకాలో నున్న యొకగుట్ట, పర్వతదుర్గము. ఆగుట్టక్రింద నున్నపల్లెకుఁగూడ నిదియే పేరు గలదు. ఇది నాసిక పట్టణమునకు ౧౪ మైళ్లమీఁద నుండును. కోటలో అంజనీదేవియాలయము కలదు. ఈశాన్యమువైపున యూరోపియనుల నిమిత్తము గట్టఁబడినబంగాళాలు మూఁడు కలవు. వాని కెదురుగఁ జక్కనికొలనొకటి కలదు. మూఁడువైపులను దానిచుట్టును జంబూ (నేరేడు) వృక్షములు కలవు. నాల్గవవైపుననుండి నాసికజిల్లా యంతయుఁ బటము విప్పి చూపినట్లు కనులకుఁ గానవచ్చును. ఈకొలఁకులకు మీఁదుభాగమునఁ బర్వతములలోపలఁ దొలువఁబడినజైనదేవాలయ

"శ్లో. అచింత్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ యోజయేత్, సూత్రాంతర్యామ్యక్షరాణి తార్కికా నానుమన్యతే."

ఈ బ్రాహ్మణంబుచే దెలియవచ్చెడు సిద్ధాంతంబు లెవ్వి యన:

(౧) వాయునామకం బగు సూత్రాత్మచే సకలజగంబును ధరింపఁబడి పిండరూపమును దాల్చియున్నది:

"శ్రు. వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవంతి."

ఈ శ్రుతియొక్క తాత్పర్యమును విద్యారణ్యు లిట్లు ప్రకాశించిరి.

"శ్లో. అపంచీకృతభూతానాం కార్యం సూత్ర ముదాహృతమ్, అండారంభకభూతాని ప్రోతాన్యోతాని చాత్ర హి."

(౨) సూత్రాత్మకంటె నాంతర మైన యంతర్యామి యను తత్త్వ మొండు గలదు. అయ్యది సమస్తభూతములను జలింపఁజేయుచున్నయది. అదియే అమృతరూపం బగు పరమాత్మ.

"శ్రు. యః సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యోఽంతరో యగ్ం సర్వాణి భూతాని న విదు ర్యస్య సర్వాణి భూతాని శరీరం యః సర్వాణి భూతాన్యంతరో యమయ త్యేష త ఆత్మాంతర్యామ్యమృతః."

అంతర్యామినిఁగూర్చి విద్యారణ్యగురువు లిట్లు వచించిరి.

"శ్లో. సూత్రా దప్యాంతరం తత్త్వ మంతర్యామ్యాఖ్య ముచ్యతే, కార్యకారణభావోఽయ మస్మిన్నర్థే సమాప్యతే."

(3) అంతర్యామియే సర్వజ్ఞుఁడును, సర్వశక్తియుక్తుఁడును, సర్వవ్యాపియు, సర్వాత్మయును, జగజ్జన్మస్థితిహేతువు నగు ఈశ్వరుం డని విద్యారణ్యులు వాక్రుచ్చిరి.

"శ్లో. సర్వజ్ఞ స్సర్వశక్తిశ్చ సర్వాత్మా సర్వగో ధ్రువః, జగజ్జన్మస్థితిధ్వంసహేతు రేవ మహేశ్వరః."

(౪) అంతర్యామికంటె వేఱొండు ద్రష్ట లేఁడు:

"శ్రు. నాన్యోఽతోఽస్తి శ్రోతా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతైష త ఆత్మాంతర్యామ్యమృతోఽతోఽన్య దార్తమ్."

(౫) అంతర్యామియే యజ్ఞులచే జీవుఁడుగా భావన చేయఁబడుచున్నాఁ డని విద్యారణ్యులు నిర్వచించిరి.

"శ్లో. లోకే జీవతయా మూఢై రంతర్యామ్యేవ భావ్యతే."

ఇట్లీయంతర్యామిబ్రాహ్మణం బద్వైత తత్త్వమును బ్రకటించుచున్నయది.

(శ్రీ కల్యాణానందభారతీస్వామి.)

**అంతరిక్షుఁడు** — ౧. (స్వాయం. మం.) ఋషభమునిశతపుత్త్రులలో బ్రహ్మవేత్తలుగా నున్న తొమ్మండ్రలో నొకఁడు. (చూడు : ఋషభదేవుఁడు.)

౨. (సూ. వం.) ఇక్ష్వాకుకులోత్పన్నపుష్కరరాజుపుత్త్రుఁడు. ఇతనికి సుతపుఁడు, సుషేణుఁడు, సుమిత్రుఁడు అను ముగ్గురు పుత్త్రులు.

3. మురాసురునియేడ్వురుపుత్త్రులలో రెండవవాఁడు. కృష్ణునిచేఁజంపఁబడియె (చూడు: నరకాసురుఁడు).

౪. వైవస్వతమన్వంతరమునయొక్క పదుమూఁడవచక్రము (చౌకడి) నందలి వ్యాసుఁడు (చూడు : వ్యాసుఁడు).

**అంతర్గిరి, బహిర్గిరి** — దేశవిశేషములు. పెక్కుపర్వతములు గలది అంతర్గిరి. చుట్టును పర్వతములు గలది బహిర్గిరి. ఈరెండుదేశములును ఒకదానికొకటి సమీపమునం దుండెను. (భార. సభా. అ ౨౭).

**అంతర్వేది** — ౧. తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకాలో నొకవైష్ణవక్షేత్రము, వసిష్ఠగోదావరీముఖముమీఁద నున్నది. జనసంఖ్య ౭౯౬3. ఇచ్చట లక్ష్మీనరసింహస్వామివారి యాలయ మున్నది. విశేష్ణుఁడు ప్రార్థింప నీస్వామి యిట కేతెంచి రక్తవిలోచనుఁ డనురాక్షసుని సంహరించెనఁట. ప్రతిమాఘమాసమునను ఇచ్చట గొప్పకల్యాణోత్సవము జరగుచుండును. అప్పుడు రమారమి లక్షజనులు చేరుచుందురు. ఈయుత్సవమున కోనసీమద్రావిడులు పెండ్లికూఁతురు వైపువారుగ నెన్నఁబడి గౌరవ మందుదురు. ఇచ్చటి దేవాలయమునకు ౧౦౦ ఎకరముల మాన్యము గలదు. ప్రతిసంవత్సరమును రూ. 3,౦౦౦ లు నగదు తస్దీకు అలవన్సుకూడ ముట్టుచుండును.

౨. రెండునదులకు నడుమ నుండు ప్రదేశమున కంతర్వేది యని పేరు. కాని యీనామము ముఖ్యముగా గంగాయమునానదులకు మధ్య నున్న బ్రహ్మావర్తప్రదేశమునకుఁ జెల్లును. వేది యనఁగా యజ్ఞమునకై చదరముగా నేర్పఱచిన అరుఁగు. గంగాయమునలకు నడుమ నున్న బ్రహ్మావర్తప్రాంతమున యజ్ఞయాగాదులు వైదికకాలమునందు విశేషముగా జరగుచున్నందున దానికీపేరు వచ్చెను. దీనికే 'ఆబ్‌దో' అని పేరు. ఉత్తరమున సివాలిక్ పర్వతములు మొదలుకొని దక్షిణమున గంగాయమునా సంగమస్థల మగు ప్రయాగవఱకును వ్యాపించి యున్న ప్రదేశమునకిప్పుడు 'దూ ఆబ్' అనియు, ఇందలిదక్షిణభాగమున కంతర్వేది యనియుఁ బ్రస్తుతమునఁ బేళ్లు గలవు. ఈరెండుపదములను ఉత్తరహిందూదేశమునందుఁ బర్యాయపదములుగా వాడెదరు. సంయుక్తప్రాంతమందలి సహారన్‌పూర్ జిల్లా, ముజఫర్‌నగర్ జిల్లా, మీరట్ జిల్లా, బులందర్‌షహర్ జిల్లా, అలీగడ్ జిల్లా, మథురా ఆగ్రాజిల్లాలకొంతభాగము, ఏటా జిల్లా, మేన్‌పురీ జిల్లా, ఇటావా ఫరుక్కాబాద్ జిల్లాల యెక్కుడుభాగము, కాన్‌పూర్ జిల్లా, ఫత్తేపూర్ జిల్లా, అలహాబాద్ జిల్లా (ప్రయాగ

ని కొంతభాగము ఈ యంతర్వేదియం దిమిడియున్నది. ఈప్రదేశము గంగాయమునలవలనను, వానినుండి తీయఁబడిన కాలువలవలనను ఎల్లప్పుడు జలసమృద్ధి కలిగియుండి సాధారణముగా కఱవుల నెఱుంగక యున్నది. అంతర్వేదిప్రదేశములయందు గొప్పగొప్పపట్టణములును, వర్తకసంఘములును పెక్కులు కలవు. అవి యన్నియు వానివాని స్థలములయందు వర్ణింపఁబడును.

**అంతర్వేదిపాలెం** — పడమటి గోదావరి జిల్లా రాజోలుతాలూకాకు జెందిన యొకగ్రామము. జనసంఖ్య ౫,౨౪౬.

**అంతా** — బంగాళారాజధానియందుఁగల హౌరాజిల్లాలోని ఉలుబారియాసబ్‌డివిజనులో దామోదరనదిపైనున్న చిన్న పట్టణము. వాణిజ్యమువిషయమున దీనికిఁ గొంతప్రాముఖ్యము కలదు. అందుచే హౌరానుండి యిచ్చటికి ప్రత్యేకముగ నొకచిన్న యినుపదారి వేసినారు. దామోదరనదివఱదలవలన నిబ్బంది యేమియుఁ గలుగకుండ ప్రభుత్వమువా రిచట నొక కరకట్ట (Embankment) గట్టించినారు. ఇం దొక యున్నతాంగ్లపాఠశాలయు, కొన్ని గవర్నమెంటు కార్యాలయములును గలవు.

ఒకకాలమున నిది పేరందిన వర్తకస్థానముగ నుండెడిది. ఆకాలమున ఉప్పు, బొగ్గు విశేషముగ నిచ్చట నుత్పత్తి యయ్యెడివి. పడవల వ్యాపారము మంచియభివృద్ధిలో నుండెడిది. కాని యినుపదారి యేర్పడినతరువాత పడవలప్రాముఖ్యము సన్నగిలి నదీవ్యాపారము క్షీణదశకు వచ్చినది. ఒకకాలమున నిచ్చట కాగితము (Brown Country Paper) తయారు చేయఁబడుచుండెడిది. కొంతకాలమున కదియు విదేశీయపరిశ్రమపోటీవలన నంతరించిపోయినది. ఇప్పుడు 'అంతా'లో జరుగుపడవలవ్యాపారము కొలఁదిగ ధాన్యము, జనుపనార మున్నగు నైదాఱువిధములయినసరకులకుమాత్రమే సంబంధించి యున్నది. ఇచట చండీదేవతాలయ మొకటి కలదు. అందలిశాసనములనుబట్టి యిది ౨౬౦ యేండ్లనాటి దని తెలియుచున్నది. శివాలయముగూడ నొకటి యున్నది.

**అంతాజీ** — ౧. ఇతఁడు కోల్హాపూరు సామంతప్రభువులలో నొకఁడు. క్రీ. శ. ౧౭౧౨-వ సంవత్సరమునందు తారాబాయి యొక్క రాజ్యమును నాశన మొనరించునిమిత్తము రాజసబాయికి సాహాయ్యపడియుండెను.

౨. ఇతఁడు పేష్వా బాజీరావుయొక్క తమ్ముఁడు. చిమణజీ అప్పా యని యితని నామధేయము. ఇతఁడు కార్యశూరుఁడు, నీతిజ్ఞుఁడు, విద్వాంసుఁడు, దక్షుఁడు, రాజ్యతంత్రజ్ఞుఁడు. ప్రజల నందఱ నాకర్షించునట్టి శరీరసౌందర్యమును, పాటవమును గలిగినవాఁడు. పండ్రెండుసంవత్సరములప్రాయమందే యితఁడు సంస్కృతమున విశారదుఁడై పండితబిరుదమునుగాంచెను. దామాజీ థోరటుయొక్క సంపత్తి యితనికి లభించినది. మొట్టమొదట నితఁడు గుజరాతు దేశమును జయించెను. ఆసమయమున గుజరాతుపాలకుఁడగు సర్ బులందఖానునకును, దేహలీ (ఢిల్లీ) బాదుశాహాకును విరోధము కలుగఁ జక్రవర్తివలన సాహాయ్య మేమియుఁ బొందఁజాలఁడను ధైర్యముతో సర్ బులందఖాను నతనిశత్రువు లన్నివైపులఁ జుట్టుకొని బాధింపఁగడఁగిరి. ఇట్టిబాధలనుండి విముక్తుఁడగుటకుఁగాను ఖానుసాహెబు అప్పాతో సంధి గావించికొని చౌథ్ అనుపన్నును జెల్లింతు ననియు, శత్రువులనుండియుఁ దక్కుఁగల మహారాష్ట్రులనుండియుఁ దన్ను రక్షింపు మనియు వేఁడికొన నితఁడును అభయవచనమిచ్చి పాలన మొనరించెను. క్రీ. శ. ౧౭౨౯-వ సంవత్సరమునందు రాజా గిరిధరుఁడు గుజరాతురాజ్యపాలకత్వము వహించి తిరుగఁబాటు చేయుటచే చిమణజీ మరల గుజరాతుపై దండెత్తి దానిని లోఁబఱుచుకొనెను. పిదప చౌలుదుర్గమున నుండిన మనాజీని శంభాజీ ముట్టడింప చిమణజీ యచటికిఁ బోయి శంభాజీని బాఱఁదోలి యాదుర్గమును గాపాడుకొనెను. ఇట్లు చిఱుతప్రాయమునందే యనేకప్రకారముల ధైర్యసాహసపరాక్రమకార్యము లొనరించినయీవీరాగ్రేసరుఁడు కాసరోగమునకు బలియై దానివలన విముక్తి గానక తుదకు ౧౭౩౦-వ సంవత్సరమునఁ గాలధర్మము నందెను. ఇందువలనఁ గేవలము మహారాష్ట్రులకుమాత్రమే కాదు సమస్తభారతవర్షమునకును వచింప నలవి కాని హాని కలిగినది. ఇతఁడు మఱికొంతకాలము జీవించియుండినచో భారతేతిహాసము వేఱొకరీతిగ నుండెడి దని చరిత్రకారులయభిప్రాయము. ఇతఁడు మంచి కలయఁగలుపుస్వభావము గలవాఁ డగుటచే పేష్వాయెదుటికిఁ బోవ భయపడు దక్షిణమండలి సామంతప్రభువు లనేకులు మున్ముందు చిమణజీని సమీపించి యితనిమూలముననే తమ కార్యములఁ జక్కఁబెట్టుకొనుచు వచ్చిరి. బాజీరావు గావించు నవీన యకార్యములనుగూడ నితం డడ్డగింపుచుండెను. ఇంత యేల, బాజీరావు విముఖత్వము వహించుచుండ నతనిపరివారము రక్షణముగూడ నితఁడే చేయుచుండెను.

**అంతాజీమల్హారరావుబర్వే** — ఒకమహారాష్ట్ర రాజ్యాంగవేత్త. శ్రీమంత్ బాలాజీ విశ్వనాథపేష్వాభార్య యగు రాధాబాయి యితనిమేనత్త. ఇతనిభార్య పేష్వాకుటుంబములోనిది. అంతాజీ నిజాముదగ్గఱను, ఢిల్లీ మొగలుచక్రవర్తులయొద్దను పేష్వాతరఫున వకీలుగఁ బనిచేసెను. నాదిర్‌షా దండయాత్ర సందర్భమున నాతఁడు ఢిల్లీలోనే యుండెను. దానిసంపూర్ణవర్ణన మితనివ్రాఁతలలో దొరకును. పేష్వా యితనికి రాజణగావ్ ఈనాముగ నొసంగెను. నాదిర్‌షా దండయాత్రాసందర్భమున నతఁ డుత్తరహిందూస్థానములోని జాట్, బుందేల్ మున్నగు సంస్థానములయధిపతుల నేక మొనర్చి తురకలఁ బ్రతిఘటింపఁజేసెను. ౧౭౪౯-వ సంవత్సరమున అంతాజీ మరణించెను.

**అంతాజీమాణకేశ్వరుఁడు** — ఇతఁడు మహారాష్ట్రదేశపు పేష్వాలకొలువున నుండిన దేశస్థబ్రాహ్మణుఁ డగు నొక సరదారు. గంధే ఇతనియింటి పేరు. ఇతఁడు నగరజిల్లాయందలి కామరగ్రామమునకు 'జోషి' యుఁ, గరణమును. ఢిల్లీపాదుషాకు

సాహాయ్య మొనరించిన కారణమున ఇతనికి ఇటావా, ఫుఫుంద్ లను రెండుపరగణాలు జాగీరులుగ లభించెను. ఇతఁడును, పేష్వాబాలాజీ బాజీరావుదివా నగు సఖారాంబాపును వియ్యంకు లని తెలియుచున్నది.

౧౭౫౫-వ సంవత్సరము, సెప్టెంబరుమాసమున మార్వాడమున తద్దేశాధీశుఁ డగు విజయసింగుతో యుద్ధముచేయుచుండిన దాత్తాజీ సింధియా సాహాయ్యార్థ మంతాజీ పంపఁబడెను. త్రోవలో కరవలీ, బుందీకోటలనుండి విజయసింగుసాయమున కేఁగుచుండిన సేనలకు లంచ మిచ్చి యంతాజీ వారిని వెనుకకు మరలించెను. అనిరుద్ధసింగునాధిపత్య మున జయపురపురాజగు మాధోసింగు కొంతసైన్యమును విజయసింగు సాయమున కంపియుండుటచేత అంతాజీ జయపురమును కొల్లగొట్టెను. జయపురపు సేనకును, సింధియాసేనకును యుద్ధము జరగుచుండ అంతాజీ సింధియాసైన్యమునఁ జేరి జయపురవాహిని నోడించెను. అనిరుద్ధసింగు అంతాజీతో సంధి చేసికొనెను: పిదప విజయసింగుకూడ నోడిపోయి అంతాజీతో సంధిగావించుకొనెను.

౧౭౬౦-వ సంవత్సరమున మహారాష్ట్రులకు పానిపట్టుయుద్ధ మున నపజయము సంభవించి, యనేకు లందు నిహతు లైరి: హత శేషులు కొందఱు తమప్రాణములను రక్షించుకొనఁ బాఱిపోయిరి. రాత్రివేళ నంతాజీకూడ నిట్లు పాఱిపోవుచుండ ఢిల్లీయొద్ద ఫర్రుకా బాదుజమీన్దారు ఆతనిని బట్టుకొని వధించెను.

అంతాజీపుత్త్రునిపేరు బహిరోపంత్. అంతాజీవంశజు లిపు డుత్తరహిందూస్థానమున 'ఖేలశే' యందున్నారు. ఇపుడు 'మాండకే' యనునది వారి యింటిపేరు.

**అంతాజీరఘునాథుఁడు** — ఒక మహారాష్ట్ర వీరుఁడు. బొంబాయిరాజధానిలోని ఠానాజిల్లాలోఁగల మాలాడ్ అను గ్రామమునకు ఈనాందారుగ నుండెను. అంతాజీకి మతముపై నధికమగు నభిమానము. దీనిమూలమున నాప్రాంతములనున్న పాశ్చాత్త్యులతో నిత నికి విరోధ మబ్బెను. ఈకారణమున నితఁడు ప్రజలలో వారికి వ్యతి రేకముగ ప్రచార మొనర్చి యుద్రేకము గలిగించెను. అటుపై వా రితనిఁ బట్టుకొనుటకుఁ బ్రయత్నింప నితఁడు పూనాకుఁ బాఱిపోయి పేష్వాలకడఁ జేరెను. అచటనుండి అంతాజీరఘునాథుఁడు యుద్ధము లలో పేష్వాలకు సాయపడుచుండువాఁడు.

అంతాపురము — బళ్లారిజిల్లా హాస్పేట తాలూకాకుఁ జెందిన గ్రామము. జనసంఖ్య ౩౧౩.

అంతార్ — ప్రసిద్ధుఁడగు నొకయరబ్బీకవి. మక్కా మసీదులో నితనికవిత బంగారపుటక్షరములతో వ్రాయఁబడియున్నది.

అంతిపేట — విశాఖపట్టణముజిల్లా బొబ్బిలితాలూకాకుఁ జెందిన జమీన్దారీగ్రామము. దీనిజనసంఖ్య ౫౩౫.

అంతిభారుఁడు — (చం. వం) నహుషకులోత్పన్న ఋయాతిపుత్త్రుం డగు పూరునివంశమునందు జన్మించిన రౌద్రాశ్వ రాజునకుఁ బౌత్త్రుఁడు. ఋతేయురాజునకుఁ బుత్త్రుఁడు. ఇతి అంతినారుఁడు, మతినారుఁడు అను మాఱుపేళ్లు కానవచ్చుచున్న ి. భార్య మనస్విని. పుత్త్రులు సుమతి, ధ్రువుండు, అప్రతిరథుండు.

అంతిలి — గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకా జమీన్ దారీగ్రామము. జనసంఖ్య ౨౨౫.

అతివలస — ఇది విశాఖపట్టణముజిల్లా పార్వతీపురము తాలూకాకుఁ జెందిన జమీన్దారీగ్రామము. జనసంఖ్య ౧౯౮. ఇదే పేరుగలగ్రామము ఈజిల్లా సాలూరుతాలూకాయందు మఱియొకటి కలదు. ఇందలి జనసంఖ్య ౧౯౧.

**అంతూర్** — హైదరాబాదుసంస్థానమున ఔరంగా బాదుజిల్లాలోని కన్నడతాలూకాలో నున్న యొక పురాతనదుర్గము. ఇది ఖాన్దేశమువఱకు వ్యాపించియున్న పర్వతమాలికలలో నొకదాని శిఖరముమీఁద నున్నది. పదునైదవశతాబ్దిని నొకమహారాష్ట్ర నాయకునిచే నీదుర్గము కట్టఁబడియె. కొంతకాలమున కది అహమ్మదునగరరాజుల కును, తరువాత నౌరంగజేబుచక్రవర్తికిని వశమయ్యెను. అచ్చట నున్న ఫిరంగుల నన్నిటిని ఔరంగజేబు తీసికొనివెళ్లెను. దుర్గమునకు దక్షిణ మున రెండుమైళ్లదూరమున నలుచదరముగనుండు స్తంభము కలదు. దానిమీఁద క్రీ. శ. ౧౫౭౮ లో పారసీకభాషలో వ్రాయఁబడిన శాసన మొకటి గలదు. దానిఁబట్టి చూడ నాస్తంభ మాసంవత్సరము నందు ముర్తజనిజాంషాహవలన నిర్మింపఁబడెనని తెలియుచున్నది.

అంతూరు — అహమద్ నగరప్రాంతమందలి యొకపట్ట ణము. ఇక్కడ పురాతనదుర్గముకూడఁ గలదు. అహమద్ నిజాంశాహ యీదుర్గమును ముట్టడించి నాశనము గావించెను.

అంతెలవరం — గంజాముజిల్లా శ్రీకాకుళముతాలూకా లోని జమీన్దారీగ్రామము. ఇచటి జనసంఖ్య ౪౬౩.

అంతోబాగోసావీ — శ్రీ శివాజీగురు వైన రామ దాసస్వామివారికి శిష్యుఁడు. సతారాజిల్లాలోని మేథవడ యను గ్రామముననుండువాఁడు. కార్తికపూర్ణిమకు, నాషాఢపూర్ణిమకు నితఁడు గురువునాజ్ఞ ననుసరించి పంఢరిపురమునకు యాత్రకుఁ బోవుచుండెను.

**అంత్యేష్టి** — మానవుఁడు మరణించినపుడును, తరు వాతను అతనినుద్దేశించి చేయు కర్మములసముదాయమున కంత్యేష్టి యని పేరు. మరణము తప్ప దని నిర్ధారణ యగుటతోడనే కొన్ని కర్మములు నడపఁబడుచున్నవి. మరణానంతర మాయాసంఘపుఁ బద్ధ తులనుబట్టి కొంతకాలమువఱకును గొన్నికర్మములు జరగును. ఇట్టి కర్మము లెల్ల నీవ్యాసమునకు విషయములే. మరణ మనివార్య మని యెఱింగియు సాధారణముగ మనుష్యుఁ డీలోకప్రబంధములను విడిపించి కొని పోవ నిష్టము లేనివాఁ డయి అది స్వభావసిద్ధము గా దనియు,

గో యొక కారణముచే, దేవునికోపముచేతనో దేవతల యీర్ష్యచేతనో యితరమనుజులమాయచేతనో కలుగుచున్న దనియు నమ్ముచున్నాఁడు. ఇంతేకాక మానవుఁడు మరణించుచున్నాఁడన్న నీలోకమును విడిచిపోవుచున్నాఁడనిమాత్రమే దాని కర్థమనియు; పరలోకమున నతఁడు మరల సశరీరుఁడయి జీవించుచుండుననియు సాధారణముగు నొక విశ్వాసము. ఇందుమించుగ మానవుని మరణానంతరమున నతని నుద్దేశించి చేయఁబడు కర్మము లన్నియు నీ విశ్వాసములపై నాధారపడియున్నవే.

బర్మాదేశమునకుఁ జేరిన మెర్గీద్వీపులయందలి సీలింగుజాతివారు భయంబునఁ జేసి మనుష్యుఁడు చావకమునుపే యతనిని దిగవిడచి దూరముగ తొలఁగిపోదురు. యాహూతు లనఁబడు మఱియొక యనాగరకపుజాతివారియం దింతకంటెను విచిత్రమయినట్టియద్భుతాచార మొకటి కలదు. ఇఁక మరణము రానున్న దని తోఁచినతోడనే మృతినొంద నున్నవానికి మూఁడుదినములు మహోత్సవమున విందులు చేయుదురు. తదనంతర మాతనిని అడవికిఁ గొనిపోయి ఆయుధములు, భోజనపదార్థములు పాత్రములతోఁగూడ గోరీలో ప్రవేశపెట్టి పూడ్చివైతురు. ఈయాచారములయొక్క ఛాయ మనదేశమునను గానవచ్చును. మనుష్యుఁడు చావనున్నాఁ డనుటతోడనే అతనిని ఇంటివెలుపటికిఁ దీసికొనివచ్చెదరు. దర్భలో, భూమియో యాతనికి శయ్య యగును. ఈసందర్భమున శవమును భూమిపై నుంచుటకుఁగూడ నియమితములైన కొన్ని పద్ధతులు గలవు. కొన్నికొన్ని జాతుల ప్రజలు వీనిలో కొన్నికొన్ని పద్ధతుల ననుసరింతురు. ఆయా మతనియమములయం దివి నిర్ధారింపఁబడి యున్నవి. మొట్టమొదటిరోజులలో శవమును సాధ్యమయినంత చిన్నదిగా ముడుచుకొనియుండున ట్లొనర్చెడివారు. కాని కాలక్రమమున నీ పద్ధతి నశించినది. ఇప్పుడు శవమును సరాసరి నిట్టనిలువున పరుండఁబెట్టుటయే యాచారము. క్రైస్తవులు శవముకాళ్లు తూర్పుదెస నుండునట్లు పరుండఁబెట్టుదురు. ప్రాణి తన యంతిమకాలమున నాదెసకుఁ బోవు నను నమ్మకము దీనికి కారణము. మహమ్మదీయులు మక్కాకెదురుగ ముఖ ముండునట్లు కుడిప్రక్క నేలకాన్చి పరుండఁబెట్టుదురు. బుద్ధుఁడు ఉత్తరపుదెస ముఖముంచి మరణించుటచే శవములను పాతిపెట్టునాచారముగల బౌద్ధులు దాని నట్లే, ముఖము పైకుండునట్లు శయనింపఁజేతురు. జపానువారి శవవాహనము తొట్టియాకారమున నుండును. శవమును వా రందుఁ గూర్చుండఁబెట్టుదురు.

చనిపోక ముందే దిగ విడుచుట

ఈకడపటి యవస్థలో మనదేశమున మరణ మందువానికి జీవప్రాయశ్చిత్తము చేయించుటయు, వానిచే షోడశమహాదానంబు లిప్పించుటయు వాడుక[1]. జీవప్రాయశ్చిత్తమునకు సమాన మైనయాచార మొక్కటి క్రైస్తవు లగు రోమనుకాథలిక్కులలోఁ గానవచ్చుచున్నది. ఈ లోకము విడిచిపోనున్నప్పుడు జీవుఁడు తా నిచ్చటఁ జేసినపాపములను మతాచార్యులకు పూసగ్రుచ్చినట్లు చెప్పి పశ్చాత్తాపము నందుటను సూచించి ఆతనిచే దీవన లందును. ప్రాయశ్చిత్తమునకుంగూడ నిట్టియర్థమే యుండియుండవలయు ననుట విదితము.

ప్రాయశ్చిత్తము దానములు

మరణము సంభవించినతోడనే కొన్ని కొన్ని దేశములలో నింటికిటికీల నన్నిటిని తెఱచివైతురు. ఆత్మ నిరాటంకముగా వెడలిపోవుట కిట్టి యేర్పా టవసరమని యచ్చటివారి నమ్మకము.

నిర్గమనము

అన్ని దేశములందును మరణానంతరము బంధువులు దుఃఖమును దెలియఁజేయుటకు బిగ్గఱగ నేడ్చుట యాచారము. గరుడపురాణమునను, మహమ్మదుచేతను ఇట్టియాచారము తగ దని ఖండింపఁబడెను. కాని ఆఖండనమునుగూడ ప్రజలు పాటించుట లేదు. చనిపోయినవారికయి పుత్త్రులు మున్నగాఁగల ప్రియతములు విలపించుట సహజము కాని, ఈవిలాపమునుసది ఆచారముగ పరిణమించి కొన్నియెడల హాస్యాస్పద మయియున్నది. మనదేశముననే అఱవవారిలో గతించినవారికయి యేడ్చుట యొకవిద్య యయినది. ఏడువఁగలబంధువులు లేనిచోట కూలివారిని బెట్టి రోదనకార్యము చేయింతురు.

విలాపము

ఇట్టివిపరీతాచారము దక్షిణామెరికాలోను, మాల్టాదీవులలోను మఱియు ప్రపంచమునం దనేకములయిన యితరస్థలములలోను గానవచ్చుచున్నది.

ఈ విలాపకలాపము జరుగుచుండఁగనే శవమున కలంకరణవిధి జరగును. మిక్కిలి యనాగరకసంఘములలో రంగులు పూయునాచారము కలదు. కొన్నికొన్నియెడల కళేబరమును కొంతకాలమువఱకో, ఎల్లకాలమో అట్టె యుంచుతలఁపున ద్రావకములఁ దడిపి యుంచుట గలదు. అమెరికాఖండములో వర్జీనియా కరోలినా యనుభాగముల రాజులయు, ప్రభువులయు కళేబరములను సర్వకాలము ఒక్కయాలయమున నునిచి వానికిఁగాను పురోహితు నొక్కని నియమించుచుండిరఁట.

సభ్యసంఘములలో కళేబరమును నీళ్లు పోసి కడుగుట సాధారణాచారము. అలంకారవిషయమున పలుతెగలలో పలువిధములు గానవచ్చుచున్నవి. చీనావారును, ఐరోపాలోఁ గొందఱును మరణమునకుఁ బూర్వమే తమకళేబరమునకు నలంకారప్రాయములు కావలసిన దుస్తులను సిద్ధము చేసి యుంచుకొందురఁట. బ్రిటిషుదీవులలో కళేబరమునకు జోళ్లనుగూడఁ దొడిగింతు రందురు. మనదేశమునను నిది లేని యాచారము గాదు. శూద్రులలో అందును ముఖ్యముగా నాయళ్లు, మొదలియారులు, బలిజలు, జంగమువారు, కమసాలులు మున్నగువారిలో కళేబరములకుఁ జేయునలంకారము లపరిమితములు. అయినను బ్రాహ్మణాదులలో నొక క్రొత్తగుడ్డకంటె ఎక్కు డేమియు

అలంకారము

1. ఈదానములు కొన్ని చేసినపాపములు పోఁగొట్టుటకును, మఱికొన్ని మరణానంతరము ఆత్మకు సాయపడుటకును నై యున్నవి.

కానరాదు. గరుడపురాణము ననుసరించి మంచిగందముతోను, పూల హారములతోను, గోపీచందనముతోను కళేబరము నలంకరింపవలయును.

ఈయలంకారములకుఁ గారణ మాత్మ కీదేహమువంటిదే ప్రేత యొక దేహము కలదనియు, నిచ్చటియలంకారములవంటివే యలంకారములు పైలోకమునఁ గావలసియుండు ననియు నమ్మట యయియున్నది.

ఇదే కారణమున నితరాచారము లనేకములు పెచ్చు పెరిగి యున్నవి. కళేబరమును కడపటియవస్థను జేర్చుటకు మున్ను చనిపోయినవానికి అన్ని యనుకూలములును గలుగఁ జేయుట లోకమునం దెల్లెడలను ఆచార మైనది. ఆరాదీవులలో చనిపోయినవాఁడు కొలువు తీర్చును. అతనిబంధువులును, కుటుంబమువారును అతనికి భోజనమును, త్రాగుడును సమర్పింతురు. రుష్యాదేశమున పదునేడవ శతాబ్దిలో కళేబరముచెంత స్నానమునకు నొకపాత్రమున నీళ్లను, దూరప్రయాణమునకు రొట్టెలును బెట్టుచుండిరట. మన దేశమునను కళేబర ముంకుభూ భాగమున పిండప్రదానము చేసి తరువాత శవము నెత్తుకొనవలె నని యాచారము. పదిదినములకర్మములలోను నిదియే స్ఫుట మగుచున్నది.

*అన్ని యనుకూలములు*

కళేబరమును శ్మశానభూమికిఁ దీసికొనిపోవుటకు ముందు బంధువులను, స్నేహితులను, మిత్త్రులను బిలుచుట యనేకసంఘములలోఁ గలదు. మన దేశమున శూద్రులలో ముఖ్యముగ మొదలియారులలో నీయాచారము బాగుగ నెలకొని యున్నది. కొన్ని కొన్ని సంఘములలో నిది విపరీతమై కనుపించుచున్నది. కొరయ లనుజాతివారిలో శవముకడ గుంపులు గూడి చీట్లాడుదురు. ఐర్లాండులో నీ సమావేశములు మితి మీఱిన యాటపాటల కాశ్రయములయి స్త్రీపురుషులయందవలిదురాచారముల కాకరములు. ఇంగ్లండులో నొకకాలమున నిట్టియవస్థయే యుండెడిది.

*పిలుపు*

పీనుఁగు పడియుండ నేలాటిపనియు గ్రామవాసు లందఱును చేయరా దని మొలాకాదీవులలో నియమము. మన దేశమునను నిట్టిది కలదు. కాని సాధారణముగా నీ నియమ మొక్క_క వీథికి మాత్రమే వర్తించుచున్నది. టిబెట్టు దేశము లోనిమతాధికారి దాలేలామా గతించినవారముదినములవరకు ఎవ్వరును, ఏపనియును జేయరాదు. స్త్రీలు మాసము దినములవఱకును నగలను ధరింపరాదు. ఈవిధమున మైల మనకును గలదు. మన దేశమున బ్రాహ్మణాదులలో పదిదినములును, ఇతరులలో పదునాఱు రోజులును మైల గలదుగదా!

*మైల*

ఇఁకఁ గళేబరమును గడపటియవస్థం జేర్చుటనుగుఱించి వ్రాయ వలసి యున్నది. పీనుఁగుల నేడువిధములఁ దీర్చివేయుట గలదు: (౧) కొంద ఱడవిజాతులవారు భక్షించివైతురు. (౨) కొందఱు కొనిపోయి వృక్షములశాఖలలో నిడి వత్తురు. ఈయాచారము మన దేశమునఁ బూర్వ ముండినట్లు తోఁచెడిని. పాండవు లజ్ఞాతవాసమునకుఁ బోవుచు

*ఏడువిధముల తీర్పు*

తమయాయుధములను శమీవృక్షముపయి నిడి ఆప్రక్క నుండినజనులకు శవాకారమున నుండినయాయుధములు దమతల్లికళేబరం బని చెప్పిరి. జనులు దానిని నిజ మని నమ్మినట్లును విశదమే. అక్కాలమున నీయాచారము లేకున్న ఈనమ్మకు యెట్లు తటస్థించును?

పారసీవారల సమాధివిధాన మిచ్చట వివరింపవలసి యున్నది. వారు కళేబరమును పూడ్చుటలేదు, దహనము చేయుటలేదు. బావి త్రవ్వి దానిచుట్టును మెట్లు మెట్లుగ ఎత్తుగఁ గట్టబడినయరుఁగులమీఁద శవములను గొనిపోయి గుడ్డ లన్నియుఁ దీసివేసి పరుండఁబెట్టెదరు. రెండుమూఁడుగంటలకాలములో గ్రద్దలు శవమునందుండు కృళ్లగల పదార్థము నంతయుఁ దినివేయును. అందు కని యేర్పడినయిద్దఱు నౌకరులు నిలిచి యెముకల నాఱుమాసముల కొకమాఱు బావిలోనికి త్రోసివేయుచుందురు. పారసీవారు మృత్యువు పవిత్ర మని యెంచి కళేబరమునకు దూరముననే యుందురు. పైనిచెప్పిననౌకరులు దప్పఁ దక్కినవా రెవ్వరును శవమును దాఁకరు. శవముల నుంచుస్థలమునకుఁ బోరు.

(౩) కొంద ఱడవిజాతులవారు తమవారికళేబరములను గొని పోయి గుహలలో నైచి వత్తురు. (౪) ఇంకను కొందఱు కళేబరముల నాలయములలో నుంతురు. ఇంతకు నాలుగువిధంబు లయ్యె. ఇంక మూఁడువిధంబులు గలవు. అవి ప్రఖ్యాతములు. లోకసామాన్యములు. (౫) వీనిలోఁ దక్కువప్రచారము గలది కళేబరమును నీట విడుచుట. మనవారుగూడ ఈవిధ మగుసమాధియే యుత్తమసమాధి యని తలంచిరని చెప్పవలసి యున్నది. దహన మైనపిదప శల్యముల నేఱుకొని మూట గట్టి గంగాజలంబుల విడిచినచో మహాఫల మని గరుడపురాణము నొక్కి చెప్పుచున్నది. గంగాజలములం దుమదేహమును విడుచుట ఉత్తమోత్తము మని కాశికి వెళ్లువారును ఈవిషయమునే స్థిరపఱచుచున్నారు.

బిస్మార్కుదీవులలో జలసమాధి అనురాగసూచకము. ప్రియతములు చచ్చినప్పుడు వారి నొకపడవలో నుంచి సముద్రములోనికి దాని నీడ్చి యచ్చట పడవతోడంగూడ నన్నిటిని ముంచివేయుదురు. న్యూగ్రనడాదేశమున ప్రభువులు చచ్చినచో వారిని బంగరు పెట్టెలలోఁ బెట్టి జలసమాధి చేయుచుండురు. మన దేశమున పంజాబులో భగత్ పంథ లనుతెగవారు కలరు. వీరు శవమును దహనము చేయరు. హిందూవ్వాచారము లేవియు వీరు నడపరు. శవమును యోగాసనమునఁ గూర్చుండఁబెట్టి సమాధి యొనఁ జేయుదురు; లేదా గంగలో నయినను విడచెదరు.

(౬) భూమిలోఁ బూడ్చుట అనఁగా సమాధి చేయుటయు (౭) కాల్చుట అనఁగా దహనముచేయుటయు లోకమున కంతటికిని సామాన్యమయిన విధులు. తక్కినపద్ధతు లిప్పు డెక్కడనో కొన్ని యాటవికజాతులయందుఁ దప్ప, నాగరకప్రపంచమం దాచరణలో లేవు. కొన్ని దేశములలో శవములను బూడ్చుటయు, తక్కినదేశము

గో దహనముచేయుటయు మాత్రమే యిప్పు డనుసరింపఁబడుచున్న పద్ధతులు. పాశ్చాత్యదేశములయందు శవములను పూడ్చివేయుటయే యాచారము. యుగాంతమునందు భగవంతుఁడు పుణ్యపాపముల నిర్ణయించునాఁటికి మరల నీ మరణించినవా రందఱును పైకి లేచివత్తురనియు, అంతవఱకు నీ మృతశరీరములన్నియు సమాధియందే యుండుననియు, జీవుఁడుగూడ నందే నివసించుచుండుననియు వీరి విశ్వాసము. వీరి యభిప్రాయము ననుసరించి మానవునికి పునర్జన్మ ముండదు. మహమ్మదీయుల విశ్వాసములుగూడ నిట్టివే.

కాని యీనడుమనే ౧౯-వ శతాబ్దియందే పాశ్చాత్యదేశములలో శవమును తగులఁబెట్టవలయునేకాని పూడ్చివేయరా దను సిద్ధాంతము పైకివచ్చినది. ఆరోగ్యమునకును, పరిశుభ్రతకును సంబంధించిన కారణములే యీ సిద్ధాంతమున కాధారముగ నుదాహరింపఁబడుచున్నవి. కాని యిప్పటికిని శవదహనాచారము పాశ్చాత్యదేశములలో మిక్కిలి యరుదే. పురాతనముగా వచ్చుచున్న యాచారమునందు ప్రజలకుఁ గల విశ్వాస మింకను సడలకుండుటయే దీనికి కారణము.

భారతదేశమునఁగూడ మొట్టమొదట శవములను బూడ్చుటయే యాచారముగ నుండినది. కాని క్రమముగ వేదకాలముననే యది మాఱిపోయి దహనము వచ్చినది. ఐన నిచ్చట పాశ్చాత్యదేశములలో కలుగుచున్న పరివర్తనమున కట్లు, ఆరోగ్యపరిశుభ్రత లీ మార్పునకు కారణములు గావు. ప్రాణిని లోకాంతరమునకుఁ జేర్చుటకు అగ్నియే తక్కినవానికన్న నెక్కుడుసమర్థమయిన దనియు, అందువలన అగ్ని ముఖముననే జీవుఁడు లోకాంతరము చేరుకొనవలయుననియు నొక విశ్వాసమే యిందులకు కారణము. సాధారణముగ నిట్లు శవమును తగులఁబెట్టుటయే మనదేశమున నాచారముగ నున్నను హిందువులలో శవములను బూడ్చిపెట్టునాచారము ననుసరించువారుగూడ నేఁటికిని గలరు.

మొత్తముమీఁద నీ రెండుపద్ధతులందునుగూడ కొన్ని విచిత్రములైన యాచారము లనుసరింపఁబడుచున్నవి.

చనిపోయినవారితో వారిభార్యలను, దాసులు మున్నగువారిని పాతిపెట్టుటయు, దహనమొనర్చుటయు జరగుచుండెను. మనదేశమునందుఁ బూర్వమున స్త్రీలు భర్తలతో చితి నెక్కుట మనకుఁ దెలియనిదికాదు. ఇది కొంతవఱకు మొదట మొదట అనురాగజనితమే యయినను గ్రమక్రముముగ నిర్బంధాచారమయ్యెను. ఈయాచారము మనయందుమాత్రమేకాదు. పూర్వపు టార్యజాతికంతటికిని సామాన్య మనుట కాధారము లున్నవి. జ్యూలియసు సీజ రీయాచారమును బేర్కొనెను. ఐర్లాండు గాథలలోను, గ్రీకుగాథలలోను నిది కలదు. క్రీ. వె. ౯౨౧, ౯౨౨-వ సంవత్సరములలో ఇబన్‌ఫాదులా యను అరబ్బీప్రవాసకుఁడు బల్గేరియాదేశమున నొక వీరపురుషుని చితిపై నాతనిసతి ఆహుతి యగుట చూచినట్లు వ్రాసెను.

(చచ్చినవారితో బ్రదికినవారు పోవుట)

ఇప్పటికిని ట్రాన్సువాలుదేశమున బెవెండా అను జాతివారిలో పెండ్లికానియొకపిల్లవాఁడు చచ్చినచో వానితో పరలోకమున నివసించుట కొకపిల్లను పంపుదురు. ఇంతవఱకు భార్య భర్తతోఁ బోవుట కలదుగాని భార్యతో భర్త పరలోకమున కేఁగునాచారము కానవచ్చుట లేదు. కారణము విశదమే. పురుషుఁడే బలవంతుఁడు గద. అయినను ఒక్క చిన్న సందర్భమున మాత్ర మీయాచారము గానవచ్చుచున్నది.

ఆసాంటిదేశమున రాజునుత్తరువుమీఁద నాతనిసోదరీమణులు దర్జాభేదముల నుల్లంఘించి ఎంతటిహీను నైనను రూపవంతుని పెండ్లియాడవచ్చును. కాని అట్టిహీనజన్ముఁడు తనభార్య గతించినవెంటనే ఆత్మహత్య చేసికొనవలెనఁట! తప్పదఁట!

పైవిధమున మానవులు తమప్రాణములను గతించినవారికై యర్పించుటలో మొదటమొదట నైనను అనురాగ మనుకారణ మొకటి కలదు. కాని ప్రప్రథమమున ననాగరకసంఘములవారిలో చచ్చినవానితో నాతనియాస్తి యంతయు పశువులు, ఆయుధములు మున్నగున వెల్లయు కడతేర్పఁబడుచుండినట్లు సూచన లున్నవి. చనిపోయినవానివస్తు వేది యున్నను ఇతరులకు హాని కలుగు నను భయ మిట్టివిధానమునకుఁ గారణ మయి యుండనోవు. ఇంతేకాక, మరణానంతరజీవితమున ప్రాణికి మరల నీలోకమందలి సౌకర్యములన్నియు లభింపవలయునను విశ్వాసముగూడ నిందు కొక కారణము. మొదటమొదట నిట్లు చనిపోయినవారి యాస్తినంతను వారివెంటఁ బంపుట యొక యాచారమై యుండినను ఇప్పు డది చాలవఱకు మాఱిపోయినది. పైయాచారము ననుసరించువా రిప్పుడు ఆయావస్తువుల లాంఛనములను తయారుచేసి శవముతోఁగూడ కాల్చివేయుటయో, పూడ్చుటయో జరగుచున్నది. ఇట్టి లాంఛనపదార్థములను తయారుచేయుట నేఁడు చీనాలో నొకపరిశ్రమ యయినది.

మఱియు రానురాను, ద్రవ్యము పోవుచేసికొన నిష్టము లేక కొంత సొత్తుమాత్రము చచ్చినవానితోఁ బోనిచ్చుట యాచారమై, కొన్ని కొన్ని యెడల నిందులకు విచిత్రకారణములు కల్పింపఁబడినట్లు తోఁచుచున్నది. మణిపురములోని టాంగుఖులు లనువారు చచ్చినవానితో నొకదున్నపోతును బంపుదురు. అది అతనితో వైకుంఠమునకుఁ బోయి మూయఁబడియుండు వైకుంఠద్వారమును దనకొమ్ములతో తెఱచునని వారి విశ్వాసము. మఱికొన్ని దేశములలో నిట్టిపనిని చేయునది శునకము. పోలండు దేశీయులలో కొందఱు కుక్కలను యజమానులతోఁ బూడ్చుచుందురు. శునకము యుధిష్ఠిరుని పురోగామియై స్వర్గమునకు వెంబడించుట యిట్టిసందర్భముల శునకపుఁ బ్రాముఖ్యమును బలపఱచుచున్నది. ఒకకాలమున భారతీయులలో మరణించిన వారితోఁగూడ గోవును చంపు నాచార ముండెడిది. ఈ యావునకు అనుస్తరణి యని పేరు. దీని తోలుతో నాపాదమస్తకము, శవమును గప్పవలయు నని యీ సందర్భమునఁ జెప్పఁబడినది.

(చిత్రములు)

# అంత్యేష్టి

ఫ్రాన్సుదేశమున కొన్నిమండలములలోఁ జదువఁగలవాఁడు మృతినొందిన నాతనితో గ్రంథములను బూడ్తురఁట. అన్నిటికంటెను హృదయమును కరఁగించునాచారము బిడ్డలతో నాటవస్తువులను పాతి పెట్టుట. ఇది ఐరోపాలో సర్వత్ర చూడనగును.

రానురాను లోకమున దహనమే యెక్కువ ప్రాముఖ్యము నందుచున్నది. ఇందుకుఁ గారణములు లేకపోలేదు. సమాధి సాధారణాచార మయి పరఁగిన పాశ్చాత్త్య దేశములలో జనసంఖ్య యపరిమిత మయినందున సమాధి చేయుటకు సరియైనస్థలములు లేకపోవుచున్నవి. అదియుఁగాక సమాధియందు కళేబరము శిథిల మగుసమయమున ననేకదుర్వాయువులు వ్యాపించుచున్నవి. అందును చనిపోవువాఁడు సాంక్రామికవ్యాధులకు లోనై యుండినయెడల ఆప్రాంతముల నట్టివ్యాధులు వ్యాపించుట కడు సులభము. ఈకారణములను బట్టి పాశ్చాత్త్యదేశముల నిప్పుడు దహనము క్రమక్రమముగ నాచారము కాఁజొచ్చినది. అచ్చట నైనను ఇది క్రొత్తయాచార మని చెప్పుటకు వీలులేదు. ప్రాచీనకాలమునందు ఈజిప్టు, జూడియా, చీనా దేశములయందుమాత్రమే భిన్నాచారములు కానవచ్చుచున్నవి. ఈజిప్టులో కళేబరములను ద్రావకములనైచి నిలవ యుంచెడివారు, జూడియాలోను చీనాలోను సమాధి చేయువారు. ఈదేశములందుఁ దక్కఁ దక్కినదేశములం దెల్లను దహనము సాధారణాచారముగ నుండెడిది. గ్రీసుదేశమున ఆత్మహత్య చేసికొనినవారును, పండ్లు రాని పసిపిల్లలును, పిడుగుదెబ్బచేఁ బడినవారును మాత్రమే దహనమునకు ననర్హులుగ నెన్నఁబడుచుండిరి. రోమకసామ్రాజ్యమున క్రీ. వె. నాలుగవ శతాబ్దివఱకును చితి పేర్చి దహనము చేయుటయే యాచారముగ నుండెను. కాని క్రైస్తవమతము ననుసరించి దేహమునకుఁ బునరుజ్జీవనము కలదు. అందుచే క్రైస్తవమతవ్యాపనముతో దహనము చేయు నాచార మంతరించి సమాధి చేయునాచారము ప్రవృద్ధిలోనికి వచ్చెను. మొదటియాచారము మొదలంట నదృశ్య మయ్యెను. మరల నిటీవల మిక్కిలి కష్టముమీఁద పైనిజెప్పినకారణములనుబట్టి దహన మాచారమగుచున్నది. పాశ్చాత్త్యులలో నీయాచారమును బునరుజ్జీవింపఁ జేయుట కయి కొందఱు శాస్త్రజ్ఞులు పలుపాట్లు పడవలసినవా రైరి. ౧౭౯౭-వ సంవత్సరముననుండియు నైరోపాఖండమునందు దహనక్రియానుకూల్యమునుగుఱించి చర్చలు జరగుచు నేవచ్చుచున్నను, ౧౮౭౪-వ సంవత్సరముననుండియు నింగ్లాండునందు దహనప్రోత్సాహసంఘ మొకటి యేర్పడి యున్నను, ౧౯౦౦ సంవత్సరాంతమునకు నింగ్లాండులో దహనక్రియాచారము నవలంబించుట ౧౮౨౪ గురి విషయమునమాత్రమే తటస్థించెను. ౧౮౮౩-వ సంవత్సరమున వేల్సు మండలములో నొకఁడు బిడ్డను దహించినందుల కయి న్యాయస్థానమున విచారణకుఁ దేఁబడెను. కాని న్యాయాధికారి దహనక్రియ న్యాయవిరుద్ధము కా దని తీర్పు చెప్పెను. అయినను దానివలన పరిసరజనులకు నేవగింపు పుట్టకుండఁ జూచుకొనుట యావశ్యక మని నియమించెను. జనసమ్మర్దము గలపాశ్చాత్త్య దేశములయందు మనదేశమునందువలె విస్తారముగ శ్మశానవాటికలు దొరకుట దుర్ఘటము కావున గళేబరదహనక్రియ శాస్త్రరీతి నభ్యసింపఁబడి ఏతదర్థము చక్కని యంత్రము లేర్పఱుపఁబడినవి. క్రైస్తవమతస్థానంబు లగుదేశంబులం దెల్ల దహనప్రోత్సాహసంఘములు నెలకొల్పఁబడినవి. ఈయాచారము దినదినప్రవర్ధమానముగఁ బెరుఁగుచున్నది.

ఇంతదనుక కళేబరమును దుదఁదేర్చువఱకును గలకర్మములను గుఱించి వ్రాయఁబడినది. తరువాత నొనర్పఁబడుకర్మము లితరదేశముల యందు విశేషముగఁ గానవచ్చుట లేదు. పూర్వ

**కర్మలు**

కాలమున యాహూదు లాదిగాఁగలవారిలోను మరణానంతరము కొన్నిదినములు కొన్నికర్మములు జరగుట గలదు. మనదేశమున హిందువులలో పదునొకండుదినములు కర్మము జరగియేతీరవలసియున్నది. చనిపోయినవానికుమారుఁడుకాని, కుమారుఁడు లేనియెడల కర్మములు చేయ నర్హుఁ డగు నితరుఁడు గాని కర్మారంభదినమున నమంత్రకముగ కూపమునందో, తటాకమునందో, ఆరామమునందో, తీర్థమునందో, ఆలయమునందో స్నానము చేసి దక్షిణాభిముఖుఁడై యొకవృక్షమూలమునఁ గూర్చుండి అట నొక వేదికను సిద్ధపఱుపవలెను. దానిని గోమయముతో నలికి దానిమీఁద పర్ణములను పఱవవలెను. దర్భలతో నొకద్విజాకారమును నిర్మించి యట స్థాపించి దానిని పాద్యాదులచే నర్చించి అతనిస్మరణ చేయుచు నమస్కరింపవలెను. పిదప ఆద్విజాకారమున కెదుట దర్భలు పఱచి వానిపై నామగోత్రోపకల్పిత మయినపిండమును చేసి సమర్పింపవలెను. ఉశీరము, చందనము, ధూపము, దీపము, నైవేద్యము, దక్షిణ మున్నగు సర్వోపచారములును చేయవలెను. అన్నము, వస్త్రము, ద్రవ్యము మొదలగునవి చనిపోయినవాని పేరిట దానము చేయుట శ్రేయస్కరము. ఇట్లు ఎనిమిదిదినములు నడచినమీఁదట తొమ్మిదవ నాఁడు బంధువర్గముతో తైలస్నానము చేసి దూర్వలను, లాజలను కొని మృత్యువు జరగిన యింటికి వెళ్లి యట వానిని చల్లి రావలయును. పదియవనాఁడు మాంసపిండము — కలియుగము గాన — మాషపిండము సమర్పింపవలె నని విధింపఁబడియున్నది. నామగోత్రోచ్చారణ మాత్రముచే నడచునది పదియవనాఁటికర్మ. పదునొకండవనాఁటు సమంత్రకముగ కర్మ, దానములు మున్నగున వెల్లయు జరగవలెను. నాఁడు ముఖ్యకర్మ వృషోత్సర్గము. దీనిని యజ్ఞ మని మనపురాణములు వాడినవి. ఇదియును, గయలో పిండప్రదానమును చేయనివాఁడు పుత్త్రుఁడు గాఁడు. ఒకగోవును, వృషభమును దెచ్చి వానికి యథావిధిగ కల్యాణ మొనర్చి పంపుటయే ఈయజ్ఞపుసారాంశము. ఈయజ్ఞమువఱకును జరగు శ్రాద్ధ మంతియు మలినషోడశము. పండ్రెండవనాఁడు సపిండశ్రాద్ధము. నాఁడే శయ్యాదానము మున్నగుదానములు. మధ్య షోడశ మొకటి కలదు. ఈపిండములను పదునాఱింటిని స్వీకరించువారు వరుసగ విష్ణువు, శివుఁడు, యముఁడు, సోముఁడు, హవ్యవహుఁడు, కవ్యవహుఁడు, కాలుఁడు, రుద్రుఁడు, పురుషుఁడు, ప్రేతము, విష్ణువు, శివుఁడు, యముఁడు, పురుషుఁడు. ఉత్తమషోడశ మొకటి ఇంకను చెప్ప

సి యున్నది. పండ్రెండుమాసముల పండ్రెండును, ప్రథమపక్షాంతమున నొకటియు, తృతీయపక్షాంతమున నొకటియు, ఆఱుమాసములు నిండుటకు ముందును, సంవత్సరము నిండుటకు ముందును రెండును చేరి ఈ పదునా ఱగుచున్నవి. తరువాత నాబ్దికము అనఁగా ప్రతిసంవత్సరమును బెట్టుతద్దినము.

గతించినవారిస్మరణార్థము సంవత్సరమున కొక నాఁడు నిర్ణయించి యుంచి పెద్దలసద్గుణాదికముల జ్ఞాపకమునకుఁ దెచ్చికొని వారిని గౌరవించుట శ్రేయస్కరమే కాని పైయాచారముల కన్నిటికిని కారణమిదిగఁ గాన్పింపదు. ఈ వ్యాసమున మొదట చెప్పినట్లు ప్రేతకాయములు గల వనియు, ఆత్మకు దేహమునకుం బోలినసర్వావస్థలును గల వనియు, ఆత్మను హింసించుటకును సుఖపెట్టుటకును వేఱువేఱు లోకములు గల వనియు మొదలుగాఁగల నమ్మకములే యిట్టియాచారములకుఁ గారణము లని తోఁచుచున్నది. (గా. హ.)

**అంత్రవృద్ధి** — దీనిని సామాన్యముగబుడ్డ (Hernia) యని చెప్పుదురు. బుడ్డలలో ననేకభేదములు గలవు. సాధారణముగ వాడుకలో బుడ్డయని, అండవాతమని, వరిబీజమని, అండవృద్ధియని పలుపేరు లుపయోగింతురు. ప్రేగులోని కొంతభాగ మేదయిన నొక రంధ్రముగుండా దిగజాఱుట కంత్రవృద్ధి యని పేరు. అంత్ర మనఁగా ప్రేగు. వృద్ధి యనఁగా పెంపు. అంత్రమునకు ఆంత్ర మనియు వాడుక కలదు.

ప్రేగులు మెలికలు మెలికలుగా తిరిగి చుట్టలు చుట్టుకొనుచు, వీఁపువైపుననుండి ముందటికి వ్రేలాడుచు నొకలుంగగ పడియుండును. ఇది మొత్తముమీఁద నిరువదియాఱడుగుల గొట్టము. ఇందు మొదటియిరువదియడుగులకంటె చివరభాగమందలి యాఱడుగులు లావుగ నుండును. మొదటిభాగమును చిన్నప్రేగనియు, చివరభాగమును పెద్దప్రేగనియుఁ జెప్పవచ్చును. ఈ ప్రేగులచుట్టలు ఉల్లిపొరవంటి యొకపలుచనిపొరచే నేర్పడిన యొకపెద్దసంచియం దమర్పఁబడియుండును. ఈసంచిపైని గర్భకుహరము ( Abdomen ) యొక్కచుట్టుగోడయగు కండలు మొదలగునవి గప్పియుండును. ఈచుట్టుగోడలో నెక్కడ నైనను తగినంత బలము లేనిచోట రంధ్ర మేర్పడి యారంధ్రమునకు లోపలితట్టున వదులువదులుగ వ్రేలాడుచుండు ప్రేగులలో నేభాగ మైనను బైటికి జాఱియుండవచ్చునుకదా!

ఇట్లీరంధ్రముననుండి యైనను, ప్రేగులయం దేభాగ మైనను దూఱి బయటఁబడుటకే యంత్రవృద్ధి యని చెప్పుదురు.

మనకడుపు నావరించి యుండుగోడలో రంధ్రము వడుటకుఁ దగినచోట్లు మూఁడు గలవు.

౧. బొడ్డునొద్ద నేభాగమునం దైనను, పొట్టగోడ సరిగా పూఁడక అక్కడ నేదైన రంధ్ర మేర్పడి దానిగుండా ప్రేగులు ముందునకు త్రోసికొని రావచ్చును.

౨. రెండుప్రక్కల నుండువృషణములనుండి యింద్రియమును గొనిపోవుగొట్టములు రెండు కడుపుగోడయం దిరుప్రక్కల గజ్జలలో నుండురంధ్రముగుండా గర్భకుహరములోనికిం బ్రవేశించును. స్త్రీలలో గర్భకోశమును నిరుప్రక్కలనుండి కడుపులో వ్రేలాడఁగట్టు రెండు త్రాళ్లు కడుపులోనుండి బయటికి గజ్జలలో నుండు రెండు రంధ్రముల గుండా వచ్చి యక్కడ నుండు నెముకకు నే ప్రక్క దాప్రక్కను కట్టఁబడి యుండును. మగవారిలో నింద్రియపుగొట్టములను లోపలికి పోనిచ్చు రంధ్రములును, ఆఁడువారిలో పైనఁ జెప్పినత్రాళ్లను బయటికి పోనిచ్చురంధ్రములును, ఒకానొకప్పు డవసర మైనంతకంటె పెద్దవిగ నున్నయెడల వానిగుండా త్రోసికొని ప్రేగులో నేభాగ మైనను దిగజాఱవచ్చును.

3. కడుపులోనుండి తొడలోనికి నెత్తుటికాలువలు మొదలైనవి వచ్చుచు పోవుచుండుచోట నేదయిన నొకరంధ్రము కావలసినంతకంటె పెద్దదిగ నున్నయెడల ఆరంధ్రముగుండా ఏవైపుతొడలోని కైనను ప్రేగు దిగజాఱవచ్చును.

పైన వ్రాసినదానినిబట్టి అంత్రవృద్ధి సామాన్యముగ మూఁడు చోట్లఁ గలుగవచ్చు నని తెలియుచున్నది. బరువులు మోయునప్పుడు మిక్కిలి తినుకుటచేఁగాని, యెత్తు ప్రదేశముననుండి దుమికినప్పుడు గాని, అధిక మైనమలబద్ధముచే తినికినప్పుడు గాని, యెడతెగనిదగ్గు యొక్క యుద్రేకముచేఁ గాని యీ ప్రేగు దిగజాఱవచ్చును. చంటిబిడ్డలలో సహజముగ కడుపుగోడయేభాగమునం దైనను సరిగా పూఁడక దాననుండి పుట్టుకతోడనే ప్రేగు దిగజాఱియుండవచ్చును. సామాన్యముగ బరు వయినపనులు చేయువార లగుటచేతను, ఇంద్రియపుగొట్టముపోవురంధ్రము గర్భపుతిత్తిని వ్రేలాడఁగట్టు త్రాటిని పోనిచ్చురంధ్రముకంటె పెద్ద దగుటచేతను ఆఁడువారలలోకంటె మగవారిలో అంత్రవృద్ధి హెచ్చుగఁ గలుగుచుండును.

మొదట అనఁగా అంత్రవృద్ధి కలిగినవెంటనే యది సామాన్యముగఁ జిన్నదిగ నుండి పోనుపోను పెద్దది యగును. ఇది యుసిరికకాయయంత మొదలు కొబ్బరిబొండమంత ప్రమాణము గలిగి యుండవచ్చును. దీనియందు మూఁడుభాగములు గల వని చెప్పవచ్చును.

౧. సంచిపైకప్పు; ౨. సంచి; 3. సంచిలోనిపదార్థము.

౧. సంచిపైకప్పు:— ఇందు అంత్రవృద్ధి యెక్కడ కలుగునో అక్కడ నుండుకడుపుగోడయే సంచి పైకప్పని చెప్పవచ్చును. తొడలోనికి దిగు అంత్రవృద్ధియందు తొడపై నుండుకండలు, చర్మము మొదలగునవి ప్రేగుననుండి కలిగెడియొత్తుడుచే సాగి పలుచనై యట్టకట్టుకొని పైకప్పుగ నేర్పడును. ఒకొక్కప్పు డీకప్పు దళసరెక్కి పెరిఁగియుండవచ్చును.

౨. సంచి:— ప్రేగుల నావరించి యుల్లిపొరవంటిపొర యొకటి యుండు నని చెప్పితిమి. ఆపొరయే యంత్రవృద్ధిగ సంచిలో నేర్పడు భాగము. ఈసంచి రంధ్రముననుండి ప్రేగులు వెలువడుభాగ

మున సన్నముగను, క్రిందుభాగమున విశాలముగను నుండును. ఈసన్నని భాగమునకు మెడ యని పేరు. ఈ మెడదగ్గఱ సామాన్యముగ నీసంచి దళసరెక్కి తఱచు వాఁచుచున్నయెడల చుట్టుప్రక్కల నుండు భాగమున కంటుకొనిపోవచ్చును.

3. సంచిలోనిపదార్థము:—సంచిలో సామాన్యముగ ప్రేగునందేభాగ మైన నుండవచ్చును గాని మిక్కిలి వదులుగ వ్రేలాడునది యగుటచేత చిన్నప్రేగు తఱచుగ నండవృద్ధిలోఁ గానవచ్చుచుండును. ఒకానొకప్పుడు తెరవలె ప్రేగులపైఁబడి వ్రేలాడుచుండెడు పొరయొకటి దానియందుండు క్రొవ్వుతోఁ గూడి యంత్రవృద్ధిలోని సంచిలోనికి దిగవచ్చును. చిన్నపిల్లలయందు అండాశయము (Avary) ఒకానొకప్పు డంత్రవృద్ధిలోఁ గానవచ్చును.

## అంత్రవృద్ధి మూఁడువిధములు

౧. ముడుచుకొనునది, ౨. ముడుచుకొననిది, 3. ఉరిపడినది. ముడుచుకొనునంత్రవృద్ధిలోనిపదార్థములు రోగి పరుండినప్పుడు గాని, మనము ఒత్తినప్పుడు గాని కడుపులోనికి పోయి పయికి కనఁబడు ఉబ్బు కృశించిపోవును. ఇది కొందఱియందు సుకరముగ ముడుచుకొనును. మఱికొందఱియెడల కఠినముమీఁదఁగాని ముడుచుకొనదు. ముడుచుకొననియంత్రవృద్ధియందు సంచిలోనిపదార్థములు సంచికిని, ఆసంచిచుట్టుగోడకును అంటుకొనిపోవుటచేఁ గాని, సంచిలోని ప్రేగులు మిక్కిలి క్రిక్కిఱిసి నిండుగ నుండుటచేతఁ గాని యంత్రవృద్ధి యెన్నఁడును ముడుచుకొనదు: అనఁగా కడుపులోపలికిఁ బోదు. ఉరిపడిన యంత్రవృద్ధియందలి సంచియొక్క మెడ అక్కడ నుండు ప్రేగులచుట్టును గట్టిగ పట్టి నొక్కివేసి యురిపోసిన ట్లయి రక్తప్రవాహము నాఁపివేయును. ఒక వ్రేలికి మొదటిభాగమున దారముతో బిగించి కట్టినపుడు చివరభాగమునందలి రక్తప్రసారము తగ్గి ఆభాగము కంది యుబ్బి చల్లఁబడి తుదకు నల్లనై యెట్లు కమలిపోవునో యట్లే యురిపోసికొనిన యంత్రవృద్ధిలోనిసంచియందలి పదార్థము లుబ్బి కమలిపోవును. ఈయురి మిక్కిలి బిగిసిపోయినయెడల గంటగంటకు బాధ యధికమై తుదకు ప్రేగులలో నుండు సూక్ష్మజీవుల యుద్రేకముచే ప్రేగులు కుళ్లి నశించిపోవచ్చును. ప్రేగులచుట్టును బిగించియున్న యురిత్రాళ్లెంత తీవ్రముగ నొక్కుచున్న నంత త్వరలో నుపద్రవము గలుగును.

ఇది మెత్తగ దూదిబంతివలె నుండును. ఇది రోగి పరుండియున్నపుడు తగ్గుచు, నిలిచియున్నపుడు హెచ్చుచునుండును. తగ్గినప్పుడు సంచి మెడయొద్ద వ్రేలు పెట్టినచో ప్రేగులనుండి యదురు తెలియును. చేతితో నదిమి యంత్రవృద్ధిని లోపలికిఁ ద్రోయునపుడు బొళబొళ మని ధ్వని యగును. ఇట్టియంత్రవృద్ధి కడుపులోనుండి

ముడుచుకొను అంత్రవృద్ధి

పైన చెప్పినయేభాగమునందైనను కలుగవచ్చును. కాని సామాన్యముగ నిది గజ్జలలోఁ బుట్టి పురుషులయందు వృషణములలోనికిని, స్త్రీలయందు యోనియొక్క చెంపలోనికిని దిగును. ఒకానొకప్పుడు తొడపైభాగమునఁ బుట్టి తొడలోనికి దిగుట గలదు కాని సామాన్యము7 నిది కడుపుయొక్క అడుగుభాగమున నుబ్బుగ నేర్పడును.

### చికిత్స

చికిత్స రెండువిధములు. (౧) తత్కాలపుచికిత్స (౨) ఖాయపుచికిత్స. సంచిలోని ప్రేగులను కడుపులోనికి గెంటివేసి రంధ్రము దక్కఁగ మూసికొనిపోవునట్లు ఇందుకొఱకై ప్రత్యేకముగ నమర్పఁబడిన బిళ్లగల పటకా (ట్రస్సు - Truss) లను వేసి మూసి యుంపవచ్చును. ఇందుచే ప్రేగు దిగజాఱక రోగి కేమియును కష్టము లేకపోవచ్చును. రోగి పసివాఁడయినకాలఁదిని శాశ్వతముగ ప్రేగులు బైటికి రాకుండ రంధ్రము పూఁడిపోవుట కవకాశము హెచ్చుగ నుండును. ఇట్లు శాశ్వతముగులాభమును పొందఁదలచినవారు ప్రేగు నొకసారి కడుపులోనికిఁ ద్రోసి రంధ్రమును మూసినతర్వాత నెన్నఁడు నొకసారి యైనను మరల దిగకుండ భద్రముగఁ జూచుకొనవలయును. రెండు మూఁడు మాసములవఱకును దిగకయుండి రంధ్రము కొంతవఱకు పూఁడినపిమ్మట నొకనాఁడు దగ్గుచేఁగాని, పడుకలో నిటునటు దొర్లునపుడు 'యాదాలోపము'గఁ గాని ప్రేగు బైటఁ బడినయెడల నదివఱకు పడినశ్రమ యంతయు వ్యర్థ మయిపోవును. ఒకానొకప్పుడు రంధ్రము మిక్కిలి పెద్దదిగ నుండుటచే లోపలికిఁ ద్రోసిన ప్రేగును పటకాలలో నేదియుఁ గూడ క్రిందికి రాకుండఁ జేయఁజాలము. ఇట్టిరోగులకు శస్త్రచికిత్స చేత తప్ప ప్రయోజన ముండదు.

అంత్రవృద్ధి యెన్నఁడును మరల రాకుండఁ జేయుపద్ధతికి ఖాయపుచికిత్స యని పేరు. శస్త్రముచేసి యంత్రవృద్ధియొక్క పైకప్పునందు చర్మము కోసి సంచిలోని ప్రేగులు మొదలగువానిని లోపలికి త్రోసి సంచిని మూతి బిగించి కట్టి మూతిక్రిందుభాగము నంతయు కోసి యెత్తివేయవలయును. పిమ్మట రంధ్రముయొక్క యిరుప్రక్క గోడలను దగ్గఱకుఁ జేర్చి యిటనుండి యటు, అటనుండి యిటు గట్టి దారములతో రంధ్రము మూసికొనిపోవునట్లు కుట్టివేయవలయును.

పిమ్మట పైకప్పునందలికండలను చర్మమును దగ్గఱకుఁ జేర్చి యథాప్రకారముగ నుండునట్లు దారముతోఁ గుట్టవలెను. ఈచికిత్స యందు గమనింపవలసినవిషయములు మూఁడు: (౧) సంచిలోని ప్రేగులను లోపలికిఁ ద్రోయుట, (౨) సంచిని కోసి యెత్తివేయుట, (3) రంధ్రమును గట్టిత్రాళ్లతోఁ గుట్టివేయుట. ఇవి గాక యొకానొకప్పుడు ప్రేగులతోఁగూడ వానిపైని తెరవలె నుండునొకపొరయు, కొంత క్రొవ్వును రంధ్రముగుండా సంచిలోనికి దిగి యున్నయెడల దానినిగూడ కోసి యెత్తివేయవలసివచ్చును. ఈప్రకారము చికిత్స చేయించుకొనువా రెంతమాత్రము ప్రాణభయ మున్న దని జడియ నక్కఱ లేదు. సామాన్యముగ అంత్రవృద్ధి గలవా రందఱును పటకాలతో తంటాలు పడుచుండుటకంటె ఒక్కటేసారి తమబాధల నివారణ చేసికొనుట మంచిది. పటకా (ట్రస్సు) వలన అప్పటికప్పుడు

చ్ఛాంతి యగుచున్నను, పెండ్లి పేరంటములలోను, ఆటపాటలలోను ఎలానవానికి ఫలానవ్యాధి కల దని యందఱును చెప్పుకొనుచుండఁగా చిన్నవోవుటకంటె చిన్నతనముననే పిల్లలకు శస్త్రము చేయించుట మేలు.

పటకా తీసికొనువార లెల్లప్పుడును తమకుఁ దగినపటకా మాచి తీసికొనవలెను. ఎంతమాత్ర మది పాడయిపోయినను వెంటనే యేదో యుపద్రవము రాఁబోవుచున్న దని గ్రహించి దానిని తగిన వైద్యునకు చూపవలయును; లేకున్న కాలము వృథాపుచ్చుటచే ఒకానొకప్పుడు మృత్యువుపాలఁ బడవలసివచ్చును.

*ముడుచుకొనని అంత్రవృద్ధి*

అంత్రవృద్ధిలోని ప్రేగులు మిక్కిలి పెద్ద వగుటచేతఁ గాని, వాఁపుచేతఁగాని, ఇరుప్రక్కల నుండుగోడలకును సంచికిని అతుకుకొనిపోవుటచేతఁగాని ఒకానొకప్పు డంత్రవృద్ధిలోని ప్రేగులను కడుపులోనికిఁ ద్రోయుటకు వీ లుండదు. ఇట్టిస్థితి యెట్టిదైన నపాయకరమే! ఇది బరువుచేత నంతకంతకు పెద్ద దగుచుండును. ఎల్లప్పుడును క్రిందికి వ్రేలాడుచుండుటచే నేదైన దెబ్బ తగులవచ్చును. నిరంతరము క్రిందికి దిగలాగుచుండు భారమే కాక దీనివలన మలబద్ధమును, ప్రేగులలో నొప్పియు, అజీర్ణమును గలుగుచుండును. ఒకానొకప్పు డంత్రవృద్ధిలోని ప్రేగులలో నుండుమలము బైటికి పోక యటకాయించుకొని ప్రేగులు కుళ్లుటకు ప్రారంభించును. ఇట్టిసమయములందు మిక్కిలి భద్రముగ నుండి వెంటనే శస్త్రమునకు ప్రయత్నము చేయవలెను. ముడుచుకొనని యంత్రవృద్ధికిఁ గూడ తాత్కాలికోపయోగార్థము కొన్నిపటకాలు గలవు. అంత్రవృద్ధి కెంతపరిమాణము గలదో అదే పరిమాణముగల సంచి యొక్కటి యీపటకాతో నంటియుండును. ఈసంచిలో అంత్రవృద్ధిని పొదుపుగ నమర్చి యెల్లప్పుడును తీసివేయకుండఁ బెట్టుకొని యుండవలయును. ఎంతజాగ్రత్తగ నున్నను నిట్టివారల కెప్పుడును ఉపద్రవము తప్పదు. కాఁబట్టి వేఱుకారణములచే నాటంకములు లేనియెడల సాధ్యమైనంతత్వరలో శస్త్రము చేయించుకొనుట మంచిది. వైద్యునియొద్దకుఁ బోవుట కెంతయాలస్య మైన దీనికి శస్త్రము చేసి కుదుర్చుట అంతకఠిన మగును.

*ఉరిపోసికొనిన అంత్రవృద్ధి*

ప్రేగు గాని, దానిపై నుండుక్రొవ్వు గాని అంత్రవృద్ధియొక్క తొడయొద్ద నుండురంధ్రములో బిరడావలె గట్టిగ బిగించుకొనిపోయి నెత్తుటిప్రవాహ మాఁగిపోవును. అంత్రవృద్ధి యుండుచోట నొప్పి, ఓకిలింత (వాంతి వచ్చునట్లుండుట, వికారముగ నుండుట) పసరు వాంతి యగుట, యొకానొకప్పుడు అశుద్ధపువాసనతో వాంతి యగుట, బొత్తిగ విరేచనము కాకపోవుట, ప్రేగులలో నమలివేయున ట్లుండుట, నొప్పి, మంట, బొడ్డునొద్ద నొప్పి యివి సామాన్యముగా నురిపోసికొనిన యంత్రవృద్ధికి చిహ్నములు. నాడి నీరసముగను, అతివేగముగను నుండును. ముఖ మధికబాధను సూచించును. కడుపు భేరివలె ఇడమడలాడుచుండును. కడుపునకును, అంత్రవృద్ధిలోని ప్రేగులకును మధ్య నుండురంధ్రము ముడుచుకొనిపోయి యుండుటచే దగ్గినపుడు రంధ్రము క్రింద మనచేతి కదురు తగులకపోవచ్చును. ముసలివారల కేచిహ్నములు లేకయే వ్యాధి తెలియకుండఁ బ్రబలిపోవచ్చును. సమయములోఁ గనిపట్టి అడ్డు తీయకపోయినయెడల ౮ గంటలు మొదలు ౮ దినములలోఁగా ఉరిపడినభాగము కమలి నలుపెక్కి గాలితో నిండి పెళపెళలాడుచు, సంచిమెడయొద్ద నుండుభాగము చచ్చి ప్రేగులు చితికి వానిలోని కల్మషము కడుపులోఁ బడి, రోగికి ఎక్కిళ్లు పుట్టి, శరీరము చల్లఁబడి ప్రేగులలోని కల్మషపు సంబంధమైనవిషము నెత్తుటిలోని కెక్కి, స్పృహ చెడి మరణము సంభవించును.

ఉరి పోసికొనిన అంత్రవృద్ధికి చికిత్స చేయుటలో "ఆలస్యా దమృతం విష" మ్మగును. వైద్యుఁడు జాగ్రత్తగ ప్రేగులను కడుపులోనికి గెంటినప్పు డవి లోపలికి పోనియెడల తత్క్షణము శస్త్రము చేసి యేభాగమున నురి బిగిసి యున్నదో అక్కడిబిగువును కోసి వదలించి ప్రేగులను లోపలికి మెల్లఁగఁ ద్రోసి రంధ్రమును బూడ్చి కుట్టి వేయవలయును.

**అంత్రిగాం** — గంజాంజిల్లా ఛత్రపూరు తాలూకాకుఁ జెందిన గ్రామము. జనసంఖ్య ౪౯౬.

**అందలాపల్లి** — విశాఖపట్టణముజిల్లా సర్వసిద్ధితాలూకాలోని యొక గ్రామము. ఇచటిజనసంఖ్య ౧,౬౮౧.

**అందుకూరు** — గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా గ్రామములలో నొకటి. ఇందలిజనసంఖ్య సుమారు ౧,౦౫౩.

**అందుగులపాడు** — గుంటూరుజిల్లా వినుకొండ తాలూకాకుఁ జెందినగ్రామము. ఇక్కడిజనసంఖ్య కేవలము ౯౩౭.

**అంద్రహాలు** — ఇది బళ్లారిజిల్లా బళ్లారితాలూకా యందలి యొక గ్రామము. ఇక్కడిజనసంఖ్య ౨౯౨.

**అంధకుఁడు** — ౧. అంధకాసురుఁడు. శివపార్వతులు విహరించుచుండఁగా పార్వతి నెత్తుకొనిపోవ నీయసురుఁడు యత్నించెను. అంత వీనికిని, శివునకును అవంతీదేశమునందు మహాకాలవనమున ఘోర మైనయుద్ధము జరగెను. వీనిశరీరమునుండి క్రింద రాలునట్టి యొక్కొక్కరక్తబిందువునుండి యొక్కొక్క యంధకుఁడు పుట్టఁజొచ్చెను. అంత శివుఁడు వీనిరక్తబిందువులను పైవానిని బైననె మ్రింగుటకు మాతృగణములఁ బుట్టించె. విష్ణువు శుష్కరేవతి యనుగణములఁ బుట్టించి యీరక్తమును నిశ్శేషము చేయించెను. వీఁడు శివునకు నోడి, యాదేవుని విశేషముగా స్తుతింపఁగా నాతఁడు ప్రసన్నుండయి వీనిని తనగణములలో నొక్కనిగాఁ దీసికొనియెను (మత్స్య. అ. ౨౧౭) వీనికొడుకు ఆడి యను నసురుఁడు.

౨. మహిషాసురుని సైన్యమందు ప్రముఖుఁడైన యొక యసురుఁడు (చూడు: మహిషాసురుఁడు.).

3. (చం. వం.) యదువంశజుఁడు. సాత్వతుని యేడ్గురుపుత్త్రులలో నాలవవాఁడు. ఇతనికి కుకుర, భజమత్, శుచి, కంబలబర్హిషు లనునల్గురు పుత్త్రులు. యాదవ వంశమునందు ఈయంధకవంశము మిక్కిలి ప్రసిద్ధము.

౪. (చం. వం.) పైన వర్ణింపఁబడిన యంధకునివంశమునందు జన్మించినవాఁడు అనురాజుపుత్త్రుఁడు. వీనికి దుందుభినామక పుత్త్రుఁడు గలఁడు.

**అంధతామిస్రము** — ఒక నరకము. పరస్త్రీగమనము గాని, పరపురుషగమనము గాని చేసినవారిచ్చట శిక్షింపఁబడుదురు.

**అంధనదము** — భారతవర్షీయనదము.

**అంధవరము** — గంజాంజిల్లా శ్రీకాకుళముతాలూకా యందలి ఒకగ్రామము. ఇచటిజనసంఖ్య ౧,౨౫౪.

**అంధుఁడు** — ౧. బృహస్పతి యన్నయైన ఉతథ్యునకు మమతయందుఁ బుట్టినపుత్త్రుఁడు. ఇతనికి దీర్ఘతముఁ డనునామాంతరము కలదు.

౨. సరయూనదియొడ్డున తపస్సు చేసికొనుచున్న వైశ్యకులజుఁడైన యొకఋషి. ఇతనిభార్య శూద్రస్త్రీ. వీరిద్దఱికి నొకపుత్త్రుఁడు పుట్టెను. ఈ ఋషి గ్రుడ్డివాఁడైనందున నితనికిఁ బుత్త్రుఁడే యాధారముగ నుండెను. దశరథమహారాజొకనాఁడు వేటకుఁ బోయి యీతనిపుత్త్రుఁడు కుండతో నీళ్లు ముంచుకొనుచుండ నాధ్వనినిబట్టి గజ మని భ్రమపడి యాఋషిపుత్త్రునిం జంపెను. అంత నీయంధుఁడు పుత్త్రశోకమున దశరథరాజునకు 'నీవుగూడ పుత్త్రశోకముచేఁ జచ్చెద' వని శాప మిచ్చి తా నగ్నికాష్ఠముల భక్షించి విగతజీవుఁ డయ్యెను.

**అంధులు** — ౧. బేరారు ప్రాంతమున, మధ్యపరగణాల యందలి యావత్ మాల్, బుల్డానాజిల్లాలయందు నివసించుచుండిన యొకకర్షకజాతివారు. ౧౯౧౧-వ సంవత్సరపుజనాభా ననుసరించి వీరి సంఖ్య ౫౨,౦౦౦ లు. వీరు తెలుంగాణెము నందలి యాదిమనివాసులగు నంధ్రుల యవశేషులని కొందఱు, గోండులలోని యొక తెగవారని కొందఱు నభిప్రాయపడుచున్నారు. వర్తాటిఅంధులని (సంకరము లేనివారు), ఖల్తాటిఅంధులని (సంకరులు) వీరిలో రెండుతెగలుకలవు. ఈరెండుతెగలవారికి పరస్పరము భోజనప్రతిభోజనము లుండునుకాని సంబంధబాంధవ్యము లుండవు. అంధులలో నంతశ్శాఖ లనేకములు కలవు. వీనిలోఁ జాలశాఖలకు మహారాష్ట్రనామములే కలవు. స్వశాఖీయవివాహములు నిషిద్ధములు. వివాహము 'కుణబీజాతి' వారి పద్ధతి ననుసరించి యుండును. వీరిలో నిటీవలఁ గొంతకాలము నుండియే బాల్యవివాహములు జరగుచున్నవి. పిల్లపుట్టకపూర్వమే ప్రధానము గావించుటకూడ నంవందు కలదు. వీరిలో మేనఱికములు కలవు కాని యెదురుమేనఱికములు నిషిద్ధములు. అక్టోబరు, డిసెంబరు మాసములలో ప్రధానములు జరగును. వివాహములు మూఁడు నాలుగు మాసముల పిదప జనవరి, ఏప్రిల్ మాసములనడుమ జరగును. వధువు రజస్వల యైనచో వివాహమైనవెంటనే వరునితోఁగూడఁ బంపివేయఁబడును. వీరిలో బహుభార్యలను గట్టుకొనుట దూష్యము కాదు. భాగ్యవంతుఁడే పెక్కుమందిభార్యలను కట్టుకొనుటకుఁ జాలినవాఁ డగుటచే బహుభార్యాస్వీకారము ధనాఢ్యతకు లక్షణమై, యట్టివాఁడు సంఘమున నధికముగ గౌరవింపఁబడును. వితంతువివాహ, వివాహవిచ్ఛేదకాచారములు వీరిలో ధారాళముగఁ గలవు. వితంతువు తనబావగారినికాని, మఱఁదినిగాని, స్వశాఖీయునిగాని వివాహ మాడరాదు. వివాహమునకుఁ బూర్వమే వధువు గర్భవతి యైనచో ఆగర్భము ఎక్కువజాతిపురుషునిసంయోగమువలనఁ గలిగినచో నామెకు కొంత దండుగ విధించి వితంతువివాహపద్ధతిని బరిణయము కావింతురు; కాని యామె సాధారణముగ జరగు పెండ్లిండ్లయందువలె పసుపుపారాణులు పూయఁగూడదు. వీరిలో అంవందు కడజాతివారగు మహార్లతోను, మాంగులతోను వ్యభిచరించినస్త్రీలను శుద్ధిచేసి మరల కులమునఁ గలుపుకొనినట్లు నిదర్శనములు కలవు. వ్యభిచారదోషము ఋజువైనస్త్రీలకు వారిస్థితిగతులనుబట్టి 'కులపెద్ద' 'కులతప్పు' విధించును. ఈవిధముగ వచ్చిన సొమ్ముతో కులమువా రందఱు కలసి విందుచేసికొందురు. వీరిలో 'పంచాయితీ' వంటి 'కులకట్టుపా' టొకటి కలదు. వీరిలోని 'కులపెద్ద' కు 'మొహ్తారియా' యని పేరు. 'కులనేరము' లను విచారించుటలో నీతనికి 'ఘోపతియా', 'డుక్రియా' యనుపేర్లఁబరఁగు సహాయు లిరువు రుందురు. నేరము విచారణకు వచ్చినప్పుడు డుక్రియాదోషిని పిలిచి 'హాజరు' పెట్టును. విందుకై యుపయోగపడిన కుండల నితఁడు తీసికొనును. 'ఘోపతియా' కు క్రొత్తబట్ట నచ్చును. ఇట్టిసాంఘికదోషములను విచారణచేయుటకై 'మొహ్తారియా' గ్రామములవెంటఁ బర్యటనముచేయును. దోషిపై విధింపఁగా వచ్చిన 'కులతప్పు' దండుగలో నితనికిఁ గొంత పాలు కలదు. సంఘగౌరవమున వీరు కుణబీలతరువాతివారు. వీ రిప్పుడు కొంచె మించుమించుగ కుణబీజాతివారి యాచారముల నన్నిటిని అవలంబించుచున్నారు. దానంజేసి రూపువైఖరినిబట్టియు, నుడుపులను ధరించుపద్ధతిని బట్టియు ఎవరు కుణబీలో, ఎవరు అంధులో నిర్ణయించి చెప్పుట కష్టము. వారివలెనే వీరును వ్యావసాయికులు. వీరును శుభాశుభకర్మముల కన్నిటికిని బ్రాహ్మణులను బెట్టుకొందురు. మతము వైష్ణవము: నామములను బెట్టెదరు. వీరు ఎలుకలు, పాములు, పిల్లులు, కోళ్లు మొదలగు క్షుద్రజంతువులమాంసమును తిందురుకాని, ఆవు, కోఁతి మొదలగు కొన్ని జంతువులమాంసమును ముట్టరు. వీరిలో నించుక నాగరకులైనవా రిపుడిపుడు క్షుద్రజంతుమాంసభక్షణమును వదలిపెట్టుచున్నారు. సాధారణముగ వీరికి అడవిపందిమాంస మన్నను

గారాపాన మన్నను మిక్కిలి యిష్టము. వీరిలోఁ జనిపోయినవారిని శిరము దక్షిణపుతట్టుగ నుంచి పరుండఁబెట్టి పూడ్చి పెట్టెదరు. ఆచార లక్షణములనుబట్టి చూచినచో అంధు లాదిమనివాసులుగఁ గాన్పించెదరు. కాని యత్యంతశీఘ్రముగ వీరు హిందువులలోఁ గలసిపోవుచున్నారు. మధ్యరాష్ట్రములందలి యాదిమనివాసు లందఱికంటెను వీరే అధికముగ హిందూత్వము నొందినవారు. వీరు మహారాష్ట్ర నామములను ధరింతురు.

౨. నిజాంరాష్ట్రమునందలి పర్వతప్రదేశము లగు పర్భని, నాందేడుజిల్లాల యుత్తరప్రాంతములంగును, ఆదిలాబాదుజిల్లాయందలి పశ్చిమప్రాంతమునందును గానవచ్చు కర్షకజాతివారు. వీరును, యవత్ మాల్, బుల్దానాజిల్లాలయందలివారు నొక్క జాతివారే; కాని కొలఁదివిషయములలో నుభయులకును స్వల్పవ్యత్యాసము కలదు. వారిలోవలెనే వీరిలోఁగూడ రెండుతెగలు కలవు కాని 'అంధు' (సంకరము లేనివారు) లని, 'పదుఅంధు' (సంకరులు) లని వానికి పేరులు. ఈరెండుతెగలవారికి భోజనప్రతిభోజనములు కలవుకాని సంబంధబాంధవ్యములు లేవు. వీరిలో అతిబాల్యవివాహములు, రజస్వలానంతరవివాహములుకూడఁ గలవు. వీరి కొక కులసభ కలదు. ఈసభవారి యనుమతితో వివాహమును విచ్ఛేదము గావించుకొనవచ్చును. వీరిలో వివాహితులు మగణించిన దహనము గావించెదరు; అవివాహితులను పూడ్చిపెట్టుదురు. చనిపోయినవారు పెద్దలైనచో పదిదినములవఱకును, చిన్నలైనచో మూఁడుదినములవఱకును వీరు ఆశౌచము పాటింతురు. ఆదినములలో ప్రప్ప, రొట్టె తక్క మిగిలిన భోజనపదార్థములను పరిహరింతురు. మిగిలినయన్నివిషయములలో వీరును, బేహారుప్రాంతపుఅంధులును ఒక్కటే. వ్యవసాయమునందును, వేఁటయందును వీరు చాల గట్టివారు. వీరిలోఁ గొందఱు గ్రామములకు పటేళ్లుగఁగూడ నున్నారు. వీరిలోఁ జాలమంది కూలినాలి చేసికొని జీవించువారేకాని భూస్వాములు చాల నరుదు. ఆదిలాబాదుజిల్లాలో వీ రెక్కువగ నున్నారు.

**అంధేరి** — థానాజిల్లాలో (బొంబాయిరాజధాని) బరోడారైలుమార్గమున నొకస్టేషను. దీని కించుమించుగ నాలుగు మైళ్ల దూరమున నీశాన్యదిశను మహాకాలగుహ లనఁబడు బౌద్ధశిల్ప రమణీయములయిన కొండగుహ లున్నవి. ఇవి ౨-వ, ౬-వ శతాబ్దులనడుమ నిర్మింపఁబడినవై యుండవచ్చును.

**అంధ్రుఁడు** — (చం. వం) యయాతిపుత్త్రుఁడైన అనురాజుయొక్కవంశమునందుఁ బుట్టినబలిరాజుయొక్క యార్గురుపుత్త్రులలోఁ జిన్నవాఁడు.

**అంపాపురం** — కృష్ణజిల్లా, గన్నవరంతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౧, ౨౮౯.

**అంపాలెము** — గంజాముజిల్లా, శ్రీకాకుళము తాలూకాయం దీపేరుగల గ్రామములు రెండు కలవు: ఒకదానిజనసంఖ్య ౬౪౦: మఱియొకదాని జనసంఖ్య ౧౬౪.

**అంపావిల్లి** — విశాఖపట్టణముజిల్లా బొబ్బిలితాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౧, ౧౯౪.

**అంపిలి** — విశాఖపట్టణముజిల్లా, పాలకొండతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౯౧.

**అంపురం** — గంజాముజిల్లా, పర్లాకిమిడితాలూకాయందలి జమీన్‌దారిగ్రామము. జనసంఖ్య ౧౫౬.

౨. గంజాముజిల్లా, సోంపేటతాలూకా జలంత్రసంస్థానమునందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౪౧౧.

**అంపోలు** — గంజాముజిల్లా, శ్రీకాకుళము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య 3, ౬౪౨.

**అంబ్** — వాయువ్యపుఁబొలిమేరపరగణాలోని తనావల్ అను స్వతంత్రసంస్థానములోని పల్లె. సింధునదియొక్క పశ్చిమతీరము మీఁద నున్నది. ఈస్థలమును బట్టియె యిచ్చటిప్రభువునకు అంబనవాబని పేరు వచ్చెను.

**అంబ** — ౧. పార్వతీదేవి కొకపేరు.

౨ సత్యలోకమందలి యొక యప్సరస.

3. భీష్మునిసమకాలికుఁడయిన కాశిరాజు ముగ్గురుకూఁతులలోఁ బెద్దది. అంబిక అంబాలిక లనువారు ఈమెచెల్లెండ్రు. కాశిరాజు తనపుత్త్రికలస్వయంవరమునకై రాజుల నందఱ నాహ్వానము చేయఁగా భీష్ముఁడు వెళ్లి రాజుల నందఱను గెల్చి యాముగ్గురుకన్యలను తనతమ్ముఁడైన విచిత్రవీర్యునకు వివాహముచేయు నిమిత్తము తీసికొనివచ్చెను. కాని యంబ తా నదివఱకే మనస్సుచే సాల్వరాజును వరించియుంటచే నాసమాచారమును భీష్మునితోడను, సత్యవతితోడను చెప్ప వా రామెను వదలివేసిరి. అంత నంబ సాల్వరాజునొద్దకుఁ బోయి తన్ను వివాహ మాడు మని కోరఁగా నామె భీష్మునిచే గెలువఁబడినందున, నామెను వివాహమాడ నిరాకరించెను. అంబ మరల భీష్మునియొద్దకు వచ్చి తన్ను వివాహము చేసికొను మని కోరఁగా నాతఁడును నిరాకరించెను. అంత నామె దుఃఖాక్రాంతయై తండ్రియొద్దకుఁ బోవుట కిష్టము లేక యరణ్యమునకుం బోయి శైఖావత్యుఁ డను ఋషియాశ్రమమునం దుండెను. అచ్చటి కొకనాఁ డామె మాతామహుఁడైన హోత్రవాహనుఁ డను రాజు మృగయార్థము వచ్చి యామెను చూచి యామెవృత్తాంతము నంతను తెలిసికొనెను. ఆతఁ డామెను వెంటఁదీసికొని పరశురామునియాశ్రమమునకుఁ బోయి భీష్ముఁ డామెను వరించునట్లు చేయవలసిన దని పరశు

బ్రాహ్మణునిం గోరెను. అంత నాఋషివర్యుఁడు తనశిష్యుఁ డయినభీష్మునితో నంబను వివాహ మాడు మని చెప్పెను; కాని 'జన్మమంతయు బ్రహ్మచారిగా నుండెద నని ప్రతిజ్ఞఁ జేసిన నేను వివాహ మాడుట యధర్మ' మనియు, 'మీరు చెప్పినను నే నధర్మమున కొడఁబడ' ననియు భీష్ముఁడు చెప్పినందున, భీష్మునకును పరశురామునకును ఘోర మైన యుద్ధము జరగెను. కాని, ఆయుద్ధమునందు పరశురాముఁడు భీష్ముని గెలువ లేకపోయినందున అంబ విఫలమనోరథ యయి భీష్మునిమరణమును గోరుచు రుద్రునిగూర్చి ఘోర మయిన తపస్సు చేసెను. ఈ సమాచారము గంగాదేవికిఁ దెలియ నామె తపస్సు నివారింపఁ దలఁచి అంబ యొద్దకు రాఁగా వా రిరువురకును వివాదము జరగి గంగాదేవి యంబను శపించెను. తరువాత రుద్రుఁడు ప్రత్యక్షము కాఁగా, అంబ భీష్ముని సంహరించుసామర్థ్యము తన కొసంగు మని కోరఁగా, 'నీ వీజన్మమున భీష్ముని సంహరింపలేవు; శిఖండి యను పేరను మఱియొకజన్మ మెత్తి పురుషాకారమును జెంది భీష్ముని సంహరింపఁగల' వని రుద్రుం డంతర్హితుం డయ్యె. అంతఁ గొంతకాలమున కంబ దేహమును విసర్జించి ద్రుపదరాజునింట శిఖండియయి పుట్టెను.

(భార. ఉద్యోగ. అ. ౧౭౩ – ౧౮౭).

అంబఖండి — విశాఖపట్టణముజిల్లా, పాలకొండ తాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౧,౮౭౪.

**అంబగ్రామము** — దీనినే మోమినాబాద్ అనియెదరు. హైదరాబాదుసంస్థానమునందలి బీర్ జిల్లాలోని అంబతాలూకాకు ముఖ్యస్థానము. జనసంఖ్య ౧౧,౬౫౮. హిందువులు ౮,౫౮౭. మహమ్మదీయులు ౩,౮౭౭. క్రైస్తవులు ౨౫ మంది. గ్రామమునకు మధ్యను జీవంతి యనునేఱు పాఱుచున్నందున గ్రామము రెండుభాగము లయినది. ఏటికి నైరృతిదిక్కున నున్న గ్రామమును మోమినాబా దనియెదరు. అచ్చట ౧౯౦౩-వ సంవత్సరమువఱకు కంటోన్‌మెంటు అనఁగా సైన్యనివాసస్థల ముండెను. ఇచ్చట పంచమజాతివారైనలింగాయతులు గలరు. వీ రొకప్పుడు జైనులుగా నుండి రనియు, ప్రభుత్వము చేసి రనియు, చాళుక్యులకు సామంతులుగ నుండి రనియు అనియెదరు. ఈగ్రామమందు కొన్ని బురుజులు కలవు. ఒకబురుజులో దేవగిరి యాదవరాజయిన సింఘునునిచేఁ గట్టింపఁబడిన పురాతనదేవాలయ మొకటి కలదు. అందు ౧౨౮౫-వ సంవత్సరపుశాసన మొకటి యున్నది. గ్రామమునకు సమీపమునందు గుట్టలలో చెక్కఁబడిన దేవాలయములు కలవు. అందు కొన్ని హిందువులవి. తక్కినవి జైనులవి. వానిలో జీవంతియేటియొడ్డున నున్న జాగాయ్ అను దేవియొక్క దేవాలయము ముఖ్య మైనది. కొండలో తొలుచఁబడినయీ దేవాలయము కడుచిత్రముగ నున్నది. నడుమ నొకమంటపమును, చుట్టు నొక్క యంగణమును, తొలుచఁబడియడుగులపొడుగును నలువదియైదడుగులవెడల్పును గల సభాభవనమును చక్కఁగఁ జెక్కఁబడియున్నవి. ఈపట్టణమునం దొకపోస్టు ఆఫీసును, మూఁడుపాఠశాలలును గలవు. ఇది చుట్టు నుండు గ్రామములకు మధ్య నుండు వర్తకస్థానము. ఇచ్చట దుయ్యంతాలూక్‌దా రనఁబడు డిప్యూటీకలెక్టరు అధికారముగల రివిన్యూ అధికారి యుండును.

అంబఘాటు — ఇది పడమరకనుమలలోని యొక లోయ. రాయగడమును ముట్టడించినతరువాత మొగలాయీలు గోవా నగరమువఱకుఁ బోయిరి. మధ్యమార్గమున యుద్ధము లేవియు జరగక పోయినను ఔరంగజేబుకుమారుఁడను మువజ్జముయొక్క సేనయం దనేకులు కాలరకు లైరి. అదే సమయమున మహారాష్ట్రసైన్య మేతెంచి ముసల్మానుల నాక్రమించి సముద్రమార్గమున వారల కందునట్టియాహార పదార్థములు వారికిఁ జేరకుండునట్లు అడ్డగించి కొల్లగొనిరి. మహమ్మదీయులకుఁ గొంతకాలము కొబ్బరికాయలును, మఱికొన్నిక్షుద్రధాన్యములును దప్పఁ దినుటకుఁ గావలసిన మంచియాహారపదార్థములు దొరకుటయుఁ గష్ట మయ్యెను. అట్టిసమయమున చక్రవర్తికుమారుఁడు పరుగిడి వచ్చి యీయంబాఘట్టమునందుఁ దల దాఁచుకొనెను. మరల ౧౭౦౦-౧౭౦౧-వ సంవత్సరములం దీలోయ మహారాష్ట్రులకుశరణముగ నుండె మొగలాయీలు దీనిని ముట్టడించి తమయధీనముఁ జేసికొనిరి. ఇందువలన మహారాష్ట్రుల కీ కనుమద్వారా నన్ను సామగ్రులకు రానాటంకము గలుగుటయ కాక మొగలాయీ సేనలయొక్క రాకపోకలకు మంచిమార్గ మేర్పడెను. ౧౭౮౯-వ సంవత్సరమున ఇంగ్లీషువారును, మహారాష్ట్రులును ఈకనుమదగ్గఱనే కలసికొని టిప్పుమీఁదికి దండెత్తిపోయిరి.

అంబఝురి — గంజాముజిల్లా, పర్లాకిమిడి తాలూకాయందలి జమీన్‌దారీగ్రామము. జనసంఖ్య ౨౦౭.

అంబటకంబరామ్ — గంజాముజిల్లా, సోంపేట తాలూకా బురదసింగజమీన్‌దారీయందలి గ్రామము. జనసంఖ్య ౧౨౭.

**అంబటసులు** — అఱవదేశమందలి మంగలివాండ్రు. తెలుఁగుదేశపుమంగలివాండ్రవలెనే వీండ్రుకూడ క్షౌరము, సన్నాయి, వ్రణవైద్యము అనుమూఁడు పనులు చేసెదరు. సేలముజిల్లాయందలి కొంగవెల్లాలు లనుజాతివారియిండ్లలో వివాహకార్యములు వచ్చినప్పుడు బ్రాహ్మణులకు బదులుగా అంబటనులే పౌరోహిత్యము చేసెదరు! వీరిలోఁ గొందఱు వైష్ణవులు; కొందఱు శైవులు. చెంగల్పట్టుజిల్లాయందలి అంబటసులలో కులవ్యవహారములను పరిష్కరించుటకు నలుగురు అధికారులు కలరు. వారిని 'పెరితనక్కారను' లనియెదరు. వీరిలో నొక్కఁడు చెన్నపట్టణమునందును, మిగిలినముగ్గురును పూనమల్లి, చెంగల్పట్టు, కరుంగు అనుస్థలములందు నుందురు. ఇవి నాలుగును మంగలివాండ్రపీఠము లని చెప్పవచ్చును. ఒక్కొక్కపీఠమునకు లోఁబడినకుటుంబములు ఆఱువందలు మొదలు వేయివఱకుండును. ఈపీఠములయధికారము వంశపరంపరగా వచ్చును. కులపుఁబంచాయితులన్నియు నితఁడు ఐదుగురు కులముపెద్దలసాహాయ్యమున తీర్చుచుం

. సంవత్సరమునకు ఒక్కొకకుటుంబమునొద్దనుండియు ౦-౨-౬లు ౘకము తీసికొనఁబడును. ఇట్లు వసూలైనపైకము పెట్టి సత్రములు పెట్టెదరు. ఇట్టిసత్ర మొక్కటి తిరుప్పోరూరులోను, ఒకటే తిరుకక్కలికుండ్రమనుచోటను ఉన్నవి. ఈసత్రములలో బ్రాహ్మణులకు భోజనము పెట్టెదరు. ఇతరులకు సామగ్రి యిచ్చెదరు! అంబటనులు శ్రీరంగమునందు నొకమంటపము కట్టించిరి.

మలయాళదేశమునందలి అంబటనులలో రెండంతశ్శాఖలు కలవు. వీనిలో వారసత్వపుహక్కు ఒకశాఖవారికి పురుషులనుండియు, వేఱొకశాఖవారికి స్త్రీలనుండియు సంక్రమించును. మొదటితరగతి వారు తాము రెండవతరగతివారికంటె గొప్పవారమని చెప్పుకొందురు. ఈరెండుశాఖలవారికి ఒకరితో నొకరికి సహపంక్తిభోజనముకాని, సంబంధబాంధవ్యములు కాని లేవు.

పురుషులనుండి వారసత్వపుహక్కు సంక్రమించు తమిళ, మలయాళ అంబటనులలో బాలికలకు రజస్వల యగుటకు పూర్వమునను, పరమునను గూడ వివాహములు చేయుదురు. వివాహవిధానము ఇతర తమిళశూద్రులతెగలలో జరగినట్లే జరుగును. పురుషుఁడు పెక్కుస్త్రీలను పెండ్లియాడవచ్చును. వితంతువివాహముకూడ వీరిలోఁ గలదు.

వీరిలో స్త్రీలు మంత్రసానితనము చేయుదురు. కొందఱకు వైద్యమును దెలియును. వీరిలోఁ గొందఱు గాయకులును గలరు.

**అంబటిపూడి** — గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా యందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౪౩౧

**అంబటివలస** — విశాఖపట్టణముజిల్లా, విజయనగరముతాలూకాయందలి జమీన్దారీగ్రామము. జనసంఖ్య ౫౪౭.

**అంబతాలూకా** —ఇది హైదరాబాదుసంస్థానమందలి బీరుజిల్లాయందాగ్నేయదిక్కుననున్న యొకతాలూకా. దీనివైశాల్యము ౧౩౪౨ చదరపుమైళ్లు. జాగీరులతోఁ గలసి జనసంఖ్య ౧,౩౯,౩౯౯. కఱవులవలన జనసంఖ్య పూర్వముకంటె చాల తగ్గినది. ఇందులో కైజ్ అనుతాలూకా ౧౯౦౫లోఁ గలుపఁబడినది. ఈకలుపఁబడిన తాలూకావైశాల్యము ౪౭౫ చదరపు మైళ్లు. జనసంఖ్య ౫౦,౫౪౩. ఈతాలూకాలో అంబా, పార్లీ యని రెండు పెద్దగ్రామములును ౨౬౯ పల్లెలును గలవు. ఇందు జాగీరుగ్రామములు ౫౧. డొలు రు. ౩౮,౦౧౦. దీనికి దక్షిణమున మంజీర యనునది గలదు. ఉత్తరమున పర్వతములు గలవు.

**అంబద** — విశాఖపట్టణముజిల్లా, పాలకొండతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౫౧౧.

**అంబదేవుఁడు** — ఓరుఁగంటి కాకతీయప్రభువులకాలమున నిజాంరాష్ట్రమునందలి నల్గొండజిల్లా పానుగల్లు మొదలు మైసూరురాజ్యమునందలి (కోలారుజిల్లా చింతామణితాలూకా) మార్జవాడివఱకు వ్యాపించియుండిన దేశమునేలిన కాయస్థవంశజులలో నొకఁడు. కాకతిరుద్రమదేవి (క్రీ. శ. ౧౨౬౦-౧౨౯౫) రాజ్యారంభకాలమున సామంతమాండలికప్రభువులలో నొకఁడుగ నుండిన త్రిపురాంతకదేవమహారాజునకు సోదరుఁడు. త్రిపురాంతకదేవుని కడపటిశాసనముయొక్కయు,అంబదేవునిమొదటిశాసనముయొక్కయు కాలము (క్రీ. శ. ౧౨౭౨) ఒక్కటే యగుటచేత నితఁడు తనయన్నయైన త్రిపురాంతకదేవుని యనంతరము రాజ్యమునకు వచ్చినట్లు కన్పట్టుచున్నది. ఇతనిశాసనములు క్రీ. శ. ౧౨౭౨ మొదలు క్రీ. శ. ౧౩౦౪ వఱకును గనవచ్చుచున్నవి. కొన్నిశాసనములలో నితఁడు గండికోటమనోరథపురమునుండి రాజ్యమేలుచుండినట్లు చెప్పఁబడినను ఇతరశాసనాధారమునుబట్టియు, స్థానికచరిత్రములనుబట్టియు కడపజిల్లా, కడపతాలూకాయందలి వల్లూరుపట్టణమే యితనికి రాజధానిగ నుండినట్లు తెలియవచ్చుచున్నది. గండికోట, ములికినాడు, రేనాడు, పెనాదాడి (? పెన్నవాడి), పెడకల్లు, సకలి, ఏఱువ, పొత్తపినాడు మొదలుగునవి యితనిరాజ్యమునందలి విషయములు. ఈనాఁటి కాకతీయసామంతులలో నితఁడు చాలగొప్పవాఁడు. ఈతఁడు శ్రీపతిగణపతిదేవుని, ఏఱువ మల్లిదేవుని, కేశవదేవుని, సోమిదేవుని, అల్లుగంగని, దేవబ్రాహ్మణశత్రువగు మల్లికార్జునుని, దామోదరుని, కాడవరాయని గెలిచినట్లు తనశాసనములందుఁ జెప్పుకొనియుండెను. వీరిలోఁ గొందఱు అంబదేవుని క్రీ. శ. ౧౨౭౨ నాఁటి మొదటిశాసనముననే పేర్కొనఁబడియుండుటవలన తనయన్నతోపాటు అతనిపరిపాలన కాలముననే, అనఁగా నితఁడు రాజ్యమునకు రాకపూర్వమే వారిని జయించియైన నుండవచ్చును; ఇట్లుకాక, అంబదేవుని పూర్వోక్త విజయసూచకములైన బిరుదములు కొన్ని ఈకాయస్థవంశజులయందలి మొదటివాఁడును, కాకతిగణపతిదేవుని సామంతులలో శ్రేష్ఠుఁడునైన గంగయసాహిణినాఁటనుండి ఈవంశమువారికి పరంపరగ వచ్చుచున్నవిగ నైన నుండవచ్చును: ఏలయన దామోదరు నొకనిని కాకతిగణపతికి సామంతుఁడుగ నుండిన గంగయసాహిణి జయించినట్లు ఆతని క్రీ. శ. ౧౨౫౦ నాఁటి యొకశాసనమునఁ గలదు (Ep. coll. No. 283 - 1905). అంబదేవుఁడు జయించినట్లు చెప్పఁబడినవారలలో ఏఱువ మల్లిదేవుఁడు ప్రాయికముగ ఏఱువ మనుమసిద్దిదేవుఁడు కాఁదగును. ఈతనిశాసనము క్రీ. శ. ౧౨౬౪ నాఁటి దొకటి కలదు. ఇతఁడు ఏఱువదేశమును పాలించిన చోడవంశజులలో నొకఁడు. రుద్రమదేవి రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో నితఁడు విక్రమించి త్రిపురాంతకప్రాంతమున రాజవిద్రోహము రేపి స్వతంత్రుఁ డగుటకు ప్రయత్నించియుండవచ్చును. పైన ప్రస్తావింపఁబడిన యీతనిశాసనము త్రిపురాంతకమునందలిదే. మిగిలిన మల్లికార్జునుని గుఱించికాని, కాడవరాయ శ్రీపతిగణపతులనుగుఱించికాని, సోమిదేవకేశవదేవ అల్లుగంగులనుగుఱించికాని మన కేమియుఁ దెలియరాదు. అంబదేవుఁడు రాజ్యభ్రష్టుఁడయిన మనుమగండగోపాలుని విక్రమ

సింహపురంబున సింహాసన మెక్కించెను. విక్రమసింహపురము (నెల్లూరు) రాజధానిగఁ బరిపాలనము నెఱపిన గండగోపాల నామాంకితులు పెక్కురు కలరు. వీ రెల్లరును తెలుఁగుచోడులే. వీరిలో అంబదేవుఁడు సింహాసన మెక్కించిన మనుమగండగోపాలుఁ డెవ్వఁడో మనకు సరిగాఁ దెలియదు.

తనపూర్వులవలెనే అంబదేవుఁడును అతివిషమహయారూఢ రేవంత, మాండలిక బ్రహ్మరాక్షస, గండపెండార మొదలుగాఁగల బిరుదములను ధరించెను. శ్రీపతి గణపతిని జయించి రాయసహస్రమల్ల బిరుదమును దాల్చెను. పానుగల్లు మొదలు మార్జవాడివఱకుఁగల దేశమును బాలించిన కాయస్థసామంతు లెల్లరిలో నీతఁడు కడుబలవంతుఁడు: పేరొందినవాఁడు.

ఈతని మొట్టమొదటిశాసనమునందేకాక యితరశాసనములందుఁ గూడ కాకతీయప్రభువు లెవ్వరును పేర్కొనఁబడియుండకపోవుట చేత మొదటనుండియు కాకతీయాధికారమును ధిక్కరించి యితఁడు స్వతంత్రుఁడుగనే పరిపాలించిన ట్లూహింపఁదగియున్నది. కాకతీయులకు నాఁడు విరోధులుగ నుండిన దేవగిరియాదవులతోను, మధుర పాండ్యులతోను ఇతఁడు చెలిమి పాటించెను. ఇదియు తొల్లిటియూహకు బలకరమే: మహాదేవరాజును (క్రీ. శ. ౧౨౬౦ - ౧౨౭౧), అతని యన్నకుమారుఁడగు రామచంద్రదేవుడు (క్రీ. శ. ౧౨౭౧ - ౧౩౦౯) ఇతనికి సమకాలికులుగ నుండిన యాదవప్రభువులు. జటావర్మసుందర పాండ్యుఁడును, మారవర్మకులశేఖరుఁడును ఇతనిపాండ్యసమకాలికులు. వీరిలో సుందరపాండ్యునిశాసనములు కడపజిల్లాయందుఁగూడఁ గనఁబడుచున్నవి. యాదవ, పాండ్యులకును, కాకతీయులకును కొన్ని సంగ్రామములు జరగియుండవలె నని నాఁటిచరిత్రనుబట్టి తెలియ వచ్చును. ఇట్టివానిలో అంబదేవుఁడు యాదవ, పాండ్యుల పక్షము నవలంబించియుండు ననుట నిశ్చయము.

ఘోడేరాయ గంగిదేవయ్య అంబదేవునిప్రధానిగ నుండెను. అంబదేవుఁడును, ఇతనిప్రధానియు పెక్కుశివాలయములకు దానములు చేసి, కాలువలును, చెఱువులును త్రవ్వించి, మాహేశ్వరుల కన్నసత్రములు పెట్టించి ధర్మకార్యము లనేకము చేసిరి. కొలతకు గడ నిర్ణయముచేసి భూములను గొలిపించిరి.

కాకతిప్రతాపరుద్రుఁడు (క్రీ. శ. ౧౨౯౫ - ౧౩౨౬) ఓరుఁగంటి రత్నసింహాసన మెక్కిన కొలఁదికాలమునకే అంబదేవునిపై దాడివెడలివచ్చి, యాతనినిజయించి, యాతనిరాజ్య మాక్రమించుకొనెను. అంబదేవునిశాసనములు క్రీ. శ. ౧౩౦౨ వఱకుఁ గానవచ్చుచుండుటచేతను, ఈప్రాంతమునే పరిపాలించిన కాకతిప్రతాపరుద్రదేవుని యితరసామంతులశాసనములు క్రీ. శ. ౧౩౦౯ నుండి కనఁబడుచుండుటచేతను ప్రతాపరుద్రదేవుఁ డీయంబదేవుని క్రీ. శ. ౧౩౦౨, ౧౩౦౯ సంవత్సరముల నడుమ జయించియుండును.

**అంబపువా** — గంజాంజిల్లా, కొడలతాలూకా గడజమీన్దారీయందలి గ్రామము. జనసంఖ్య ౨౬౪.

**అంబమంత్రి** — 'శివధర్మములు' అను గ్రంథముఁ రచించిన పైడిగంటం సారణమంత్రివంశమునకుఁ జెందినవాఁడు. అంబమంత్రి ప్రౌఢదేవరాయలయాస్థానమున నుండెడువాఁడు. అతని కవితకు మెచ్చి రాయలు పైడిగంటము బహుమానముగ నొసంగెను. నాఁటనుండియు నంబమంత్రివంశమువారికి పైడిగంటమువా రను నింటిపేరు కలిగెను.

**అంబర్** — రాజపుత్రస్థానమందలి జయపురసంస్థానము యొక్క పూర్వపురాజధాని. ఇది జయపురమురెయిల్వేస్టేషనున కీశాన్యమున ఐదుమైళ్లమీఁద నున్నది. ఇప్పు డిది జీర్ణావస్థయం దున్నది. జనసంఖ్య ౪,౯౫౬. ఈపట్టణమునకుఁ జుట్టును గుట్ట లుండుటచేతను, సమీపమునందున్న మావట యనుతటాకములో నీపట్టణము ప్రతిఫలించుటచేతను దీనికి నైసర్గికశోభ కలిగినది. ఈ పట్టణమున కీ పేరు అంబికేశ్వరుఁ డనుదేవునివలన వచ్చె నని కొందఱును, సూర్యవంశపురాజయిన అంబరీషునివలన వచ్చె నని మఱికొందఱును చెప్పెదరు. ఇచ్చట దొరకిన మిక్కిలిపురాతనశాసనము క్రీ. శ. ౯౫౪-వ సంవత్సరమునాఁటిది. పండ్రెండవశతాబ్దిమధ్యమున సుసావత్ మినాస్ వంశపు రాజునొద్దనుండి కచ్ఛవాహరాజపుత్రు లీ పట్టణముం గొని యాఱుశతాబ్దులవఱ కీపట్టణమును రాజధానిగ నేలిరి (ఈరాజులచరిత్ర మంతయు జయపూర్ శబ్దముక్రిందఁ జూడదగును). ఈ పట్టణమున చూడఁదగినస్థలములు పెక్కులు గలవు. పురాతనరాజమందిరము మిక్కిలి చక్కనిది. గ్వాలియరుమందిరములతరువాత నిదియే రాజపుత్రశిల్పకౌశలమునకుఁ దగిన తార్కాణము. ఈమందిరము రాజా మానసింగుచే ౧౬౦౦-వ సంవత్సరమునఁ బ్రారంభింపఁబడి మిర్జా రాజా యను నామాంతరముగల మొదటిజయసింగుచే కొంతవఱకుఁ గట్టింపఁబడి రెండవ సవాయిజయసింగుచే బూర్తిచేయఁబడెను. రెండవ జయసింగు చక్కనిరాజప్రాసాదమును గట్టించెను. ఆతఁడే ౧౭౨౮ లో రాజధానిని జయపురమునకు మార్చెను. ౨౦౦ అడుగులయెత్తుమీఁద నున్న జయగఢ మను దుర్గము రాజమందిరమును సంరక్షించును. శ్రీ జగత్ సర్వమాన్ దేవాలయమును, అంబికేశ్వరదేవాలయమును మిక్కిలి చక్కని చెక్కడపుఁబనితో నిర్మింపఁబడెను. శిలాదేవిదేవాలయ మొకటి కలదు. అచ్చట ప్రతిదినమును ఒక మేఁకను బలి యిచ్చుచుందురు. పూర్వము నరబలి యిచ్చుచుండి రని చెప్పెదరు. ఇచట ఒక ప్రాథమికబాలపాఠశాలయు, బాలికాపాఠశాలయుఁ గలవు.

**అంబర్‌నాథ్** — బొంబాయిరాజధానియందలి ఠాణా జిల్లాలోనియొకపట్టణము. నామాంతరము అమరనాథ్ (చూడు: అమరనాథ్).

**అంబర్హ్** — హైదరాబాదుస్వదేశసంస్థానమునందలి రంగాబాదుజిల్లాయందు దాగ్నేయమునకు తాలూకా. దీనివైశాల్యము ౩౨ చదరపుమైళ్లు. జాగీరులతోఁ గలసి జనసంఖ్య ౧,౧౬,౧౮౮. అవులనలన ఇచ్చటిజనసంఖ్య పూర్వముకంటెఁ దగ్గినది. ఇందు మొత్తము ౨౪౨ పల్లెలు గలవు. అందు ౨౪ జాగీరుపల్లెలు. తాలూకా ముఖ్యస్థల మైన అంబర్హ్ జనసంఖ్య ౩,౫౬౩. రూ॥ ౪,౨౦,౦౦౦. దక్షిణమండలిభూమి రేగడిది. గోదావరినది యీగ్రామమునకు దక్షిణమునుండి ప్రవహించును. ౧౯౦౫లో నీజిల్లాలోనియెనిమిదిపల్లెలు పరభిణిజిల్లాలోని పాథ్రితాలూకాలోఁ గలుపఁబడెను. పాథ్రి తాలూకాలోని ౬ పల్లె లిందు కలుపఁబడెను.

**అంబరనాథ్** — ఒకకాయస్థబ్రాహ్మణుఁడు. కవి. చైతన్యమతస్థుఁడు. ఇతఁడు రచించినగ్రంథములలో ప్రసిద్ధిం జెందినది అర్జునగర్వపరిహారము. అంబరనాథుఁడు బ్రదికియుండియే సమాధిం గైకొనెను.

**అంబరపేఁట** — పశ్చిమగోదావరిజిల్లా, ఏలూరుతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౧,౭౪౩.

**అంబరమహారాజపురము** — చిత్తూరుజిల్లా చిత్తూరుతాలూకాయందలి జమీందారీగ్రామము. జనసంఖ్య ౨౩౨.

**అంబరీషుఁడు** — ౧ ఒకమహర్షి (చూడు 'అంగిరసుఁడు').

౨. (సూ. వం.) వైవస్వతమనువుయొక్క తొమ్మిదవకుమారుఁడగునభగునికి మనుమఁడు, నాభాగునకుఁ బుత్రుఁడు. ఇతఁడు భూమి నంతను ఏడుదినములలో జయించెను (భార. శాంతి. అ ౧౨౪). ఇతఁడు దానశూరుఁడు. ఇతనికి విరూపుఁడు, కేతుమంతుఁడు, శంభుఁడు అనుముగ్గురుపుత్రులు కలరు (భార. ద్రోణ. అ ౬౫). ఇతఁడు విష్ణుభక్తుఁడు. ఒకప్పుడు ద్వాదశినాఁడు దుర్వాసఋషి యీతనియింటి కతిథియై వచ్చి భోజనమునకై ప్రార్థింపఁబడియెను. దుర్వాసుఁడు యమునయందు స్నానమాచరింపఁబోయి, ద్వాదశిఘటికలు మిగిలిపోవచ్చినను మరలిరాఁడయ్యె. అంత నంబరీషుఁడు ద్వాదశిఘటికలలోనే పారణ సల్పవలయు నన్నవ్రతము గలవాఁ డగుటచే, నచ్చటి బ్రాహ్మణులయనుమతి వడసి తులసితీర్థముఁ ద్రావెను. దుర్వాసుఁడు మరలి వచ్చి, రాజు పారణచేసె నని తెలిసికొని కోపగించి, తనజటలోనుండి యొకకృత్యను పుట్టించి, రాజుపై విడిచెను. కాని విష్ణునిచేఁ బ్రేరేపింపఁబడిన సుదర్శనచక్ర మడ్డుపడి ఆకృత్యను సంహరించి దుర్వాసుని వెంటఁ బడిలెను. అతఁడు మూఁడులోకములు తిరిగితిరిగి వేసారి, విష్ణువునొద్దకుఁ బోయి, యాతనిచే అంబరీషునొద్దకుఁ బంపఁబడియె. ఇట్లొక్క సంవత్సరమువఱకును ఈతఁడు తిరుగుచుండ నంబరీషుఁడు భోజనము చేయక యీతనికొఱ కెదురుచూచుచుండెను. అతఁ డీతనిరాకకు సంతసించి, సుదర్శనచక్రమును బహువిధంబులఁ బ్రార్థించి, శాంతింపఁజేసి, దుర్వాసునితోఁ గూడి భోజనము చేసెను (భాగ. నవమ. అ ౪-౬).

౩. (సూ. వం.) ఇక్ష్వాకువంశజుఁడైనమాంధాతకు బిందుమతి యనుభార్యయందుఁ బుట్టిన ముగ్గురుపుత్రులలో రెండవవాఁడు. ఇతనికి ధర్మసేనుఁ డనునామాంతరము కలదు. పుత్రుఁడు యౌవనాశ్వుఁడు.

౪. (సూ. వం.) ఇక్ష్వాకువంశజుఁడైన త్రిశంకురాజునిద్దఱుపుత్రులలో రెండవవాఁడు. కూఁతురు శ్రీమతి. ఈమె విష్ణునిభార్య.

౫. (సూ. వం.) ఇక్ష్వాకువంశజుఁడైనభగీరథునిపౌత్రుఁడు. నాభాగునిపుత్రుఁడు. కుమారుఁడు సింధుద్వీపుఁడు.

**అంబరు** — ౧. ఈపేరుతో బజారులలో అమ్మెడువస్తువులు రెం డున్నవి. బర్మాదేశమునందును, ఐరోపాయందలి బాల్టికుసముద్రతీరమునందును గనులనుండి త్రవ్వి హిందూదేశమునకు రవానా యగు అంబరు ఒకటి. దీనిని నూనెతో నుడుకఁబెట్టినప్పుడు నిర్మలమైన కండిగింజవంటివర్ణము కలిగి తళుకుగలిగి యుండును. దీననుండి ఐరోపాదేశమున పూసలు, పొగచుట్టగొట్టములు, తలలో అలంకారముగా పెట్టుకొనునూడులు మొదలగునవి చేయుదురు. ఈదేశమున కొందఱు స్వదేశవైద్యులు దీనిని క్రింద వివరింపఁబోవు రెండవజాతి యంబరని తలఁచి ఔషధములలో నుపయోగపఱుతురు. దీనివెల మిక్కిలి స్వల్పము. తులము అంబరు ఒకదమ్మిడికంటె హెచ్చుగ నుండదు. జేగురుమంటివలె నుండును.

౨. నిజమైన అంబరు. ఇది హిందూదేశముయొక్కయు, ఆఫ్రికా బ్రెజీలుదేశములయొక్కయు సముద్రతీరములందు నీటిలో కొట్టుకొనివచ్చుచుండును. ఇది తిమింగిలముప్రేగులలో నేర్పడు రాతిసంబంధమైనపదార్థము. దీనికొఱకు తిమింగిలము (Sperm-whale) లను వేటాడి చంపుదురు. ఈవస్తువును కూడ మనదేశపుబజారులలో అంబరు అని చెప్పుదురు. దీనికి సరియైన ఇంగ్లీషుపేరు 'ఆంబెగ్రిసు' (Ambegris). ఇది మిక్కిలి తేలికగలదయియొకవిధమైన సువాసన గలిగి యుండుపదార్థము. కాల్చిన కాలిపోవును. వెచ్చఁబెట్టినయెడల ఆవిరిగా నెగిరిపోవును. ఈగుణము లెవ్వియును పైన చెప్పిన అంబరునకు లేవు. అది బరువుగను, ఎఱ్ఱగను ఉండుపదార్థము. ఎట్టిసువాసనయు లేనిది. రెండవ అంబరు సామాన్యముగా హిందూదేశమునకు నికోబారుదీవులనుండి దిగుమతి యగును. దీనిని వైద్యులౌషధములలో వేయుదురు. ప్రస్తుతపు వర్తకసరళిని బట్టి చూడఁగా నిప్పు డంతగా దీనివిలువ హెచ్చుగా లేకుండినను పూర్వము మొగలాయీప్రభువుల దినములలో దీనిని మిక్కిలి యధిక

ముగ నుపయోగపఱిచెడివారు. సింహాసనమునకు సువాసన యిచ్చుటకు వానిమీఁద అంబరుపొడిని చల్లెడివారఁట. రమారమి రెండువేల సంవత్సరములక్రిందటి గ్రీకుకవులు కొందఱు దీనిని పొగడి వ్రాసిరి. ఐరోపాదేశములలో నొకకాలమం దంబరును సువాసననిమిత్తము భోజనపదార్థములలో వేసికొనుచుండి రని తెలియుచున్నది. దీనిని యునానివైద్యులు పుష్టిని గలిగించు మందులలో నుపయోగింతురు.

**అంబరుఁడు** — వృత్రాసురానుసారి యైన యసురుఁడు.

**అంబరుపేఁట** — హైదరాబాదు స్వదేశసంస్థానమునందు అత్రాఫ్-ఇ-బల్దా యనుజిల్లాలోని షెర్ఫుఖాన్ అనఁబడుసొంతక మతముతాలూకా. దీనికి పశ్చిమ లేక తూర్పుతాలూకా యని పేరు. జాగీరులతోఁ గలసి దీనివైశాల్యము ౭౫౦ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧,౦౮,౩౨౫. ఇందు ౧౮౦ పల్లెలును, అంబరుపేట అనుముఖ్య గ్రామమును గలవు. వీనిలో ౫౬ జాగీరుపల్లెలు. డౌలు ౧,౭౦,౦౦౦. అంబరుపేటగ్రామముజనసంఖ్య ౨,౬౭౮. ఇందు పెక్కుచెఱువులు గలవు.

**అంబలకారర్** — అఱవశూద్రులలోనియొకజాతి. వీరు తెలుఁగుదేశమందలి ముత్రాసులవంటివారు. వ్యవసాయము కావలి పని వీరివృత్తులు. అఱువదిముగ్గురు శైవభక్తులలో నొక్కండగు కన్నప్పనాయనరుయొక్క సంతానమే మే మని వీరు చెప్పుకొనియెదరు. వీరికి ముత్తిరియను లన్న పేరును కలదు. వీరు విశేషముగా తిరిచినాపల్లి జిల్లాయందును, పుదుకోటసంస్థానమునందును కలరు. ఈ జాతిలో నెన్నియోనాటిభేదములు కలవు. ఒక్కొకనాటివారి వివాదములను దీర్చుట కొక్కొకకులముపంచాయితీ యుండును. వీరు వివాహసమయములందును, అంత్యేష్టికాలమందును జన్నిదము వేసికొని తరువాత తీసివేసెదరు.

**అంబలపులాయ్** —ఇది తిరువాన్కూరు సంస్థానమునందు అంబలపులాయ్తాలూకాకు ముఖ్యపట్టణము. దీనిజనసంఖ్య ౧,౪౯౧. ఇచ్చట కృష్ణస్వామిదేవాలయము గలదు. పదునెనిమిదవ శతాబ్దిమధ్యమువఱకు నంబూద్రిబ్రాహ్మణు లయిన చంపకశేసరియను రాజులు రాజ్యము చేయుచుండిరి. వారికి దేవనారాయణు లని బిరుదు. వీరిలో నొక్కఁడు తిరువాన్కూరురాజులపైఁ దిరుగఁబడిన కాయకుళంజమీన్దారునకు సాహాయ్యము చేసినందున ౧౭౪౮ లో తిరువాన్కూరుమంత్రి యయిన రామయ్యందళవాయి అనువాఁడు అంబలపులాయ్మీఁదికి దండెత్తి పోయి రాజును చెఱఁబెట్టి యా రాజ్యమును తిరువాన్కూరురాజ్యములోఁ గలిపెను.

**అంబలవాసులు** — మలబారుప్రాంతమునందలి పూజారికులమువంటియొకజాతివారికి అంబలవాసు లని పేరు. ఈ జాతియందుఁ జాల నంతశ్శాఖలు కలవు. పొందువాళ్లు, చాకిడియార్లు, నంబీయాసనులు ఫిదారానులు, పిషారోధులు, వారియనులు, నంబులు, తేయంబందులు మున్నగునవి కొన్ని. ఈవివిధ శాఖలకును వృత్తులు గలవు. దేవునకుఁ బూలదండలు కట్టుట, దేవాలయ నూడ్చుట, వంటకట్టెలను దెచ్చుట, ఊరేఁగింపుసమయముల నుత్సవ విగ్రహములను మోయుట, సంకీర్తనము సేయుట, నాట్యమునలుపు లోనగునవి కొన్ని యీవివిధజాతుల కనుదినవిధ్యుక్తములగు వృత్తులుగా నున్నవి. ఈజాతుల నెల్ల సామాన్యముగా అర్చకుల కులములోనివిగా గణించి, కనీసపుబ్రాహ్మణజాతులకంటె తక్కువవారుగాఁ జూచుచున్నారు. అందువలననే ఈజాతివారిలోఁ గొందఱు చేతిమీఁదుగాఁగూడ నాయరు లన్నముఁ దినరు. తిరువాన్కూరు రాష్ట్రజనసంఖ్యాధికారు లంబలవాసు లనుపేరు దేవాలయములలో నివసించుచు, దేవాలయసేవ వృత్తిగాఁ గల వివిధకులసముదాయమునకు నన్వయించు నని నిశ్చయించిరి కేరళమాహాత్మ్యమునందు వీరు క్షేత్రవాసు లని చెప్పఁబడిరి. వీరి కంతరాళు లనునామాంతరముకూడ నున్నది. మలబారునందలి బ్రాహ్మణక్షత్రియులకును, శూద్రులకును 'అంతర' (మధ్య) స్థానము గలవారగుటచే సాంఘికులవలన నంతరాళు లనుపేరు వీరి కీయఁబడియుండనోపు. ఈజాతివారివర్ణవ్యవస్థను గుఱించి కేరళదేశపండితులు భిన్నాభిప్రాయు లయి యున్నారు. ఒకతెగవారు వీరిని బ్రాహ్మణభ్రష్టు లని చెప్పుదురు. 'కేరళపతి' మున్నగు గ్రంథకారులు వీరు శూద్రకులమునుండి యున్నతి నందిన యుత్తమశూద్రు లని నుడువుదురు. అంబలవాసి యనునీపూజారి తెగయం దీక్రింద వ్రాసినయంతశ్శాఖ లిమిడియున్నవి.

| | |
|---|---|
| ౧. నంబియస్సనులు | ౯. నంబియారు |
| ౨. పుష్పకానులు | ౧౦. పిషారతి |
| ౩. పూప్పల్లి | ౧౧. వరియారు |
| ౪. చక్కియారులు | ౧౨. నట్టుపట్టన |
| ౫. బ్రాహ్మణి లేక దైవాంపతి | ౧౩. తీయాత్తుని |
| ౬. అదికళ | ౧౪. కురుక్కాలు |
| ౭. నంబీదీ | ౧౫. పోదువాలు. |
| ౮. పిలాప్పలీ | |

ఈశాఖ లన్నియు దేవాలయములకు సంబంధించి యుండినట్లు కన్పట్టును. మఱియు గుళ్లలో ముఖ్యముగా నియోగింపఁబడిన 'ముత్తాతు'లు మున్నగు అర్చకు లీ౧౫ శాఖలలోఁ జేరరు. దేవళములలో నర్చనాదిక్రియలను నెఱవేర్ప నొప్పుకొని, అందులకుఁ దమజీవితములను ధారవోయుటచే, తరతరములనాఁటి తమపాపముల నుండి విముక్తుల మగుదు మనువిశ్వాసమే వీరివృత్తిపరబార్థము. అధమ జాతులలోనుండి వీ రున్నతిఁ జెందినవా రయినచో వీరియభిప్రాయము ప్రాయశః మతశ్రేష్ఠతను సంపాదించుటయే యయి యుండవలెను. బ్రాహ్మణభ్రష్టు లయినచో బ్రాహ్మణులయాచారముల నవలంబించుట కర్హు లయి యుండరు; అందువలననే యీరెంటను భిన్న మగు మధ్యమవృత్తి వీరిపా లయినది. పుష్పకానులు చేయుమాలికారచ

నయు, చక్కియారులు చదువు స్వస్తివాచనములును దేవాలయ వృత్తులే. అయినను వీని నవలంబించుసేవకులుమాత్ర మేకకులజులు కారు. సాంఘికములగు గౌరవముల నందుటయం దీజాతివారు క్షత్రియులకు ముందు వత్తురు. జాతాశౌచములనుబట్టి కూడ వీరికి 'అంతరాళ' స్థానము తప్పకున్నది. అశౌచకాలము బ్రాహ్మణులకు దశరాత్రములు. క్షత్రియులకు ౧౧ దినములు. నాయరు లాదిగాఁగల శూద్రులకు ౧౬ దినములు. అంబలవాసులు సాధారణముగ ౧౨ దినముల యశౌచమును బట్టుదురు. కొందఱు ౧౩, ౧౪ దినము లశౌచమును బట్టుట కలదు. కాని ౧౬ దివసములుమాత్ర మెవ్వరు నవలంబింపరు. కొచ్చినురాష్ట్ర జనగణనకాలమం దంబలవాసులు దేవాలయ సేవకై నియోగింపఁబడినవా రని నిర్ణయించిరి. ఉత్తమాధమజాతుల పరస్పరసంయోగమువలన నుద్భవించిన సంకరజాతులలో నీయంబలవాసులు చేరుదు రనియు, వీరు మరల జందెములు వేసికొనువారు, జందెములు వేసికొననివారు నని రెండుతెగలుగ నున్నా రనియు గణించిరి. ఈజాతివారి కెల్ల 'మరుమగత్తాయ'సంప్రదాయము, అనఁగా ఆఁడువారివారసత్వము ననుసరించి 'హక్కుభుక్తము'లు చెల్లుచుండును కాని 'మగత్తాయము' అనఁగా మగవారివారసత్వము ననుసరించి స్వామ్యము లబ్బుటయుఁ గొన్నియెడల జరగుచున్నది. నాయరులలోవలె వీరిలో తాళిగట్టుపెండ్లి, సంబంధపుఁబెండ్లి యను రెండువిధము లగువివాహములును గలవు. జాతాశౌచములతరువాతి పుణ్యాహవాచనకములు నంబూద్రీబ్రాహ్మణపురోహితులచే నడపఁబడును. కాని పిండశ్రాద్ధకర్మములను స్వకులజులే పురోహితులుగా నివర్తింపఁజేయుదురు. బ్రాహ్మణులు వండినయన్నమును నంబూదరీలు అంబలవాసులయిండ్లలో భుజింతురు. ఇందు మారారు లనుతెగవారిని కేవల మనర్హులుగఁ బరిగణించుచున్నారు. విధిసంతర్పణలయందును, వనభోజనములందును వీరు శాకభక్షకులుగ నెన్నఁబడుదురు. అంబలవాసిస్త్రీలు సంబంధవివాహములచే స్వజాతిపురుషులతోడను, బ్రాహ్మణ క్షత్రియులతోడను కలయుదురు. ఇప్పటికిని అంబలవాసిజాతివారు చాలమంది తమయానుపూర్వికవృత్తులలోనే చిక్కి మూలుగుచున్నను, ఇటీవల విద్యాఫలము నంది యన్యవ్యాపారములఁ బ్రసక్తులై మెలఁగుచున్నారు.

**అంబలి** — బళ్లారిజిల్లాయందలి కూడ్లిగితాలూకాలోని యొకపల్లె. జనసంఖ్య ౨,౪౨౫. ఇచ్చట మిక్కిలి పురాతనమైన కల్లేశ్వరునిదేవాలయ మొకటి కలదు. అది యంతయు నల్లరాతితోఁ గట్టఁబడినది. ఇది పశ్చిమచాళుక్యరాజులకాలమునందు నిర్మింపఁబడినదిగఁ దోఁచుచున్నది. ఇట క్రీ. శ. ౧౦౮౧-౮౨, ౧౧౦౫-౦౬ సంవత్సరములందు ఆఱవవిక్రమాదిత్యచాళుక్యునిచే వేయింపఁబడిన రెండుశిలాశాసనములు గలవు. ఈగ్రామమునందలి హనుమంతుని దేవాలయమందును గూడ నొకశాసనము గలదు. అది పశ్చిమచాళుక్యవంశజుఁ డైన రెండవజగదేకమల్లునిచే ౧౧౪౩-౪౪ లో వేయింపఁబడినది.

**అంబవరము** — ౧. నెల్లూరుజిల్లా కనిగిరితాలూకాయందలి జమీన్దారీగ్రామము. జనసంఖ్య ౪౩౫.

౨. కర్నూలుజిల్లా కంబంతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౯౦౨.

౩. కడపజిల్లా, కడపతాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౧,౮౫౧.

౪. కడపజిల్లా, జమ్మలమడుగుతాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౫౨౦.

**అంబవెల్లి** — గంజాముజిల్లా పర్లాకిమిడితాలూకాయందలి ఈనాంగ్రామము. జనసంఖ్య ౪౭౪.

**అంబష్ఠదేశము** — ఉశీనరునికొడుకగు సువ్రతునిచే నిర్మింపఁబడినరాజ్యము. ఇంద్రప్రస్థమునకుఁ బశ్చిమమున నుండినశిబిదేశమునకుఁ బశ్చిమమున నుండెను (భార. సభా. అ. ౩౨).

**అంబష్ఠుఁడు** — భారతయుద్ధమునందు దుర్యోధనుని వైపునఁ బోరాడినరాజు. అర్జునునిచేఁ జచ్చెను(భార. ద్రోణ. అ. ౯౩).

**అంబళ్లవలస** — గంజాముజిల్లా, శ్రీకాకుళము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౪౩౩.

**అంబాకపల్లి** — కడపజిల్లా, పులివెందల తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౬౦౪.

**అంబాగఢచౌకీ** — మధ్యరాష్ట్రములలోని చాందా జిల్లాలో నొకచిన్నసంస్థానము. దీనిలో ఇనుము హెచ్చుగ దొరకును. ఇచ్చట వ్యవసాయము తక్కువ. చాలభాగ మిది యరణ్యమయము. దీనివైశాల్యము ౨౧౯ చ. మైళ్లు. ఇచ్చట నివసించుప్రజలలో గోండులనునారణ్యకజాతివా రెక్కువగ నుందురు.

**అంబాజన్మము** — భారతవర్షీయతీర్థము.

**అంబాజిఇంగ్లియా** — గ్వాలియర్సంస్థానమందు మాధవరావుసింధియాయొద్ద ౧౭౮౭ మొదలుకొని సైన్యాధీశుఁడుగ నుండెను. దౌలతరావుసింధియాయొద్దఁగూడ నీతఁడు పనిచేసెను.

**అంబాజీదుర్గము** — మైసూరు సంస్థానమున కోలారు జిల్లాయందలి చింతామణితాలూకాలో విడిగానున్న యొకపర్వతదుర్గము. ఇది సముద్రపుమట్టమునకు ౪,౩౯౯ అడుగులయెత్తున నున్నది. ఈదుర్గము టిప్పుసుల్తాను కట్టించినది. ౧౭౯౧లో నిది ఆంగ్లేయుల వశ మయ్యెను. ౧౮౭౩-వ సంవత్సరమువఱకు కాప్రాంతముల నున్న 'హోబలీ' (రివిన్యూఫిర్కా) లన్నియుఁ గలసి అంబాజీదుర్గము అనుతాలూకాగా నేర్పడెను. వానికి చింతామణి ముఖ్యపట్టణముగ నుండెడిది.

**అంబాజీపేఁట** — తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకాయందలి యొక గ్రామము. జనసంఖ్య ౫,౬౬౧. ప్రతి బుధవారము నిచ్చట గొప్పపశువులసంత జరగును. గొప్పవర్తకస్థానము. కొబ్బరిత్రాళ్లకును, కొబ్బరినూనెకు నిది ప్రసిద్ధి కెక్కినది.

**అంబాద్** — దక్షిణహైదరాబాదులో హైదరాబాదు నకు వాయవ్యమూలనున్న ఒకతాలూకా. దీనివైశాల్యము ౮౬౦ చ. మైళ్లు. మహారాష్ట్రుల ప్రాబల్య మంతరించినతరువాత నీతాలూకా కొంతకాలము బ్రిటీషువారియధీనమున నుండెను. కాని తరువాత వారు మరల దీనిని నైజామునకొప్పఁజెప్పిరి. అంబాద్, జాంఖేర్, రోహిల్ గఢ్ మొదలగునైదాఱుపట్టణము లీతాలూకాలోని గ్రామములలో ముఖ్యమయినవి.

**అంబాపురము** — ౧. నెల్లూరుజిల్లా నెల్లూరుతాలూకా యందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౪౨౭.

౨. కర్నూలుజిల్లా ఢోన్ తాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౫౯౯.

౩. కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకాయందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౨౨.

౪. కృష్ణాజిల్లా, బెజవాడతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౩౧౧.

**అంబాపూర్** — గంజాముజిల్లా, బరహంపురము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య ౩౯౯.

**అంబాభవాని** — బొంబాయిరాజధానియందలి యొక పుణ్యక్షేత్రము.

**అంబామనోహారి** — షాడవ - షాడవరాగము. ఇరువదిమూఁడవ మేళకర్త యగుగౌరీమనోహరీరాగజన్యము. ఆరోహణావరోహణములందు స రి గ మ ధ ని స - స ని ధ మ గ రి స యని సంచారము.

**అంబాయదాసుపాలెము** — విశాఖపట్టణము జిల్లా శృంగవరపుకోటతాలూకాయందలి జమీన్‌దారీ గ్రామము. జనసంఖ్య ౧౦౬.

**అంబాయనా** — తూర్పు పసిఫిక్ మహాసముద్రమున డచ్చివారికిఁ జేరినమొలుక్కాదీవులలో నొకచిన్నదీవి. విస్తీర్ణము ౨౮౦ చదరపుమైళ్లు. సిరిమి, బోరో మొదలుగాఁగల చుట్టుపట్టులనుండు పెద్దదీవు లన్నియు నీఅంబాయనామండలమునకుఁ జేరినవి. ఈదీవి గుట్టలచే నావరింపఁబడి యున్నను ఇచ్చట శీతోష్ణస్థితి సమముగా నుండును. భూకంపము లప్పుడప్పుడు తటస్థించుచుండును. టెంకాయచెట్లును, సగ్గుబియ్యపుచెట్లును ఈదీవియందు సాధారణములు. లవంగములును, జాజికాయయు నిచ్చటిముఖ్యోత్పత్తులు. తీరభూమియు, పర్వతమధ్యభూమియు మిక్కిలి సారవంతములు. కాని విశేషభాగ మింకను సాగుబడిక్రిందికి రాలేదు. అంబాయనాపట్టణమే ఈదీవికి రాజధాని. క్రీ. శ. ౧౬౦౭ లో ఈదీవియు, నితరదీవులును పోర్చుగీసువారినుండి డచ్చివారు తీసికొనిరి. బహుకాల మీప్రాంతములలోనిడచ్చివారి రాజ్యమున కంబాయనా ముఖ్యస్థానముగా నుండెను. క్రీ. శ. ౧౬౧౯-వ సంవత్సరము సంధివలన బ్రిటీషువారికి మొలుక్కాదీవులలో వ్యాపారము చేయుహక్కు గలిగెను. అంబాయనాయందు వీరిస్థాన మొకటి యేర్పఱుపఁబడెను. కాని ౧౬౨౩ లో ననేకులు బ్రిటిషువారు డచ్చివారిచేఁ జంపఁబడినందున వీరివ్యాపార మాఁగి పోవలసి వచ్చెను. ౧౭౯౬ లోను, ౧౮౧౦ లోను డచ్చివారినుండి అంబాయనాను బ్రిటిషువారు లాగికొనిరి గాని సంధి ననుసరించి మరల నిచ్చువారైరి. అంబాయనాజనసంఖ్య ౩౦,౦౦౦.

**అంబాయవీయ** — సత్యలోకమునందలి యొకయప్సరస.

**అంబారీఫల్లకోట** — బూటాన్ రాజ్యములో నొక ప్రదేశము. బూటాన్ దేశాధిపతికిని, ఆంగ్లేయులకును గలవిరోధము సందర్భమున బూటాన్ రాజు తమ కపకారము గావించె నని, యంతకు ముందే కవ్రులునకు తమయధీనముననుండి అంబారీఫల్లకోటను ౧౮౬౩-వ సంవత్సరమున ఆంగ్లేయు లాక్రమించుకొనిరి. అటుపై ౧౮౬౫-వ సంవత్సరమున జరగిన యొకంబడిక ననుసరించి బూటాన్ రాజు స్వయముగనే దానిని శాశ్వతముగ నాంగ్లేయులనశ మొనర్చెను.

**అంబారుపేఁట** — కృష్ణజిల్లా, నందిగామతాలూకా యందలి ఈనాం గ్రామము. జనసంఖ్య ౩౭౪.

**అంబాలాజిల్లా** — పంజాబుదేశమున ఢిల్లీడివిజనునం దుత్తరపునైపుజిల్లాలలో అంబాలాజిల్లా చివరిది. ఇది ౩౦° ౨', ౩౧° ౧౩' ఉ. కును, ౭౬° ౧౯', ౭౭° ౩౬', తూ. కును నడుమ నున్నది. వైశాల్యము ౧,౮౫౧ మైళ్లు. ఇది ఉత్తరమున సట్లజ్ నది మొదలుకొని యమునానదివఱకును వ్యాపించియున్నది. ఈజిల్లాయొక్క యాకారము విషమముగా నున్నది. ఒకదానితో నొకటికి సంబంధము లేని రెండుప్రదేశములు కలసి యేర్పడినది.

జిల్లాయం దెక్కుడుభాగము ఘగ్గర్ యమునానదులకు నడుమ నున్నది. సివాలిక్‌గుట్టలవంపునకు నైరృతదిక్కున క్రమక్రమముగా తగ్గుచు నేర్పడినమైదానమే యీ ప్రదేశము.

స్వాభావిక స్వరూపము

ఇయ్యది గుట్టలమీఁదనుండి ప్రవహించెడి వఱదల వలన వచ్చు ఒండ్రువలన సారవంతమైనది. అచ్చటచ్చట కలరునేల కలదు. ఇట్టిప్రదేశములును, ముఖ్యముగా నారాయణగఢతాలూకాయును ఎక్కువగా వర్షము కురిసినఁ గాని ఫలవంతములు కావు. కావున అప్పుడప్పు డిచ్చట కఱవులు సంభవించుట కలదు. ఈజిల్లాలో అంబాలా, ఖరర్, జగాధ్రి, నారయణగఢము, రూపర్ అనునవి యైదుతాలూకాలు గలవు.

ఈజిల్లాలోఁ జెక్కునదులును, చిన్న యేళులును కలవు. యమునానదికిఁ బశ్చిమమునఁ గట్టఁబడిన ఆనకట్ట, అందుండి తీయఁబడిన కాలువ మొదలయిన నీటిపారుదలసంబంధ మైనవిషయముల విచారించుముఖ్య కార్యాలయ మీజిల్లాలో తజవాల యనుగ్రామమునందుఁ గలదు. రూపారునొద్దనే సర్ హింద్ కాలువ ప్రారంభమైనది. ఈశాన్యభాగము కొంత తప్ప జిల్లా యంతయు సింధుగంగానదులయొండ్రువలన నేర్పడిన ప్రదేశము. ఈశాన్యభాగము హిమాలయసంబంధ మైన శివాలిక్ కాలువకు సంబంధించినది. ఇందు ఇసుకరాలును, గులకరాలును విశేషముగాఁ గలవు. వృక్షములనుగుఱించి యీజిల్లాను మూఁడు ప్రదేశములుగా విభజింపవచ్చును. దక్షిణమున నున్నది గంగానదియొక్క యుత్తరప్రదేశము. ఈశాన్యముననున్నది శివాలికుపర్వతమునకు సంబంధించినది. కలసర్ అడవియు, మోర్ని గుట్టలయడవియు నీభాగమునందే కలవు. కసౌలి యను మూఁడవది ౬,౦౦౦ అడుగులు ఎత్తున నున్నది. ఈయరణ్యములలో నచ్చటచ్చట పెద్దపులులు కలవు. చిఱుతపులులు, సివంగులు, జింకలు, లేళ్లు విశేషముగా నుండును.

ఈజిల్లాయందలి మైదానములలోని కాలమానము సామాన్యముగా సుఖప్రదముగనే యుండును. కాని పర్వతములు సమీపమున నున్నందున వేఁడిమి యొకప్పు డెక్కువగను, ఒకప్పుడు తక్కువగను ఉండును. సరాసరి మధ్యమోష్ణము జనవరిలో ౩౯·౪౫° ను, జూనులో ౭౭.౫౫° లును ఉండును. వర్షమానము భిన్నభిన్న ప్రదేశములలో భిన్నభిన్నముగా నుండును. సరాసరి సంవత్సరమునకు రూపారులో ౨౮ దుక్కులును, కసౌలిలో ౬౧ దుక్కులును వర్షము కురియును.

ఈజిల్లాచరిత్రమునకునై మనము నమ్మఁదగిన మిక్కిలిపురాతన లేఖ ఏడవశతాబ్దియందు మనదేశమునకు వచ్చిన బౌద్ధయాత్రికుఁడు యువాన్ చాంగు వ్రాసిన వ్రాఁతయే. అప్పు డిది నాగరకత గలిగి, వైభవదశయం దున్న యొకరాజ్యము. స్రుఘ్నసగరము దీనికి రాజధాని. జగాధ్రికి సమీపమున నున్న సుఘ్ అనఁబడు నిప్పటిపల్లె యున్నచోటనే యీగ్రామ ముండెనని పండితులయభిప్రాయము. ఈప్రదేశము ఉత్తరదిక్కుననుండి వచ్చెడివారిత్రోవలో నున్నందున హిందూదేశము మీఁదికి దండెత్తి యుత్తరముననుండి వచ్చినవా రందఱును ఈమార్గమునఁ బోయినవారే.

చరిత్ర

క్రమముగా ఢిల్లీరాజ్యము మరాటీవారిప్రహారణములచేతను, అఫ్గానుల దాడులచేతను సత్త్వహీనము కాఁగా పదునెనిమిదవశతాబ్ది యుత్తరార్ధమున సిక్కువీరులు కొందఱు తమసాహసముచే సట్లజ్ నదిని దాఁటి సట్లజ్, యమునలకు నడుమ నున్న ప్రదేశమును వశపఱుచుకొని చిన్నసంస్థానములను నిర్మించుకొనిరి. ౧౮౦౩ లో మరాటీవారిబలము తగ్గి యింగ్లీషువారు ప్రభువులు కాఁగా ఈసంస్థానము లన్నియు నొకవిధమున స్వతంత్రము లయ్యెను. ఇందు పాటియాలా, జింద్, నాభా మొదలయిన పెద్దసంస్థానములును, కొన్ని పల్లెలుమాత్రము గల ప్రభువులును ఉండిరి. పంజాబుదేశపుసింహ మైన రణజితుసింగు తన రాజ్యవైభవమును హెచ్చించుకాలమందు సట్లజ్ నది దాఁటి యీసంస్థానములమీఁదికి దండెత్తి వచ్చెను. అప్పుడు వీ రందఱును ఇంగ్లీషువారిని శరణు చొచ్చిరి. అప్పు డింగ్లీషువారు ౧౮౦౯ లో రణజితుసింగుతో సంధి చేసికొని యాతఁ డీసంస్థానములను బాధపెట్టకుండఁ జేసిరి. ఈసంస్థానికులు తమలోఁ దాము పోరాడవలదనియు, ఏవివాదమైనను పోరాటము లున్నయెడలఁ దమకుఁ జెప్పి తీర్మానించుకొనవలయు ననియును ౧౮౧౧ లో బ్రిటీషుప్రభుత్వమువా రాజ్ఞాపించిరి. ఈరాజుల కందఱకుఁ దమతమరాజ్యములలోఁ గొందఱకుఁ, దమతమగ్రామములలో కొందఱకు సర్వవిధము లయిన ప్రభుత్వాధికారములు నుండెడిది. భూమిసిస్తు రాఁబట్టుకొనుట, అపరాధులను విచారించి దండించుట, సొత్తునుగుఱించిన వివాదములను పరిష్కరించుట మొదలయినయధికారములన్నియు వారికే యుండెను. గవర్నరుజనరలు ప్రతినిధిగా అంబాలాలో నొక బ్రిటీషు అధికారి యుండెను. అతనికి నీసంస్థానాధీశులపైఁ గొంతయధికార ముండెను. ఈరాజులు బ్రిటిషువారి కేమియు నిచ్చుట లేదు. సంస్థానాధీశులు అపుత్రులై మృతి నొందినయెడల వారిరాజ్యము బ్రిటిషువారికి సంక్రమించునట్టి యేర్పాటుమాత్ర ముండెను. మొదటి సిక్కుయుద్ధమునందును, ౧౮౪౫ లోని సట్లజ్ దాడియందును ఈసంస్థానాధీశులు బ్రిటిషువారికి నేమియు సాయము చేసినవారు కారు. తిరుగఁబడకమాత్ర ముండిరి. అందుచే వారియధికారములను లాగివేయుటకు నేర్పాటు చేయఁబడెను. అంబాలాలో నున్న ప్రతినిధికి (ఏజంటు) మాఱుగా చీఫ్ కమిషనర్ అనుబలవంతుఁ డైనయధికారి ఏర్పడెను. పోలీసు అధికార మంతయు బ్రిటిషుఅధికారుల కిచ్చివేసిరి. రెండవసిక్కుయుద్ధము జరగి పంజాబుదేశ మంతయు బ్రిటిషువారికి స్వాధీనపడిన తరువాత ౧౮౪౯-వ సంవత్సరపు జూనునెలలో ఈసంస్థానములకు నదివఱకుఁ గల ప్రభుత్వాధికారము లన్నియు లాగివేయఁబడినవి. భూమిసిస్తుమాత్రము రాఁబట్టుకొనునధికారము వారికి నుంపఁబడినది. భూములకుఁ దరము లేర్పఱచునధికారముకూడ బ్రిటిషుప్రభుత్వమువారే తీసికొనిరి. ఇంతకుఁ బూర్వమే వారసులు లేనందునఁ గొన్నిసంస్థానములు బ్రిటిషువారికి సంక్రమించెను. ఈమార్పులవలన నీజిల్లా యంతయు సంక్రమించెను.

ఈజిల్లాలో ౭ పట్టణములును, ౧,౭౧౮ పల్లెలును కలవు. ఇందలి పెద్దపట్టణములు అంబాలా, జగాధ్రి, రూపర్, సాఢార్, బూరియాలు. ఇచ్చట మ్యునిసిపాలిటీ లున్నవి.

జనులు

జనసంఖ్య ౮,౧౫,౮౮౦. ఇందు ౧౦౦-కి ౬౨ రు హిందువులు, ౩౦ మంది మహమ్మదీయులు, ౭ గురు సిక్కులు, మిగిలినవా రితరమతస్థులు. రూపర్, ఖరర్ తాలూకాలలో పంజాబీభాషయు, మిగిలినతాలూకాలలో హిందీభాషయు మాటలాడెదరు. ఇచ్చటిజనులలో ౧౦౦-కి ౫౧ రు వ్యవసాయమువలనను,

౧౯ మంది చేతిపనులవలనను, ౪ గురు వర్తకమువలనను, ౩ గురు ఇతర వృత్తులవలనను జీవించెదరు. ఈజిల్లాలో జాట్‌జాతివా రెక్కువగ నున్నారు. భూస్వాములలో వీరే యెక్కువ. సంఖ్యలో రెండవవారు రాజపుత్రులు. రాజపుత్రులలో రెండువంతులవారు మహమ్మదీయులు. ఒకవంతువారు హిందువులు.

జిల్లాయందలిభూమిలో ౧౦౦ కి ౬౪ వంతులు భూమి సేవ్యమైనది. ౩౬ వంతులు భూమి బంజరుగా నున్నది. సేవ్యమైనభూమి ౧,౯౫ చదరపుమైళ్లు. సాగయినభూమిలో ౧౦౦-కి ౬ వంతులు అనఁగా ౭౧ చదరపుమైళ్లు పల్లపువ్యవసాయముక్రింద నున్నది. అందు ౪౩ చదరపుమైళ్లు బావులక్రిందిపాఱుదలయు, ౩,౩౯౬ ఎకరములు కాలువలక్రిందిపాఱుదలయు, ౨౩ చదరపుమైళ్లు చెఱువుల, వాఁగుల క్రిందిపాఱుదలయు కలవి.

వ్యవసాయము

ఈజిల్లాలో పండునట్టి ముఖ్యమైనపైర్లు వడ్లు, కందులు మొదలైనకాయధాన్యములు, జొన్నలు, ప్రత్తి, మొక్కజొన్నలు, నల్లమందు, చెఱకు. ౧౯ చదరపుమైళ్లుగలయరణ్య మొకటి రిజర్వ్‌గా, ననఁగా కొట్టకుండ నుంపఁబడినది.

మోర్ని గుట్టలలో నున్నపురాయి విశేషముగా నున్నది. కంకరరాయియుఁ గలదు. పర్వతముమీఁదనుండి వచ్చువాఁగులలో నచ్చటచ్చట బంగారపుటిసుక దొరకును. అంబాలాలో చక్కనిజంబుఖానాలు నేయుదురు. దూదిచేయుయంత్రశాలలు ౪ ను, దూది నదుము యంత్రశాలలు ౩ ను, దూదినేకుటయు పిండి విసరుటయు నను రెండుపనులును జేయునట్టియంత్రశాలలు ౨ ను గలవు. ఈజిల్లాలో మఱియుఁ బెక్కుయంత్రశాల లున్నవి. అంబాలా, రూపర్ వర్తకస్థలములు. జగాధ్రి యనుచోట రాగి, యిత్తడిపాత్రల వర్తకము విశేషముగా నున్నది. వెలిగారపువర్తకముగూడ నచ్చటఁ గలదు. కురావి యనుచోట బట్టలవర్తక మెక్కువగా జరగును. సంవత్సరమునకు ౫ లక్షలరూకలను బేరము జరగు నని చెప్పెదరు. ఈజిల్లాలో రెండు ఇనుపదారులును, ౪ కంకరరోడ్డులును కలవు. యమునానది దాఁటుటకు చలికాలమునందు బోట్లతో వంతెన కట్టఁబడును. ఇచ్చట ౧౮౬౦-౧, ౧౮౬౮—౯, ౧౮౯౦, ౧౮౯౭, ౧౮౯౯, ౧౯౦౦ సంవత్సరములలోఁ గఱవు తటస్థించెను. వీని యన్నిటిలో మొదటికఱవువలన జనులు విశేషముగా బాధపడిరి.

వృత్తులు, వ్యాపారము, వర్తకము

ఈజిల్లాలో నైదుతాలూకాలు గలవు: అంబాలా, జగాధ్రి, నారాయణగఢ్, రూపార్, ఖరర్. చివరరెండుతాలూకాలును గలసి రూపర్ సబుడివిజను ఏర్పడినది. తాలూకాను ఇచ్చట తహస్సీ లనియెదరు. ఒక్కొక్కతాలూకాకు నొకతహస్సీలుదారు, నాయబ్‌తహస్సీలుదారు అనునిద్దఱు అధికారు లుందురు. జిల్లా యధికారిపేరు డెప్యూటీకమిషనర్. ఇతనికి సహాయులుగా నల్గురు అసిస్టెంటుకమిషనరులు లేక ఎక్స్ట్రా అసిస్టంటుకమిషనరు లుందురు. వారిలో నొకఁడు రూపర్‌సబుడివిజనుపనియు, మఱియొకఁడు జిల్లాఖజానాపనియుఁ జూచుచుండును. పోలీసుసంబంధమైన డెప్యూటీ యిన్‌స్పెక్టర్ జనర లనునధికారి యంబాలాపట్టణమునం దుండును.

పరిపాలనా విభాగములు

డెప్యూటీకమిషనరు జిల్లా కంతకును మేజస్ట్రే టయినందున అపరాధదండనసంబంధమైన న్యాయవిచారణ కంతకు నతఁడే కర్త. అసిస్టెంటు, ఎక్స్ట్రా అసిస్టెంటుకమిషనరులకుఁ గూడ నధికారముండును. సొత్తుసంబంధమయిన వివాదములను పరిష్కరించుటకు జిల్లాజడ్జీ యొకఁడు కలఁడు. జిల్లామేజస్ట్రేటునకును, జిల్లాజడ్జీకిని పైయధికారి డివిజనల్ జడ్జీ అనునతఁ డొకఁడు కలఁడు. అంబాలాలో నొకటియు, జగాధ్రిలో నొకటియు, రూపరులో నొకటియు నిట్లు మూఁడుమునసబుకోర్టులు గలవు. వీరు గాక కొందఱు కాంటోనుమెంటుమేజస్ట్రేటులును, ఆనరెరి మేజస్ట్రేటులును కలరు.

సిక్కుః ప్రభుత్వమునప్పుడు భూమిసిస్తు ధాన్యరూపముగా నుండెను. బ్రిటిషుప్రభుత్వము వచ్చినతరువాత నాధాన్యమునకే వెలగట్టి సిస్తు ధనరూపముగ మార్చఁబడెను. ౧౮౪౭ మొదలుకొని ౧౮౫౭ వఱకును భూమికి తరము లేర్పఱుపఁబడి క్రమమయిన అమరకము (Settlement) మొట్టమొదట చేయఁబడెను. ౧౮౮౨ మొదలుకొని ౧౮౮౯ వఱకును రెండవసారి యమరకము చేయఁబడెను. మెరకభూమికి ఎకరమునకు ౫ అణాలు మొదలుకొని రు. ౨, ౨ అణాల వఱకును పల్లపుభూములకు రు. ౨, అ. ౪. మొదలుకొని రు. ౫ వఱకును తరములు కలవు. జిల్లాడౌలు రు. ౧౩,౮౦,౦౦౦.

ఈజిల్లాలో చదువుకొనినవారు నూటికి ౪, ౩ కలరు. అంబాలాలో నొకమిషన్‌హైస్కూలును, జగాధ్రిలో నొకగవర్నమెంటు హైస్కూలును, ఒక సెకండరీపాఠశాలయు, పెక్కులు ప్రాథమిక పాఠశాలలును గలవు.

ఈజిల్లాలో అంబాలాపట్టణమునం దొక పెద్ద ఆస్పత్రియు, ఇతరస్థలములందు ౭ చిన్న ఆస్పత్రులును గలవు. అంబాలాపట్టణమున అమెరికామిషనువారివలన స్థాపింపఁబడిన కుష్ఠవైద్యశాలయు, స్త్రీవైద్యశాలయుఁ గలవు.

**అంబాలాతాలూకా** — అంబాలాజిల్లాయందలి యొకతాలూకా. దీని వైశాల్యము ౩౬౦ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧౨,౦౮౦౬. ఇందు అంబాలాపట్టణమును, ౨౯౫ పల్లెలును గలవు. డౌలు రు. ౨,౮౦,౦౦౦.

**అంబాలాపట్టణము** — పంజాబుదేశమందలి అంబాలాజిల్లాకు ముఖ్యపట్టణము. నార్తువెస్టరన్ రయిల్వేమీఁదను, ఉత్తరదిక్కునకుఁ బోవు రాజమార్గముమీఁదను ఉన్నది. ఈరెంటికిని అంబాలాయొద్దనే ఢిల్లీ-అంబాలా కాల్కా యను నినుపదారి యడ్డ

ముగాఁ బోవుచున్నది. ఈపట్టణము బెజవాడ కుత్తరమున రమారమి వేయిమైళ్లదూరమున నున్నది. జనసంఖ్య ౭౮,౬౩౮. అందు హిందువులు ౩౯,౬౦౧, సిక్కులు ౨,౧౬౮, మహమ్మదీయులు ౩,౨౧,౪౯౮, క్రైస్తవులు ౩,౬౧౦. హిందూదేశమునందుఁగల గొప్పకంటోన్మెంటులలో నిది యొకటి. కంటోన్మెంటు అనఁగా సైన్యములు నివసించుస్థలము. అంబాలాపట్టణమునకును, అంబాలాకంటోన్మెంటునకును నాలుగుమైళ్లయంతరము గలదు. అంబ యనువాఁడు స్థాపించుటచే నంబాలా యని పేరు వచ్చె నని యనియెదరు. అచ్చట నొక జమీన్దారీ యుండెను. అది జమీన్దారునకు సంతానము లేనందున ౧౮౨౩ లో బ్రిటిషువారికి సంక్రమించెను. అచ్చట పొలిటికల్ ఏజంటు బ్రిటిషువారిప్రతినిధియై యుండెను. ౧౮౪౩ లో నచ్చటి కంటోన్మెంటు ఏర్పడెను. ౧౮౪౯ లో నిది యీజిల్లాకు ముఖ్యపట్టణముగ నేర్పడెను. ఇది వర్తకమునకు మధ్యపట్టణ మయి యున్నది. ధాన్యము ప్రత్తివర్తక మిచ్చట విశేషముగా నున్నది. పర్వతపట్టణమయినసిమ్లాకు నిచ్చటనుండియే సరకులు పంపఁబడును.

ఇచ్చట ౧౮౬౭లో మ్యునిసిపాలిటీ (పట్టణపారిశుద్ధ్యసంఘము) యేర్పడెను. ఈపట్టణమునందు మూఁడు హైస్కూళ్లును, రెండు మిడిల్ స్కూళ్లును, ఒక ఆస్పత్రియుఁ గలవు.

**అంబాలిక, అంబిక** — కాశీరాజుకూఁతులు. అంబకుఁ జెల్లెండ్రు. భీష్ముని సవతితమ్ముఁడగు విచిత్రవీర్యుని భార్యలు. అంబిక పెద్దది. అంబాలిక చిన్నది. విచిత్రవీర్యుఁడు సంతానము లేకయే మరణముఁ జెంద శ్రీవేదవ్యాసుఁడు సత్యవతియాజ్ఞ ననుసరించి దేవరన్యాయమున అంబికయందు ధృతరాష్ట్రుని, అంబాలికయందు పాండురాజును పుట్టించెను. పాండురాజు మరణము నొందినకొలఁదికాలములోనే వీరు తమయత్తయైన సత్యవతితోఁగూడి తపోవనంబునకుం జని ఘోరతపంబు నేసి కొండొకకాలంబునకు శరీరంబులు విడిచి పుణ్యగతికిఁ బోయిరి.

**అంబాలీ** — బరోడాసంస్థానమునందలి సినోర్ సబ్‌డివిజనులో నొకగ్రామము. ఇందు అనసూయాదేవియాలయ మొకటి కలదు. ఈయాలయమున కడుగుననున్న మట్టి యొడలికిఁ బట్టించుకొన్నను, ఈదేవి స్నానమాడిననీటి నొడలిపైఁ బోసికొన్నను కుష్ఠరోగము నశించిపోవునఁట. అందుచేత ఆరోగముచేఁ బీడింపఁబడువారెందఱో యీగ్రామమునకు వచ్చి నివసించుచుందురు. ఇట్లు వచ్చువారికై ప్రత్యేకముగ బరోడామహారాజుగారు కట్టించిన 'యాసుపత్రి' యొకటికూడ నిందు కలదు.

**అంబాసముద్రముగ్రామము** — అంబాసముద్రముతాలూకాకు ముఖ్యస్థలము. తామ్రపర్ణీనదిమీఁద ఉత్తరతీరమున తిరునల్వేలిపట్టణమున కిరువదిమైళ్లపైభాగమున నున్నది. ఇచ్చట యూనియన్ పంచాయతీ గలదు. ఒక హైస్కూలున్నది.

**అంబాసముద్రముతాలూకా** — మద్రాసురాజధానియందలి తిరునల్వేలిజిల్లాలోని యొకతాలూకా. ఇది పడమరకనుమల పాదము నొద్ద ౮° ౨౯', ౮° ౫౭' ఉ. కును, ౭౭° ౧౨', ౭౭° ౪౦' తూ. కును నడుమ నున్నది. దీని వైశాల్యము ౪౮౧ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧,౮౩,౬౧౬. జనులయొత్తిడి ఒక్కచదరపుమైలునకు ౩౭౯౫ నున్నది. భూమిసిస్తు, పన్నులు కలసి సంవత్సరమునకు డౌలు (డిమాండు) రూ. ౪,౭౪,౦౦౦. ఈతాలూకాలో తామ్రపర్ణీనదివలనను, దానియుపనదులవలనను వ్యవసాయమునకు మిక్కిలి సదుపాయము గలుగుచున్నది. అందువలన ప్రతిసంవత్సరము తప్పక రెండు వరిపంటలు పండుచున్నవి. తామ్రపర్ణీనది కచ్చటచ్చట ఆనకట్టలు కట్టి వ్యవసాయమునకు నీరు పాఱుదల చేసికొనుపద్ధతి పురాతనకాలమునుండియుఁ గలదు. ఈ పద్ధతి యచ్చట పూర్ణతను జెందియున్నది. ఈనదులవల్ల పాఱుదల యైనభూమి తప్ప ఈతాలూకాలోని యితరభూమి పాషాణమయము. సారవంతమయినది కాదు. ఈతాలూకాలో సింగంపట్టి, ఉర్కాడ్ అనురెండుజమీన్దారీలు కలవు. ఈరెంటికిని వ్యవసాయమునకు నీటివసతి కలదు. తామ్రపర్ణీనదియొడ్డునను, నీటిపాఱుదలప్రదేశమునను ధనవంతులైన బ్రాహ్మణభూస్వాములు వాసము చేయుచున్నపల్లెలును, పట్టణములును పెక్కులు కలవు. వీరి తెలివితేటలవలనను, సాహసమువలనను తాలూకాకు సంపద కలిగిన దని చెప్పవచ్చును. అంబాసముద్రము తాలూకాకు ముఖ్యపట్టణము. వీరవనల్లూరు (జనసంఖ్య ౧౭, ౩౨౭), కల్లిడైకురుచి (౧౪, ౯౧౩), సెర్మదేవి (౧౩, ౪౭౪) అనునవి తాలూకాయందలి గొప్పపట్టణములు. పాపనాశన మనునొక క్షేత్రముఁ గలదు. ఇవిగాక ౮౪ పల్లెలు గలవు.

**అంబిక** — ౧. బొంబాయిరాజధానియందలి సూరత్ జిల్లాలో నొకనది. బాసదాకొండలలోఁ బుట్టి బరోడారాజ్యముగుండా ప్రవహించుచున్నది. అటుపై సూరతుమండలమునుండి ప్రవహించి 'పూర్ణ'కు దక్షిణమున సముద్రములోఁ గలయుచున్నది. సముద్రమునఁ గలయుచోటి కైదాఱుమైళ్లకు వెనుక ఫర్లాంగుపైఁగ వెడల్పు గలిగినరెండువంతెన లున్నవి. దీనికి కావేరి, ఖరేరా యను ఉపనదులు రెండు కలవు. అంబికానదిపై బిల్‌గోరావఱకు పెద్దపెద్దయోడలు ప్రయాణము చేయుటకుఁగూడ నవకాశము కలదు.

౨. అంబిక యనుపేరుగల గ్రామ మొకటి వంగదేశమునందలి వర్ధమానమండలమునఁ గలదు.

**అంబికపల్లి** — ఇది గోదావరిజిల్లా రామచంద్రపురంతాలూకాలోని గ్రామములలో నొకటి. జనసంఖ్య కేవలము ౨౭౬.

**అంబికాదత్తవ్యాస** (సాహిత్యాచార్య) — హిందీ సంస్కృతభాషల రెంటను సుప్రసిద్ధుఁ డయిన మహాపండితుఁడు. అసమానప్రతిభగల శతావధాని. ఇతనిపూర్వికులు రాజపుత్రస్థానమున

నుండిరి. ఇతని పితామహుఁడు పండిత రాజారామజీ కాశీనగరము నివాసముగ నేర్పఱచుకొనెను. ఆతనికి దుర్గాదత్తుఁడు, దేవీదత్తుఁడు నని యిరువురు పుత్త్రులు కలిగిరి. దుర్గాదత్తుఁడు ప్రసిద్ధకవి యయ్యె. ఆతని పుత్త్రులలో జ్యేష్ఠుఁ డీయంబికాదత్తుఁడు.

ఇతఁడు క్రీ. శ. ౧౮౫౭-వ సంవత్సరమున జనన మందెను. ఐదేండ్లు వచ్చుసరి కీతని విద్యాభ్యాసము ప్రారంభించిరి. ఇతఁడు పుట్టుకచేత నే ప్రతిభాశాలి. అందును ఇంటియందలి స్త్రీ లందఱును విద్యావతు లయి యుండినందున నీతని ప్రతిభ కడుత్వరగాఁ జూపట్ట మొదలిడెను. శైశవపు టాటపాటలలోనే ఇతఁడు శబ్దరూపావళియు, అమరకోశమును కంఠస్థములు చేసికొనెను. ఎనిమిది తొమ్మిది సంవత్సరములవాఁ డగునప్పటికి గానవిద్యయందు కొంతపరిశ్రమచేసి కవిత్వము చెప్ప నారంభించెను. గోస్వామి శ్రీకృష్ణచైతన్యుఁడు మహోద్దండ కవియై యుండె. అతనిగీతములను అంబికాదత్తుఁడు పఠించిపఠించి ఒక్కసంవత్సరములోపల కవిత్వతత్త్వముల నెఱింగికొని నిండు సభల యందు సమస్యాపూర్తి చేయ మొదలిడెను. అంత చిన్నవయస్సుననే ఇతఁడు మహారాజ కాశీరాజులవారి ధర్మసభవారివలన పారితోషికమును బడసెను. ఇట్లుండ నితనికి పండ్రెండవసంవత్సరము నిండకముందే యీతనికీర్తిని దిగంతగతముచేయఁగలుగువిషయ మొకటి తటస్థించెను. తెలుఁగుసీమనుండి యొక యష్టావధాని (వీరిపేరు తెలియరాలేదు) ఉత్తరహిందూస్థానమునకుఁ బోయి యచ్చటి మహాపండితుల నందఱను చకితులఁజేసి వదలిపెట్టెను. అప్పు డీయంబికాదత్తవ్యాసుఁడు శతావధాన మొనరించి ఆయాంధ్రకవిసింహుని మెప్పించి ఆతనివలన 'సుకవి' బిరుదము నందెను.

పదుమూఁడేండ్లప్రాయమున నీతఁడు సంస్కృత మధ్యయనము చేయ నారంభించెను. వ్యాకరణము, సాంఖ్యము, సాహిత్యము, వేదాంతము మున్నగుగహనవిషయములతోఁగూడ గానవాద్య సంబంధ మయిన కళలనుగూడ నభ్యసించెను. ౧౮౭౫లో నీతఁడు కాశీనగరము నందలి రాజకీయసంస్కృతకళాశాలను బ్రవేశించి ఒకసంవత్సరమునం దచ్చటి యుత్తమపరీక్షయందు తేరి ౧౮౭౯-వ సంవత్సరమున నాచార్య పరీక్ష నిచ్చి మఱుసటియేఁట సాహిత్యపరీక్షయం దుత్తీర్ణుండై ప్రభుత్వమువారివలన సాహిత్యాచార్యపదవి నందెను.

అదే సంవత్సరమున నీతనితండ్రి పరలోకగతుం డయ్యెను. కుటుంబమున కలహములు పొడముటచేత నితఁడు కలకత్తాకు పోయి మూఁడుమాసము లచ్చట నుండి తనవిద్యాప్రభావమున పేరు గాంచి మరలి యిలు సేరెను. నాఁటనుండియు నవధానములు చేయుట కారంభించి ధారణాశక్తిని వృద్ధిచేసికొని ౧౬ నిమిషములలో శతకమును రచించుపటిమను సంపాదించి కాశిలోని బ్రహ్మామృతవర్షిణి సభవారివలన నొక రజతపతకమును, 'ఘటికాశతక' బిరుదమును నందెను.

ఇన్ని యుండియు నీతనికర్థము మాత్రము లేకుండెను. కావున నితఁడు ౧౮౮౩లో మధువనమునకుఁ బోయి యచటి విద్యాశాలలో ౩౫ రూపాయల నౌకరీలోఁ బ్రవేశించెను. అచ్చట నుండ నితఁడు సంస్కృతసంజీవనీసమాజమును స్థాపించెను. ఆసమాజము మూలమున నేఁటికిని విహారమునుండి ప్రతిసంవత్సరమును నూర్లకొలఁది విద్యార్థులు సంస్కృతమున శిక్షనంది బయలుదేఱుచున్నారు.

అంబికాదత్తుఁడు మధువనమునుండి భాంకిపురమునకును, అక్కడనుండి ముజఫరుపురమునకును, భాగల్పూరునకును ఉద్యోగధర్మము ననుసరించి పోవలసినవాఁడాయెను. భాగల్పూరునం దుండఁగ సామవత్ నాటకమును సంస్కృతమున రచించి దర్భంగారాజునకు సమర్పించెను. శివరాజవిజయ మనుగ్రంథమునుగూడ నదేభాషయందు రచించెను. ఈసమయముననే ఈతనికి 'భారతరత్న' మనియు, 'శతావధాని' యనియు బిరుదములు లభించెను. అయోధ్యానరేశుఁ డొకస్వర్ణ పతకముతో నితని బహూకరించెను.

ఇట్లు పిన్నపెద్ద లందఱిచేతను గౌరవింపఁబడుచుండిన యీతనికి పాట్నాకళాశాలలో (౧౮౯౬-౧౮౯౯) 'ప్రొఫెసరు'పని దొరకెను. కాని యితఁ డప్పటికే వ్యాధిగ్రస్తుఁ డయియుండినందున నాపదవియం దుండుభాగ్యము నందఁడాయెను. ఈతఁడు ౧౯౦౦ సంవత్సరము నవంబరు ౧౯-వ తేదినాఁడు పరలోకప్రాప్తిఁ జెందెను.

అంబికాదత్తవ్యాసుఁ డాంగ్ల బంగాళిగుజరాతీత్యాదిభాష లెఱింగినవాఁడు. హిందీయందును, సంస్కృతమునందును ౭౯ గ్రంథములను వ్రాసినవాఁడు.

(హిం. కో. ర.)

**అంబితాపల్లి** — గంజాముజిల్లా, కొదోలాతాలూకా ఆరగడజమీన్దారీయందలి గ్రామము. జనసంఖ్య ౩౩౫.

**అంబితాపొల్లి** — గంజాంజిల్లా కొదోలాతాలూకా కల్లికోట జమీన్దారీలోని గ్రామము. జనసంఖ్య ౧౨౯.

**అంబిలిఝోరో** — గంజాంజిల్లా ఛత్రపురంతాలూకా బిరిదిజమీన్దారీలోని యొక గ్రామము. జనసంఖ్య ౯౧.

**అంబివాలీ** — బొంబాయిరాజధానియందలి థానాజిల్లాలో నొక గ్రామము. దీనికి సమీపముననే అంబివాడీ యనుపర్వత గుహ యొకటి కలదు. ఇందు ౮౨ అడుగులపొడువు గలిగి చాల విశాల మయినవసారా యొకటియు, రెండుద్వారములును గలవు. వసారాకు మూఁడు దెసల నాలుగేసిగదులు, నడుమ నొకసింహాసనము నున్నవి. దీనిచుట్టును చిత్రశిల్పసుందరము లైన ప్రాకారపుగోడలు శిథిలమై కడు జీర్ణములై యున్నవి. ఇందలి స్తంభములు మొదలగునవి మనోహరశిల్పములతో నలరారుచున్నవి. ఇవి యన్నియు కొండను దొలిచి నిర్మించినవే. మొత్తముమీఁద నీకట్టడ మంతయు నాసికలోని గుహలపద్ధతి నున్నది. వసారాకు నడుమఁ గలస్తంభములపై నేదియో వ్రాయఁబడియున్నది. కాని యది కొంచెమైనఁ జదువుట కనుకూలముగ నుండలేదు.

**అంబుఆబాదీ** — గంజాంజిల్లా ఆస్కాతాలూకా ధారాకోటజమీన్దారీలోని గ్రామము. జనసంఖ్య కేవలము ౧౬౫.

**అంబుగాం** — ఇది గంజాంజిల్లా ఇచ్ఛాపురంతాలూకా సురంగిజమీన్దారీలోని గ్రామము. దీనిజనసంఖ్య ౨౫౩. ఇదేపేరు గల మఱియొక గ్రామము సోంపేటతాలూకా మందసాజమీన్దారీలో నున్నది. ఇక్కడి జనసంఖ్య ౮౧౪.

**అంబుధార** — తొమ్మిదవ దక్షసావర్ణి మన్వంతరంబు నందుఁ బుట్టఁబోవు ఋషభనామక విష్ణ్వవతారమునకుం దల్లి.

**అంబుమతి** — భారతవర్షీయ తీర్థము.

**అంబులు రెడ్డి** — రంపపితూరీనాయకులలో నొకఁడు. ఇతనినివాసము బోడులూరు. ౧౮౭౯-వ సంవత్సరము జూలై ౧౦-వ తేదీనాఁ డితఁడు రేకపల్లి ప్రజలసాయమున వడ్డిగూడెంపోలీసుస్టేషను ముట్టడించెను. ఆయేఁటినవంబరు నెలలోనే గవర్నమెంటువారు అంబులు రెడ్డిని పట్టుకొనిరి.

**అంబువాహిని** -- భారతవర్షీయనది (భార. భీష్మ. ఆ ౯).

**అంబుశిఖరోపూర్** —గంజాంజిల్లా కోదోలాతాలూకా ఆకగడజమీన్దారీకిఁ జెందిన యొక గ్రామము. జనసంఖ్య ౩౫౩.

**అంబుసోలి** — గంజాంజిల్లా తెక్కలితాలూకాలోని జమీన్దారీ మొఖాసా గ్రామము. దీనిజనసంఖ్య ౪౩౭.

**అంబూదరపల్లి** — చిత్తూరుజిల్లా చిత్తూరుతాలూకా యందలి గ్రామము. ఇక్కడిజనసంఖ్య ౬౫౫.

**అంబేరుపురము** — విశాఖపట్టణముజిల్లా, వీరవల్లి తాలూకాయందలి జమీన్దారీ గ్రామము. జనసంఖ్య ౧,౩౨౬.

**అంబేలా** — బునర్ ప్రదేశమందలి యొకపర్వతమార్గము. వాయవ్యపుపొలిమేరపరగణా (నార్తువెస్టు ఫ్రాంటియరు ప్రావిన్సు) లోని దగు పెషావరుజిల్లాయొక్క ఈశాన్యదిక్కుపొలిమేరకు నావల ఈప్రదేశము ౩౦° ౨౪′ ఉ. కును, ౭౨° ౩౮′ తూ. కును నడుమ నున్నది. పిండారినాయకులలో నొక్కఁడగు సయ్యదు అహమద్ శాహ యనువాఁడు ౧౮౨౪లో నలువదిమందిసహచరులతోఁ గూడఁ బాఱిపోయి పెషావరుజిల్లాకుఁ దగిలియున్న ప్రాంతమునందు యూసుఫై అనుజనులలోఁ గలసి నివాస మేర్పఱుచుకొనెను. అచ్చట నుండి ౧౮౨౭ లో సిక్కులచేఁ దఱిమివేయఁబడినందున నతఁడు కొన్నిదినములు స్వాత్తులో నుండి తుదకు బునరు చేరెను. ౧౮౨౯లో పెషావరు స్వాధీనము చేసికొనెను. పఠాను లయినయతనిశిష్యులాతనిపైఁ దిరుగఁబడిరి. అంత నాతఁ డచ్చటనుండి పాఱిపోయి సింధునది దాఁటి బాలాకోటలో నుండెను. అచ్చట సిక్కులనాయకుఁడైనషేర్‌సింగు అతనిని బీడించి చంపెను. అతనిశిష్యులలో బ్రదికియున్నవారు సిత్తానా యనుపల్లెకుం బాఱిపోయి యచ్చట నీహైందవ తురుష్కులు సయ్యదు అక్బరుషాహ యనువానిని గురువుగ చేసికొని, యచ్చటనే నిలిచిపోయిరి. అప్పటనుండియు నాస్థలము హిందూదేశమునుండి పాఱిపోయినరాజకీయాపరాధులకును, ఘాతుకులకును, సైన్యమునుండి తప్పించుకొని పోయినవారికిని శరణాలయ మయ్యెను. ఇంగ్లీషువారు పంజాబును స్వాధీనపఱుచుకొనినతరువాత నీతురుష్కులవలన వారిరాజ్యమునకు బాధ కలుగఁజొచ్చెను. అందువలన ౧౮౫౩ లోను, ౧౮౫౮ లోను ఇంగ్లీషువారు కొంత సైన్యమును బంపి యీతురుష్కులను కొంతవఱకు వశపఱుచుకొనిరి. వారు సిత్తానాను విడిచి మాల్కా అనుచోట నివసించిరి. అచ్చటనుండియు వారు హిందూదేశమునుండి వచ్చెడివర్తకులను బాధపెట్టంజొచ్చిరి. ౧౮౬౩ లో సిత్తానాలో మఱునివాస మేర్పఱచుకొనిరి. అందుచే నాసంవత్సరమున తొమ్మిదివేలసైన్యముతో సర్ నెవిల్ ఛాంబర్‌లేన్ అనుసేనాధీశుని నింగ్లీషుదొరతనమువారు వారిమీఁదికి పంపిరి. ఈదాడిలో ఇంగ్లీషుసైన్యములోనివా రగుపదునాలుగురు నాయకులును, నలుగురు హైందవనాయకులును, ౨౧౯ మంది సైనికులును హతులైరి. ౬౭౦ మంది గాయపడిరి. మొత్తముమీఁద దాడియొక్కయుద్దేశము సఫలమయ్యెను. బునర్‌నివాసులు వశులైరి. తురుష్కులముఖ్యనివాసస్థలమగుమాల్కాను కాల్చివేసిరి.

**అంబోగామ్** — ౧. గంజాముజిల్లా, సోంపేట తాలూకా మందసాజమీన్దారీయందలి గ్రామము. జనసంఖ్య ౩౨.

౨. గంజాముజిల్లా, ఇచ్ఛాపురం తాలూకా, చీకటిజమీన్దారీయందలి గ్రామము. జనసంఖ్య ౧౩౧.

**అంబోగోడో** — గంజాముజిల్లా, బరహంపురము తాలూకాయందలి గ్రామము. జనసంఖ్య. ౪౫౬.

**అంబోదల** — విశాఖపట్టణముజిల్లాకుచేరిన విస్సంకటకపు 'ఏజెన్సీ' యందలి జమీన్దారీ గ్రామము : జనసంఖ్య ౧,౨౩౨.

**అంబోదోలి** — గంజాముజిల్లా, ఆస్కాతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౭౫.

**అంబోపూవ** — గంజాముజిల్లా, గుమ్సూరుతాలూకా యందలి గ్రామము. జనసంఖ్య ౧,౫౬౯.

**అంబోలీ** — బొంబాయిరాజధానిలోని సావంతవాడి సంస్థానమం దున్న ఆరోగ్యస్థలము. ఇది పడమటికనుమలయంచున సముద్రముకంటె ౨,౩౦౦ అడుగులయెత్తున నున్నది. ఇచ్చటనుండి సృష్టిశోభ చక్కఁగఁ గానవచ్చును. ఇచ్చట నెన్నఁడును ఎండలు విశేషముగా నుండవు. కాలమాన మెప్పుడును సుఖప్రదముగా నుండును. దీని జనసంఖ్య ౧,౩౭౧.

**అంభట** — యునైటెడ్ ప్రావిన్సెస్, అనఁగా ప్రయాగ రాజధానిలోని సహారన్‌పూర్ జిల్లాయందలి నకూర్ తాలూకాలోని యొక గ్రామము. దీనిజనసంఖ్య ౫,౭౫౧. హిందువులకన్న మహమ్మదీయులు రెండురెట్లెక్కువ గలరు. ఇది మొదట మోగలుల సైన్యమునకు నివాసస్థలముగ ఫిరోజ్ షాహ తుఘ్లక్ అనువానిచేఁ గట్టింపఁబడియె. అప్పుడు దానికి ఫిరోజాబాదు అని పేరుండెను. ఇప్పటి పట్టణ మిటీవలఁ గట్టఁబడినది. ఇందు రెండుమసీదులు గలవు. అందొకటి హుమాయూనురాజ్యకాలమునందుఁ గట్టఁబడినది. పదునేడవ శతాబ్దియందు మరణమొందిన శాహ అబ్దుల్ మాలీ యనువానిగోరీ మాచుట కింపుగా నున్నది. ఈపట్టణమునందు తలుపులమీఁద సొగసైన చెక్కడపుఁబని చేసెదరు.

అంభిణి — ఒకదేవకన్య. సూర్యునియొద్ద బ్రహ్మవిద్య నేర్చికొనెను.

అంభిభువు — కాశీరాజుపుత్త్రుఁడు. భారతయుద్ధమునందు పాండవపక్షమున యుద్ధము చేసెను (భార. ద్రోణ. ఆ ౨౩).

అంభోజిని — షాడవ - షాడవరాగము. ఇరువదెనిమిదవ మేళకర్త యగుహరికాంభోజీరాగజన్యము. ఆరోహణావరోహణములయందు సరిగమధనిస - సనిధమగరిస యని సంచారము.

అంభోరుహము — షాడవ - సంపూర్ణరాగము. నలువదినాల్గవమేళకర్తయగు భవప్రియరాగజన్యము. ఆరోహణావరోహణములందు సరిగపధనిస - సనిధపమగరిస యని సంచారము.

అంభోరుహుఁడు — విశ్వామిత్త్రునిపుత్త్రులలో నొక్కఁడు (చూడుఁడు: విశ్వామిత్త్రుఁడు).

అంశము — ౧. రాగాలాపనమున జీవస్వరము: (చూడుఁడు: రాగాధ్యాయము).

౨. నా. ధనంజయుఁడు.

అంశుఁడు — గోకులమందలి కృష్ణబలరాములసఖుఁడు. (భాగ. స్క౧౦. ౧. అ ౨౨).

అంశుధానపురము — భాగీరథీతీరమందలి యొక నగరము.

**అంశుమంతుఁడు** — ౧. ద్వాదశాదిత్యులలో నొక్కఁడు. ఇతని భార్య క్రియ.

౨. (సూ. వం.) ఇక్ష్వాకుకులోత్పన్న సగరరాజపౌత్త్రుఁడు. అసమంజసునిపుత్త్రుఁడు. దిలీపునకుఁ దండ్రి. భగీరథునకుఁ దాత. అసమంజసుం డరణ్యమునకుఁ బోయినతరువాత సగరుఁ డితనిని యజ్ఞాశ్వమును వెదకుటకై పంపెను. ఇతఁడు వెదకుచు కపిలాశ్రమమునకుం బోయి, అశ్వంబును, భస్మీభూతులైన అఱువదివేలమందిపినతండ్రులను జూచి వారి నుద్ధరించుకొఱకై, కపిలుని ప్రార్థన సేయుచు నిలువబడియుండెను. కొంతతడవునకుఁ గపిలుండు సమాధినుండి ముక్తప్రసన్నుఁడై యితనికి సగరునియశ్వం బొసంగి తాతచే నశ్వమేధంబును పూర్తిచేయింపు మని యాజ్ఞ నొసంగెను; సగరపుత్త్రుల నుద్ధరించుటకు భగీరథుని ప్రార్థింపు మని చెప్పెను. అంత నంశుమంతుఁ డశ్వమును దీసికొనిపోయి సగరునిచే నశ్వమేధంబును చేయించెను. సగరుఁ డీతనికి రాజ్యంబు నప్పగించి యరణ్యంబునకుం బోయెను. ఇతఁడు రాజ్యభార మంతయు మంత్రులపై నుంచి గంగావతరణమునకై తప స్సొనరించెను గాని యిష్టసిద్ధి యగుటకుఁ బూర్వమే దేహమును విడిచెను. పితరులకన్యయైన యశోద యితని భార్య (భార. వన. అ. ౧౦౭); (వా. రా. బాల. స. ౪౧-౪౨)

౩. ద్రౌపదీస్వయంవరంబునకుం బోయిన రాజులలో నొక్కఁడు.

౪. పాండవవంశీయ రాజు. భారతయుద్ధమునందు నర్జుననిచేఁ జచ్చెను.

అంశుమతి — భారతవర్షమందలినది. కాళిందికి నీపేరు గలదు (వా. రా. అయో. స. ౫౫).

అంశుమద్భేదము — దేవాలయములు, భవనములు, దేవతావిగ్రహములు మొదలయినవానిని నిర్మించుటనుగూర్చినవివరములను బోధించు నొకపుస్తకము.

అంశువర్మ — క్రీ. శ. ౭-వ శతాబ్దియందు నేపాళదేశము నేలినరాజు. మొదట నితఁడు ఆదేశమునకు రాజుగ నుండిన శివదేవుఁ డనువానికి సామంతుఁడై యుండి యటుపై నొకమాఱు శివదేవుఁడు శత్త్రువులతోడి పోరాటమున మునిఁగియుండినయదను గనిపట్టి నేపాళరాజ్యసింహాసన మాక్రమించుకొనెను. ఇతనిపరిపాలనకాలము ప్రాయికముగ ౬౧౦-౬౪౬ వి యుండవచ్చును. అంశువర్మ గొప్పపండితుఁడు, శివభక్తుఁడు.

అంశువు — ౧. అశ్వినీదేవతలయాశ్రితుఁడు. (ఋగ్వే. ౮. ౫. ౨౬).

**అక్‌సంకర్** — ఇతఁడు లాహోరునగరమునకుఁ జెందిన వీరాగ్రేసరులలో నొకఁడు. క్రీ. శ. ౧౨౪౦-వ సంవత్సరమునందు మంగోలియాజాతివారు హిందూదేశమునందుఁ బ్రవేశించి లాహోరు నగరముపైఁ బడఁగా దత్కాలమున పాలకుఁడైన మలిక్ ఇక్తియార్ ఉద్దీన్ కారాకష్ శత్రువుల నెదిరింపఁగల సన్నాహమున లేకుండెను. కావున మంగోలులు అదను దొరకినందులకు మిగుల సంతసించుచు లాహోరును నాశన మొనరింపసాగిరి. ముసల్మానుల రెండుకత్తులుమాత్రము మంగోలుల నెదిరించినవి. వానిలో నొకదానికి అక్‌సంకర్ నాయకుఁడు. ఇతఁడు టైర్ అను మంగోల్ సేనానితోడ నతి ఘోర

యూను మరణించెను. అప్పటికి అక్బరునకు వయస్సు ౧౪ వత్సరములు. చిరకాలముననుండి సుఖదుఃఖములయందు హుమయూనును విశ్వాసముతోఁ గొలిచిన బహరాంఖా ననునతఁడు అక్బరునకు మంచి చెడ్డలు తెలుపుగురువుగా నుండెను. బహరాంఖాను వ్యక్తిపరుఁడు. హుమయూను గతించినవార్త బయ లెక్కినతోడనే వలయునుద్యోగపు మార్పులను సలిపి అక్బరునకుఁ బట్టము గట్టెను. కాని పసివాఁ డగు అక్బరు నామమాత్రముగా బహరాంఖానే యావత్పరిపాలనాకార్యమును నిర్వహించుచుండెను.

అక్బరునకుఁ బట్టాభిషేకమగునప్పటికి ఆగ్రా, ఢిల్లీ ప్రాంతములు రెండుమాత్రమే ఢిల్లీశ్వరునియేలుబడికి లోఁబడియుండెను. తక్కిన భరతఖండ మంతయు నాయాప్రాంతీయపాలకులకు స్వాధీనమై, మొగలుసామ్రాజ్యమునం దణఁగియుండక చీలిపోయెను. ఇంత స్వల్పవిస్తీర్ణముగల రాజ్యమండలమున కభిషిక్తుఁ డయిన అక్బరు తన యేఁబదియేండ్ల ప్రభుత్వకాలములో అఫ్ఘాన్ సంస్థానము మొదలు ఆసామువఱకును, దక్షిణమున అహమదునగరపర్యంతమును వ్యాపించి శత్రువులకుఁ దేఱిచూడరాక శాంతినిర్భరమగు మహాసామ్రాజ్యమును స్థాపించెను. అన్ని వైపులను గలవరములకవకాశము లుండెను. సూర్ వంశపురాజులు పానిపట్టు సంగ్రామమున నోడిపోయిరి. కాని వారిపరాభవజ్వరము రాజ్యకాంక్షను మఱింత యెక్కుడుగఁ దీవ్రపఱిచెను. తఱి నిరీక్షించుచు నీశత్రుసంతానము పంజాబుమండలమునఁ గాచుకొనియుండెను. హిమూ అను హైందవసచివుఁడు ప్రేరేప మున్ను పాఱిపోయిన మహమ్మద్ షాహ తూరుపుదెస నపారసైన్యమును సేకరించుచుండెను. అఫ్గానుస్థానమునందు సరదారులు తిరుగఁబడుట కుద్యుక్తులయి యుండిరి. అక్బరునకు మాఱు బహరాంఖానే సర్వసామ్రాజ్యమును నిర్వహించుచుండె నని చెప్పఁబడినది; కాని ఈ సంవిధానమువలన రాఁగల మేలు కీళ్లు రెంటిని అక్బరు కడు జాగరూకతతో నాకళింపు చేసికొనెను. అనుభవపరిణత మగు బహరాంఖానునిరాజ్యపాలనాచాతుర్యము తటస్థముగ నున్న అక్బరునకు విలువ యిడఁజాలని యపరిమితజ్ఞానకౌశలముల నిచ్చెను. బహరాంఖానునిరాజ్యకాంక్షౌదాహ మొకనాఁడు కాకపోయిన మఱియొకనాఁటికయిన బలవచ్చికిత్సం గాని శాంతింప దని యాతనికిఁ జక్కఁగా బోధపడెను. కాని ఆజన్మబుద్ధికుశలుఁ డగుటచే నక్బరు కాలధర్మములను బాగుగ గుర్తించి అద నన్వేషించుచుండెను. అక్బరు, బహరాంఖాను లిరువురును సైన్యసమేతముగ మొట్టమొదట పంజాబునందలి సంక్షోభము నణఁచుటకై యేఁగిరి. అంబాలాపట్టమునొద్ద జరిగినయుద్ధమున సికందరుసాహ యోడిపోయెను. కాని తూరుపుననుండి పాదుషాహ సమేతముగా హిమూ ఆగ్రాపట్టణమార్గమున ఢిల్లీనగరమున ప్రవేశించి అక్బరు, బహరాము లిరువురును లేనితఱిని గోట నాక్రమించుకొనెను. ఈయుదంతము నక్బరు వినినవెంటనే తన సైన్యమును ఢిల్లీవైపునకు మరలించెను. ౧౫౫౬-వ సంవత్సరము నవంబరు ౬-వ తేదీని అక్బరు, హిమూసైన్యసమూహములకు దారుణ మగు పోరాటము జరగి, హిమూ బంధింపఁబడుటతోఁ బూర్తి యయ్యెను. హిమూ కడు పరాక్రమవంతుఁడు: కార్యదక్షుఁడు. స్వకీయములగు బుద్ధికౌశలములచేతనే ఢిల్లీశ్వరున కాస్థానమంత్రిపదవి నార్జించి, వాసికెక్కిన హైందవశ్రేష్ఠుఁడు. యుద్ధరంగమున బంధింపఁబడినహిమూను శిరఃఖండన మాచరింపు మని బహరాంఖా నక్బరునకు సూచించెను; కాని దయార్ద్రహృదయుఁ డగు నాతఁ డాక్రౌర్యమునకు గొడిఁగట్టలేక జంకెను. అపుడు బహరాంఖానే దయానికృష్టమగు నాయవశిష్టమును దీర్చెను. అంత నక్బరు నిర్భయముగా ఢిల్లీసింహాసనము నెక్కెను. సికందరుషాహ శరణు చొచ్చినందున నాతని కభయ మొసంగి సికందరుషాహపుత్త్రునకు నున్నతమగు నుద్యోగము నిచ్చెను. సర్వాధికారధూర్వహుఁ డగు బహరాంఖాను కాలక్రమమున రాజ్యాంగభారము నక్బరున కీయఁడయ్యెను. అక్బరుచక్రవర్తి నామమాత్ర మయ్యెను. బహరాంఖా నన్నింటను దక్షుఁడుగా మెలఁగుచుండెను. ఆతని యధికారరక్తి యంతకంతకు హెచ్చెను కాని అక్బరుశ్రేయస్సు నెంచి తగ్గనయ్యెను. ఆసంవిధానము మఱికొంత అట్టులే నడచిన రాఁగల కష్టములను అప్పుడే దూరదర్శి యగునక్బరు యోజించి కనుఁగొనెను. కావున నాతఁడు బహరాంఖానుని తొంటిపదవినుండి తొలఁగించెను. అక్బరొనర్చినయీరాజనీతికృత్యము బహరాంఖానునకుఁ బరాభవతుల్యముగాఁ దోఁచెను. తోడనే యతఁడు పైకిఁ గవిసి యుద్ధసన్నద్ధుఁ డయ్యెను; కాని దైవ మన్యథా తలఁచి యక్బరునకు జయము గట్టియిచ్చెను. ఓటమిం జెందినబహరాంఖానున కధికారభ్రష్టతపై నీపరాజయము మఱింత ఖేదదైన్యములు దాకొల్పెను. అంత గత్యంతరము లేమి నతఁడు అక్బరుపాదుషా శరణుఁ జొచ్చెను. అక్బరుగూడ నపరాధి యయ్యు విశ్వాసపాత్రుఁ డగు ఖానును క్షమించి వలయుసంపత్తుల నిచ్చెను; కాని వాఁ డం దుండక వయోవృద్ధుఁ డగుటచే మక్కాయాత్రకు బయలుదేఱిపోయెను. ఖురానుమతప్రవర్తకుల కెల్ల సేవ్యమగు మక్కాక్షేత్రపు సందర్శనముగూడ ఖానునకుఁ బొసఁగనది కాదు. నడుమ నెవఁడో యొకతురుష్కుఁ డీఖానుని నఱకి చంపెను (౧౫౬౧).

కల్లోల ప్రారంభము

రాజ్యగహనమునందుఁ గల్లోలకంటకము లనేకములు. మాల్వాప్రాంతీయవాటిక బాజ్ బహద్ద రనువానికి నధీనమై యుండెను. వాఁ డున్మత్తుఁడై ఢిల్లీశ్వరునియానతి నిరాకరించెను. అందువలన ఆదంఖాన్ అను నక్బరుసరదారాకల్లోలము నణఁపఁబోయెను; ఆదంఖాను స్వామికార్యమునం దప్రమత్తుఁడై, పోయిన కార్యమును జయప్రదముగ సాధించెను; కాని అతఁడు స్వార్థలుబ్ధుఁడు: దొరకినసొత్తు నంతయు తనసొంతబొక్కసమునఁ బోసికొనెను. మఱియు విషయకిరాతుఁడై బాజ్ బహద్దర్ ధర్మపత్నిని గామించి బలవంతపెట్టెను. ఆసాధ్వి యాదుర్మార్గునిబారిం బడక యాత్మహత్యం జేసికొనెను. ఈపాపకృత్యము లక్బరుచెవిని బడినతోడనే యాతఁ డాదంఖాను నధికారముననుండి తొలఁగించి, వానిదాఁపుడు

రెండవ తిరుగఁబాటు

భోక్తసమును కొల్లగొనెను. ఆపాపిష్ఠిఖాను దుర్మార్గపుటాగడ మంతకును నంతరింపమిఁ దుదకు చంపించెను. ఈ కఠినశిక్ష యన్యాయమునకుఁ బ్రాణగొడ్డమై తరువాతికాలమును ధర్మవంతముగఁ జేసెను.

అప్పటికి బంగాళదేశముకూడ శత్రుపక్షమువారి యధీనమందే యుండుటచే నచటఁ బ్రజాక్షోభము లంకురించెను. ఖాన్ జమాన్ అను నక్బరుసేనానాయకుఁ డాకల్లోలముల నాఁగఁబోయి, తాంత్రికు లగుకొందఱు సరదారులవలలకుం జిక్కి స్వామిద్రోహమునకు ముందంజవేసెను; కాని అక్బరు స్వయముగా వర్షఋతువున (౧౫౬౬) నమోధ్యాప్రాంతమునకు దాడివెడలి యచటి యుద్రేకము నణుగంటఁ ద్రొక్కెను. ఖాన్ జహాను జంపఁబడియెను.

బంగాళదేశము

హకీం మీర్జా యనువాఁ డొకఁడు కాబూలుప్రాంతమునం దంతఃకలహములు రేపఁజూచెను. కాని అచట నీతని యాటలు సాగలేదు. అందువలన నాయాశ వదలి పంజాబుదేశము నాక్రమింప యత్నించెను. అక్బరు పంజాబుదేశముపైకిఁ బోయినప్పు డీతనిఁ బాఱఁదోలెను. ఇవిగాక ఉజీబక్ అనునొక తెగసరదారులయుపద్రవపు తిరుగఁబాటు అక్బరుప్రథమరాజ్యకాలమును మిక్కిలి యాందోళించెను. ఐనను జాగ్రన్నైపుణములుగల అక్బరుబుద్ధిబలవైభవమే యన్నిటి నన్నివిధముల నధఃకరించి స్వకీయరాజ్యప్రతిష్ఠాపనము నేమూలను సడలనీక కాపాడెను.

అక్బరుచక్రవర్తిరాజ్యజీవితరూపకమునందు ద్వితీయాంక మెల్లఁ బరాక్రాంతివిజృంభణమునందే వికసించినది. అక్బరునకు ముందు హిందూదేశమున విడిసినతురుష్కుల కెల్ల రణదాహమును, మతోన్మాదమును మిక్కుటముగ నుండినవి. పాక్షికదృష్టినిరతు లగు నాతురుష్కు లొనర్చిన కసాయిచెయిదములు వైదేశికవిద్వేషభావము నంకురింపఁజేసెను; కాని చిరకాలస్థాయి యగువిశాలసామ్రాజ్యమునకుఁ బునాది వేయఁజాలవయ్యెను. హైందవసంఘశరీరమునకు రాజపుత్త్రకులము మాంసపుకండవంటిది. వైదేశికులగు తురుష్కులకు మొట్టమొదటనే యీరాజపుత్త్రకులము శత్రువర్గ మయ్యెను. ఈ శత్రువర్గమును సాధించుట సుకరకార్యము కాదు. రాజపుత్త్రరాజ్యములబాంధవసానుభూతు లొందవకున్న దృఢముగ యావద్భరతవర్ష సామ్రాజ్యస్థాపనమున కవకాశము లేదు. ఈనైతికరహస్యమును కుశాగ్రబుద్ధి యగుఫాదుషా చక్కఁగా గ్రహించెను. అక్బరు కాలమునం దన్నియెడలను జతురుపాయములకంటెఁ జతురోపాయములే యెక్కుడు ప్రసక్తిగలిగి యాదరణీయము లైనట్లు విమర్శకునకు గోచరింపకపోదు.

అక్బరు ౧౫౬౧-వ సంవత్సరమున అజమీరునందలి యొక సుప్రసిద్ధక్షేత్రమును సందర్శింపఁబోయెను. ఆకాలమున జయపుర సంస్థానమును పూర్ణమల్లు అనురాజపుత్త్రవంశజుఁ డేలుచుండెను. అతఁడు ఫాదుషాతో వియ్యమున కియ్యకొని తనకుమారి నిచ్చి కల్యాణము జరపెను. తురుష్క రాజపుత్త్రసాహచర్యమున కిదియే మొదలు. తరువాతఁ బూర్ణమల్లుఁడు, నతనిపుత్త్రుఁడును అక్బరుసైనికోద్యోగముల విశ్వాసపదవుల నందఁగలిగిరి.

అక్బరు,
రాజపుత్ర రాజ్యములు

అజిమీరును వదలి చనుటకు ముందు మీర్జా షర్ఫుద్దీను అను నాయకుని మెర్తా యనుకోటను ముట్టడింపఁ బంపెను. అప్పటికి మెర్తాకోట మార్వారురాజునధీనమునం దుండెను. మెర్తాకోట నాక్రమించుట యోజించినంత సులువుగా లేకపోయెను. రెండునందల మైళ్లు దూరము ఫాదుషాయును, సహచరు లగునాలుగురు సరదారులును హుటాహుటిం బోయి చేరిరఁట. తీవ్రమగు పోరాట మావహిల్లి, తుదకు ఎట్టులేని కోట ఫాదుషావశ మయ్యెను. మేవాడ్ కుటుంబము రాజపుత్త్రకుటుంబములలో నగ్రగణ్య మైనదిగా వన్నెకెక్కినది. వారిసంస్థానము చితోడ్‌గఢము. మేవాడ్ రాజు లరిగాపు లైనఁగాని విశాలహైందవసామ్రాజ్యమునకుఁ బూర్ణస్వామ్యము లేదని అక్బరుతలంపు. ఈకాంక్షతో నతఁడు చితోడ్‌గఢముపై రెండు దండయాత్రలు సలిపెను. అందు మొట్టమొదట మోహరించి నిలిచిన ఉదయసింహకళత్ర మగు వీరాబాయియెదుట తలకట్టలేక యోడిపోయివచ్చెను. కాని దీక్షాశాలి యగునక్బరు ఎట్టకేలకు చితోడ్ సంస్థానమును వశపఱచుకొనె నని చరిత్రకారులు వ్రాసినారు. కాని దేశ మాక్రమింపఁబడినను దేశపుత్త్రులు వశంవదులు కాక ఉదయపుర మను వేఱొకనూతనరాజపుత్త్రదుర్గమును బ్రతిష్ఠించుకొనిరి. ఈమాత్సర్యవహ్ని తరువాతఁ జాలఁగాల మారక, ఆశాంత దగ్ధముగఁ బ్రజ్వరిల్లినసమయములు కలవు.

అనంతరము ఫాదుషామాపు టెఱకు గుఱియైనది గడామండలము. ఇదియును రాజపుత్త్రసంస్థానమే. ఆదాయమునందును, వైశాల్యమునందును అంత గొప్పది కాదు. ఐనను ఆకాలమునం దీ చిన్నరాజపుత్త్రసంస్థానమును బరిపాలించుచున్న దుర్గావతినిరుపమకీర్తియే చక్రవర్తి యగు అక్బరుఫాదుషాకు మాత్సర్యహేతు వయ్యెను. రాజపుత్త్రికులములు తేజోవీర్యములతో నైక్యములై ప్రదీపించిన మహాక్షాత్రజీవితమునకుఁ బాత్రములైనవి. వీరి జాతీయచరిత్రాకాశమునందు నిష్కలంకతారాపఙ్క్తివలె నేఁటికిని దేశపుత్త్రికా జీవితావళి ప్రకాశించుచున్నది. అట్టి తారకాగణమునందు దుర్గావతి నాయకమణియనఁ దగును. మహాచక్రవర్తి యగునక్బరునకును, ఒకచిన్న సంస్థానమునకుఁ బ్రభ్వియైన దుర్గావతికిని జరగినపోరాటము మహాకవుల కుజ్జీవభిక్షఁ బెట్టఁదగి యున్న దనినం జాలును. కరుణాబీభత్సమయమగు నామహారాణిపవిత్రచరిత్రమును శ్రీమతి అచ్చమాంబగారు ప్రాణాక్షరములతోఁ జిత్రించినారు. రాణి దుర్గావతి వీరస్వర్గ సోపానములం బట్టుటయు, అక్బరుఫాదుషాహ గడాదుర్గప్రాకారములపై మొగలుపతాక నెత్తించుటయుఁ జరిత్రాంశములు.

రణతంభోర్, కలింజర్ అనుదుర్గములు ౧౫౬౯-వ సంవత్సరములో నీతనియేలుబడిక్రిందికి వచ్చెను. ౧౫౭౦-వ సంవత్సరమున అక్బరు

నకు ద్వితీయరాజకన్యావివాహ మబ్బెను. ఎడతెగని యుద్ధయాత్రలలో మునిఁగి తేలుచున్న ఫాదుషాహకు సిక్రీపట్టణమున నిరువురుకుమారులు కలిగిరి. వారికే వరుసగా సలీమ్, మురాద్ అను పేరులు పెట్టిరి. ౧౫౭౨-వ సంవత్సరమున డానియల్ అను తృతీయపుత్త్రుఁడు జన్మించెను.

గుజరాత్

అక్బరు తరువాత నోడించికొనినరాష్ట్రము గుజరాత్ (౧౫౭౨). దేశమంతయు నరాజకమై యుండెను. పాలెగాండ్రు పరస్పరము మత్సరులై యంతర్వ్యూహములఁ బన్నికొనఁ దొడంగి యుండిరి. ఇట్టితఱి నరసి ఢిల్లీశ్వరుఁ డీదేశము నతిచమత్కారముగా నాక్రమించెను. కాని పునరాందోళనము లేకపోలేదు. ఐనను పరినిష్ఠాపరుఁ డగునక్బరు గుజరాత్ మండలమున మోగలు-అధికారము శాశ్వతముగ నెలకొల్పి, అచటిభూముల నన్నింటిని కొలచి ఆదాయపరిమితి నేర్పఱిచెను. అప్పుడు తోడర్‌మల్లు అను ఆర్థికశాస్త్రకుశలుఁ డీపనికి నియమింపఁబడెను.

కాబూలు, కాశ్మీరములు

కాబూలునకు నధిపతిగా నున్న మహమ్మదు హాలీ మనువాఁడు అక్బరునకు సవతియన్న యగును. అతఁడు సన్నిహిత మగుపంజాబీ మండలమును గబళింప యత్నించెను. ఆకాలమున నచటఁ బ్రాంతీయపాలకుఁడుగా నున్న రాజా మానసింగు హాలీముతోడిపోరాటమునకుఁ దాళలేనందున ఫాదుషాహాయే స్వయముగా సేనల నడపించి వాని నోడింపఁబోయెను. కాని హాలీము అక్బరురాక నడిగట్టి తనస్వదేశమునఁ దూఱెను. అక్బరుకుమారుఁడు మురాద్ హాలీమును వెంబడించి తఱిమి, తుద కోడిపోయెను. అందుపై అక్బరు స్వయముగాఁ గాబూలున కేఁగి యాతనిఁ బరాభూతునిఁ జేసెను. వాఁడు శరణు చొచ్చి, అభయప్రదాత యగు ఫాదుషాహావలన మరల తన రాజ్యమును తాను సంపాదించుకొనెను. పిదప నచిరకాలముననే హాలీము చనిపోయినందున కాబూలుఖండ మంతయు మోగలు రాజ్యమున సంక్రమించెను.

కాశ్మీరమునకుఁ జక్కఁదనమున భూలోకనందనవన మనునలంకారనామాంతరము కలదు. సింగారమునందే కాక సిరిసిందూరములం గూడ నీకాశ్మీరభూమి రతనాలపంట యని వర్ణింతురు. అక్బరున కీమోహనమండలమును స్వీకరింపవలె ననునభిలాష దృఢముగ నుండెను. కాశ్మీరదేశమునందుఁ గలవరములు బయలువెడలిన వని విని ఫాదుషాహ భగవాన్‌దాసుని సేనాధిపత్యముక్రిందను గొంతబలమును బంపెను. కాశ్మీర మంతయు మనోహర మగులోయలో నున్నది. నిరంతరాయము లగుమార్గములు లేవు. పర్వతమాలిక లధికము. అరణ్యపుభూములు విశేషము. అందువలన భగవాన్‌దాసుఁడు కాశ్మీరమునందుఁ గృతప్రయత్నుఁడు కాలేకపోయెను. రెండవమాఱు కాశింఖాను నంపెను. ఆతఁడు కాశ్మీరరాజతిలకుని బంధించి కొనివచ్చెను. అప్పుడు వానికొక జాగీరు నిచ్చి అక్బరు చిరకాలవాంఛిత మగుకాశ్మీరరాష్ట్రమును స్వీకరించెను.

అఫ్గానుల అల్లరులు

౧౫౮౬-వ సంవత్సరమున రాజా వీరబలుని యాధిపత్యముక్రింద ఢిల్లీశ్వరుని సైన్యములు కొన్ని అఫ్గానులమీఁదికిఁ బోయెను. అఫ్గానులు పర్వతీయులు. హిందూకుశపర్వతపఙ్క్తులు వారి కాశ్రయములుగా నుండెను. మోగలుసేనలు అఫ్గానులోయలలోనికి వచ్చినతోడనే ఈకొండతురకమూఁక లన్నివైపుల నావరించి, యడ్డగించెను. ఎనిమిదివేల సైన్యసమూహముతో వీరబలాదినాయకు లా కొండలనడుమఁ బడి మడసిరి. ఈ విషాదవార్త ఢిల్లీశ్వరునిచెవి సోఁకెను. తోడనే యతఁడు యుద్ధకుశలు లగు రాజా తోడరుమల్లు, రాజా మానసింగ్ మున్నగు ఆరితేరినసరదారులను సోపబలముగాఁ బంపెను. కాని దుర్గమనివాసు లగునాయఫ్గానులతో నెంత పెనఁగులాడినను విజయము సందిగ్ధ మగుచునే యుండెను. కావున ఫాదుషాహకు సంధి చేసికొనక తప్పినదికాదు.

అఫ్గానులతో యుద్ధము నడచుచుండఁగా సింధుదేశమునందుఁ బ్రాంతీయకలహములు తలసూపుట అక్బరునకుఁ దెలియవచ్చెను. ఆకాలపుప్రాముఖ్యమును జక్కఁగ గుర్తించి అక్బరు మీర్జాఖాన్‌అనుసరదారునకు బలవత్తరమగు సేన సహాయ మిచ్చి లాహోరుననుండి పంపించెను. జానీబేగ్ అనుపారసీకపురాజు అపుడు సింధుదేశమున కధినాథుఁడుగా నుండెను. మోగలుసార్వభౌముని ముట్టడింపుమూఁకల రాక విని జానీబేగ్ పన్నెండుమైళ్లు ఎదురువచ్చి ప్రతిఘటించెను. చక్రవర్తిసైన్యములకంటె నప్పటిసింధుపాలకుని యాయత్తదళమే అధికముగ నుండెను. ఐనను ప్రొద్దు గ్రుంకిన చీఁకటి సాఁకుఁ జేసికొని తురుష్కసేనావళి కోటను చుట్టుముట్టెను. జానీబేగ్ ప్రతిరోధపక్షముఁ బూని మిగుల జాకరూకుఁడై మెలఁగెను; కాని తుదకు వైరులయుపాయాంతరమునఁ బట్టువడెను. మోగలులస్వేచ్ఛానుసారముగ సంధి నడచెను. తరువాత జానీబేగ్ తనరాజ్యమునకు నీళ్లు వదలి మోగలుసార్వభౌమునిక్రింద నొకయధికారపదవియందుఁ గుదిరెను.

అక్బరుతండ్రి యగుహుమయూను కాందహారమును జయించుటకు పరిషియారాజులసైన్యములను సాహాయ్యముగాఁ దెచ్చికొనెను. కాందహార్ వశమైన పిదప పరిషియాదేశపాలకుల కిచ్చివేయునట్లు అప్పటియొడంబడిక; కాని హుమయూను కాందహారమును జయించి వెనుకటిపరిషియారాజుసమయమును సంపూర్తి చేయఁడయ్యె. పరిషియాదేశమునందలి యాంతరంగికవ్యవస్థలును అప్పటప్పట నస్తిమితములై యుండుటచే నాదేశపుషాలును కాందహారముమాట తలపెట్టరైరి. తరువాత కొలఁదికాలముననే కాందహారము పరిషియాదేశమునందుఁ గలసిపోయెను. చేఁజిక్కి జాఱిపోయినరాజ్యమాణిక్యమును ఢిల్లీశ్వరుఁడు విడిచియుండువాఁడు కాఁడు. ౧౫౯౪ వఱకుఁ బరిషియాదేశపుషా లనుభవించినకాందహారును తుదకు సులువైనపన్నాగముఁ బన్ని మోగలుసామ్రాజ్యములోనికిఁ జేరఁదీసి అతఁడు కృతకృత్యుఁడయ్యెను.

అక్బరు ఢిల్లీసింహాసన మధిరోహించినది మొదలు దాదాపుగ ౪౦ యేండ్లు నిరంతరదండయాత్రాపరుఁడై కడపెను. తత్ప్రతిఫలముగ నపరిమితములగు మొగలురాజ్యవైభవాధికారములు విస్తరించెను. ౧౫౭౬-వ సంవత్సరమునకు తూర్పున బంగాళాఖాతము మొదలు పడమట అరేబియాసముద్రమువఱకును, సింధు అఫ్గానిస్థానసమేతముగ నర్మదోత్తరభూసీమ యెల్ల మొగలుసామ్రాజ్యధ్వజము క్రిందఁ జెలఁగుచుండెను.

దక్కను దండయాత్ర

ఇఁక మిగిలినవి దక్షిణకర్ణాటకరాజ్యములు. పాదుషాహ యీ దక్షిణహిందూదేశము నాక్రమించుకొనవలె నని చిరకాలముననుండి కన్ను వేసియుండెను. మొత్తముమీఁద నక్బరు దక్షిణ దిగ్విజయమున కేతత్ప్రాంతీయపాలకులపరస్పర వైషమ్యభేదములు చాలవఱకుఁ దోడుపడె నని చెప్పక తప్పదు. రాజకీయములగుతగవులకు షియా, సున్నీలయన్యోన్యబద్ధమాత్సర్యములు మఱింత నాశన విషమును బోసినవి. అహమ్మద్‌నగరము, విజాపురము, ఖాన్‌దేశము, గోలుకొండ యనునవి యప్పటి దక్షిణతురుష్కరాష్ట్రములు. ౧౫౯౧-వ సంవత్సరమున అక్బరుచక్రవర్తి తనఢిల్లీశ్వరసార్వభౌమత్వము నొప్పికొను మని యీ దక్షిణభూపాలకుల నాదేశించెను. ఖాన్‌దేశపు సుల్తాను వెంటనే అక్బరుసార్వభౌమత్వము నంగీకరించెను. మిలిగిన రాష్ట్రపతు లాతని ఢిల్లీశ్వరత్వమునకుఁ దల లొగ్గరైరి; ఖాన్‌దేశపు సుల్తాను తనకుఁ బాళెగాఁ డగుటచే బురహాన్‌పురముఖద్వారమున దక్షిణదేశమును జొచ్చుట కక్బరుచక్రవర్తికిఁ జక్కనియుపాయసాధనము లభించెను. ౧౫౯౫-వ సంవత్సరమున అక్బరుపుత్త్రుఁ డగు మురాద్ అహమ్మద్‌నగరమును ముట్టడించెను. కాని మొగలుశిబిరమునందలి యంతః కలహములు సంతాపకరము లయ్యెను. తోడవచ్చిన బహరాంఖానుపుత్త్రుఁ డగు అబ్దుర్‌రహీం అనునాయకునకును, మురాదునకును మనస్తాపము లుదయించెను. ఎదిరిపక్షమున సుల్తానా చాంద్‌బీబీతురుష్కవీరవనిత చేతఁ గత్తిఁ గొని లేఁతయరఁటితోఁపును బలె మొగలు సైన్యమును నఱకసాగెను. యుద్ధ మతిసంకులమై తుదకు సంధి జరగెను. బీరార్‌దేశము నిచ్చివేయుటకు చాంద్‌బీబీ యొప్పుకొనెను. మురాద్ ముట్టడి వదలిపోయెను. కాని అహమ్మదునగరలక్ష్మికి వీరమాత యగు చాంద్‌బీబీసాధ్వీత్వ మెంతకాలమో యనుభవింప నోదవినది కాదు. చాందుబీబీ నెవ్వఁడో కత్తివాతఁ బొడిచి, అహమ్మదునగరరాజ్యము నరాజకమయముచేసెను. ౧౬౦౧-వ సంవత్సరమున అక్బరుకడగొట్టుకొడుకు డానియల్ అనువాఁడు మరల దండెత్తి అహమ్మదునగరమును మొగలుసామ్రాజ్యమునఁ గలిపెను.

అసీర్‌గఢ దుర్గము

ఖాన్‌దేశమునం దీమధ్యకాలమునఁ గొన్ని స్థానికవిప్లవము లుప్పతిల్లెను. తత్ ప్రతిఫలముగ ముందు పాలిగాపుతనమున కొప్పికొనిన ఆ సుల్తాను మరలఁ బ్రతికూలుఁ డయ్యెను. అసీర్‌గఢము కోట బురహాన్‌పురమునకు నీశాన్యదిక్కున సాత్పురాదుర్గావళి నానుకొని దక్కనురహదారికిఁ బ్రవేశకవాటమువలె నున్నది. ఇది ఖాన్‌దేశపాలకుని క్రింద నుండెను. సార్వభౌమికసేనల కీకోట స్వాధీనపఱుచుకొనుట విధ్యుక్తముగాఁ దోఁచెను. అందువలన గొప్పముట్టడి జరగెను. ఆపోరాటము (౧౬౦౦) పదునొకొండుమాసములవఱకును బూర్తి కాకపోయెను. అహమ్మద్‌నగర్, అసీర్‌గఢదుర్గముల నాక్రమించుటయే అక్బరుచక్రవర్తి దిగ్విజయకథనమును ముగించుచున్నది. కడచిన కొలఁదిసంవత్సరములును అక్బరుజీవితవికాసము మనస్తాపశోకవిచ్ఛిన్నమై కష్టభూయిష్ఠముగఁ బర్యవసించెను. దక్షిణహిందూస్థానమును గూడ ఢిల్లీశ్వరునిసార్వభౌమికతకు లోఁబఱిచి అక్బరు తనచరమదశాశాంతివేళ కాగ్రాపట్టణమును జేరెను.

చరమదశ: గృహకల్లోలములు, పుత్త్రవియోగము

అక్బరు దక్కనుప్రాంతమునం దుండఁగా రెండవ కుమారుఁ డగు మురాదు దుర్వ్యసనజాడ్యమునకుఁ బ్రథమకబళమై యాకస్మికమరణము నందెను. ౧౬౦౪-వ సంవత్సరమున సాటిలేనివైభవముతోఁ బెండ్లిపేరంట్రములు సలిపిన మూఁడవకొడుకు డానియల్ మద్యపానప్రమత్తుఁడై చనిపోయెను. జ్యేష్ఠకుమారుఁ డగు సలీము మృతిఁ జెందినసోదరులకన్న దురభ్యాసదుశ్శీలములయందుఁ దక్కువరక్తి గలవాఁడు కాఁడు; కాని బలిష్ఠకాయుఁడు. దుర్వ్యసనలంపటుఁడు. రాజ్యకాంక్షాప్రియుఁడు. క్రూరమగు నీతని నైజమును గనిపట్టి రాజపుత్త్రికల్లోలముల నాఁగుటకై అక్బరు తఱచుగా నీతనిని బంపుచుండెను. కాని సలీము విధేయుఁడై చరించువాఁడు కాఁడు. తుదకు ౧౬౦౧-వ సంవత్సరమున తెగించి బీహారుబొక్కసమును స్వాధీనపఱుచుకొని అలహాబాదునగరమున చక్రవర్తిబిరుదమును వహించెను. సలీముయొక్క అపాత్త్రవ్యవసాయ మింతటితో ముగిసినది కాదు. ౧౬౦౨-వ సంవత్సరమున ఆగస్టునెలలో నొకబుందేలాఘాతకునిచే అబుల్‌ఫజలును త్రోవ గాయించి చంపించెను. అబుల్‌ఫజల్ అక్బరునకుఁ బ్రాణమిత్త్రుఁడు. జ్ఞానోపాధ్యాయుఁడు. మహావేదాంతి. అత్యంతఘోర మగునీదుష్కృత్యమును విని అక్బరు "సలీము సార్వభౌముఁడు గాఁగోరినయెడల ననుఁ జంపి, అబుల్‌ఫజల్‌ను గాపాడియుండనోపు" నని సానుతాపమును వెలువఱించెనఁట! అక్బరునకు వయఃపాటవము సడలినకొలఁది చచ్చినపుత్త్రులకై వగపును, బ్రతికియున్న పుత్త్రునిదుండగములకై మనోవ్యథయు నంతకంత కెక్కువగాఁజొచ్చెను. సలీముదుష్ప్రవర్తనము రాజా మానసింగు మున్నగు సరదారులకు ననిష్టరోషములను గల్పించెను. సలీముకుమారుఁ డగు ఖుసురూ యనుచక్రవర్తిమనుమని సింహాసన మెక్కించుటకై యొక సంకల్పము బయలువెడలెను; కాని కడుపుదీపిం బోకార్పఁజాలని వయోవృద్ధుఁ డగు అక్బరు మిగిలియున్న తన జ్యేష్ఠకుమారునకే పట్టము గట్టవలయు నని కృతనిశ్చయుఁడై యట్లు జరపించెను. ౧౬౦౫-వ సంవత్సరము అక్టోబరునెలలో ౧౫-వ తేదిని అక్బరుచక్రవర్తి ఆగ్రానగరమున నతివిశాల మగుమొగలుసామ్రాజ్యము భారమును సలీముపైఁ బెట్టి, యుత్తమభూమిపాలకు లేఁగులోకమును

జేరెను. అక్బరు వయస్సు ౬౩ సంవత్సరములు; అందు ౫౧ సంవత్సరములు భూభారమును వహించెను.

అక్బరుశవమును వినయపూర్వకముగ సలీమును, అతనిమూవురు పుత్త్రులును కోటవెలుపలికి మోసికొనివచ్చిరఁట! పిదప నపారమగు రాజ్యాంగపరివార మంతయుం దోడ నడవఁ గొందఱు సరదారులు చక్రవర్తికాయమును సంవహనముచేసి సికంద్రాలో భూగర్భమునఁ బరుండఁ బెట్టిరి.



అక్బరుగోరీ : సికంద్రా

సికంద్రాయును, ఆగ్రానగరమునకును నాలుగుమైళ్లు దూరము కలదు. అక్బరుగోరీ మూఁడ సుందరములగుమోహనశిల్ప నిర్మాణములలో నొకటిగా నిప్పటికిని వేలకొలఁది విదేశయాత్రికులను బ్రతిసంవత్సరము నాకర్షించుచున్నది.

ఈమహాచక్రవర్తితో సరిపోల్పఁదగిన సార్వభౌములలో నశోకుఁడు ప్రథమగణ్యుఁడు. అక్బరు మహాపురుషుఁడు. ఈయన యాదర్శములను గుఱించి కొంత తెలిసినఁగాని అక్బరు జీవితపరమార్థము విస్పష్టపడదు. ఇంతవఱకు వర్ణించిన ఫాదుషాహ దండయాత్రలనుబట్టి యీతనికిని పరాక్రాంతితృష్ణ మిక్కుటముగ నున్నట్లు దోఁచును. స్వకీయరాజ్యమును విస్తరింపఁజేయునుద్యమ ముత్తమ రాజధర్మమే యని ఆధునికనైతికులసిద్ధాంతము. కాని ఆదర్శహీనుండైన రాజునెడల నిట్టివిధానము కేవలరణవినోదముగాఁ బరిణమించి గర్హిత మగును. అక్బరిట్టివారిలో నొకఁడుకాఁడు. ఆతనికి మొగలురాజ్యభారము పైఁబడినదాదిగ లక్ష్యమం దొకయున్నతాదర్శము దృఢముగఁ గన్పట్టుచుండెను. భారతవర్షమున నేకచ్ఛత్రాధిపత్యము నెలకొల్పుటయు, దాని వికాసౌదాసీన్యములకు దేశపుత్త్రులనెల్ల సమానబాధ్యత గలవారినిగా నొనర్చుటయు నతనిసంకల్పములు. ప్రజాహితమునకు నధికారదక్షత యావశ్యక మనియు, అట్టియధికారపునిర్మాణము ప్రజాజీవితసమ్మితము గాక చిరస్థాయి కాఁజాల దనియు నక్బరుపూర్ణవిశ్వాసము. ఈ సంకల్ప వ్యవసాయములపరస్పరసంసిద్ధియే అక్బరుజీవితము.

అక్బ రిరువదిరెండేండ్లప్రాయమునం దున్నప్పుడే జీజియా యను నొకపన్ను తీసివేయించెను. జీజియా హిందువులపై విధించిన యొకవిధమైన యపాత్రపు సుంకము. హిందువులు మహమ్మదీయులు గాని

వ్యక్తి. ప్రవర్తనలు

మహాపరాధమునకుఁగాను అచ్చుకొనవలసి యుండెను. ఈపన్ను విద్వేషమును బలవంతముగా దాకొల్పుచున్నదని యతఁడు గుర్తించెను. అప్పటి కింకను భావస్వతంత్రులగు అబుల్ ఫజల్ మున్నగు మహాజ్ఞానులపరిచయ మతనికి లేదు. స్వదేశీయులు బద్ధవిద్వేషులుగా నున్నంతవఱకు విదేశీయులకు నిశ్చలమగు రాజ్యప్రతిష్ఠాపనము దుర్లభ మని యూహించి యీ క్రూరపుపన్ను నాఁపించెను. శత్రుకోటిలో నున్న రాజపుత్త్రులు మిత్రపక్షమునఁ జేరనంతవఱకు భారతదేశమం దెట్టి యన్యప్రభుత్వమైనను సురక్షితము గా దని యాతనిరెండవయూహ. ఈకార్యమును సాధించి పాలకపాలితసంఘములకు సమాన గౌరవభావములు సమకూర్చుటకై రాజపుత్త్రులతో నిచ్చి పుచ్చుకొనునాచారమును గల్పించెను. జయపూరుసంస్థానబాంధవులగు రాజా భగవాన్దాసు, రాజా మానసింగు అను మహాశూరులు చక్రవర్తిపక్షమునఁ బోరాడి, జయము గట్టిపెట్టుటయే యాతని రాజనీతిచాతుర్యమును వేనోళ్ల నుద్ఘోషించుచున్నది.

అక్బరుకాలమున జరగినమంచియేర్పాటులలో 'సిస్తు'ను గూర్చినది మిగులఁ గొనియాడఁదగినది. రాజా తోడరమల్లు అను హైందవ మంత్రి యీసంస్కారమును కడు జాగరూకతతో

భూమిపన్ను

నెఱవేర్చెను. భూమి యంతయుఁ గొలచిరి. ప్రజాక్షేమము నాలోచించి సిస్తు విధింపఁబడెను. క్షామకాలమున రాజాదాయమును వసూలు చేయుటలేదు. ఈ యుత్తమపద్ధతికి తోడరుమల్లు శ్లాఘనీయుఁ డని అబుల్ ఫజల్ నుడివినాఁడు. ప్రాంతాధికారులకు సుబేదారు లనియు, న్యాయపరిశీలకులకు కాజీ లనియు, పురసంరక్షణాధికారులకు కొత్వాలు లనియు పేర్లు. వీ రందఱును ధర్మము తప్పి ప్రవర్తింపకుండఁ దగినపైవిచారణ యుండెను. ప్రజలక్షేమమును లక్ష్యమునం దుంచికొని, అధికారుల సేవావిధియందలి లోపాలోపములఁ గనిపట్టుటకై అక్బ రేర్పఱచిన రాజకీయ విధానములలో జమాబందీ ముఖ్యమైనది.

అక్బరు సామ్రాజ్యపతాకముక్రింది కొదవిన హిందూదేశమంతయు ౧. కాబూలు, ౨. లాహోరు, ౩. ముల్తాను, ౪. సింధు, ౫. గుజరాతు, ౬. మాల్వా, ౭. అజ్మీర్,

రాజ్యవిభాగములు

౮. ఢిల్లి, ౯. ఆగ్రా, ౧౦. అలహాబాద్, ౧౧. అయోధ్య, ౧౨. బీహార్, ౧౩. బెంగాల్, ౧౪. బీరార్, ౧౫. ఖాన్దేశ్, ౧౬. అహమ్మదునగర్ అని ౧౬ ఖండములుగా విభజింపఁబడెను. ఈ ఖండములకు 'సుబా' లని మొగలు పేళ్లు. ఈ సుబాలయధికారులు భూమ్యాదాయపరిపాలనయు, సైనికవిచారణయుఁ గలిగి యుండిరి. మొత్తము ఆదాయము ౧౪ కోట్ల రూపాయలు.

అక్బరునాంతరంగికమతప్రవర్తనలకుఁ జాలవఱ కొక మహాపురుషుఁడు కారకుఁడుగా నగపడుచున్నాఁడు. అతఁడు షేక్ అబుల్ ఫజల్; అబుల్ ఫజలునకు ౧౫౫౩-వ సంవత్సరమున నక్బరు పరిచయ

మబ్బెను. అదిమొదలుగ నీయిరువురకును ఎడలేని మైత్రియు, పరస్పర మత ప్రసంగకృషియు వర్ధిల్లెను. అక్బరుమనోవికాసమునకును, తక్కుంగల వైజ్ఞానికరుచ్యభినివేశములకును అబుల్ ఫజల్ చాలవఱకుఁ గారకుఁడని పండితులయాశయము. అక్బరు మహమ్మదీయ మత శ్రోత్రియుఁడు కాఁడు. బుద్ధి వికసించి, ఉచితానుచితవిచక్షణతాజ్ఞాన మలవడినది మొదలుకొని యితనికి ఖురానుమతగురువుల ఛాందసప్రవచనముల యందు నమ్మిక కృశించెను. అందువలన 'దీనె ఇలాహి' యను క్రొత్త మతము నొకదానిని స్థాపించెను.

"పొలములోనిపైరులు, తోఁటలలోని ఫలవృక్షములును, సకల ప్రాణికోటికి జీవనాధారమైన ప్రకాశమును సూర్యునివలననే మనకుఁ గలుగుచున్నందున నాతఁ డీశ్వరాంశ" మనియు, అట్లే "యగ్ని, జలము, ధేనువు, వృక్షములు మొదలగువానియందు నీశ్వరాంశ మున్న" దనియు నీనూతనమతము సిద్ధాంతములు. ఈ క్రొత్తమతము సంస్థాపనమునకు రాజా వీరబలుఁడు ముఖ్యప్రేరకుఁ డని కొంద ఱందురు. ఈతఁడు బ్రాహ్మణుఁడు. కావ్యగీతిప్రియుఁడు. వదాన్యశిఖామణి. శస్త్రశాస్త్రముల రెంటను దక్షుఁడై వెలింగిన యీ బ్రాహ్మణావతంసు నభివర్ణించిన దేశీయగీతము లిప్పటికిని ఉత్తరహిందూస్థానమునఁ గర్ణపర్వముగఁ బాడుచుందురు. అక్బరుస్థాపించిన మత మంతగా వ్యాపించినది కాదు; అది యతనితోడనే యంతరించెను.

అక్బరు విద్యాభిరుచి మిగులఁ బ్రశస్తమైనది. జాతిమత భేదములు లేక నిపుణులగు విద్యావంతు లనేకు లీ చక్రవర్తిం బరివేష్టించి యుండిరి. ఇతనికి సంగీతమునందు రక్తి మిక్కుటము. చిత్రకళారచనయందు బద్ధానురాగుఁడై యుండెను. లోకమోహనము లగు చిత్తరువులను రచించు కళావిదగ్ధులు పదునెనిమిదిమంది అక్బరుపోషణమం దుండిరి. గ్రంథములలో తేటయైనపుటలను తేజోవంతములుగ జేసి, భావబోధకము లగుచిత్రబింబములతో లిఖించు నాజూకుపద్ధతి యీమహారాజు కాలమునందే యారంభమై పిదప నభివృద్ధిగాంచెను. రసవంతము లగు ననేకసంస్కృతకావ్యములు పారసీకభాషలోని కనువదింపఁబడెను. ఫతేహపూర్ సిక్రీనగరము నలంకరించు సుందరమందిరము లనేకము లీచక్రవర్తిశిల్పపరామర్శను చెప్పక చెప్పుచున్నవి.

సారస్వత, కళా వికాసములు

అక్బరు అంత పొట్టియు, పొడువును గాని దేహపరిమాణము గలవాఁడు. ఆజానుబాహువు. కష్టసహిష్ణువగు నాతనిశరీరపాటవ మసాధారణమైనది. ఆతనిముఖమున దైవికమయిన వర్చస్సు నిండి యుండెడి దని అక్బరుపుత్త్రుఁడు వచించినాఁడు. పదునేఁదనమునందు స్వయముగా ననేకయుద్ధములఁ గత్తిగట్టి పోరాడెను. స్వభావసిద్ధముగ నక్బరునకు శాంతియెడల నిచ్చ మెండు; కాని సంగ్రామమునకు వెనుదీయువాఁడు కాఁడు. అభయప్రదాన మీతని యందలి సద్గుణములలో నొకటి. అపరాధికిసైత మభయ మిచ్చి యనేక పర్యాయము లీసద్గుణమునకు సాక్ష్య మిచ్చినాఁడు. బిడ్డలయందుఁ జనవు మిక్కిలి. ప్రేమాంధుఁడగు అక్బరువాత్సల్యమే పుత్త్రుల యవిధేయకృత్యములకుఁ గొంతవఱకు హేతువని కొందఱియూహ. అక్బరు దూరదర్శిత్వమును, విశాలహృదయమును, సాధనవినియోగ జ్ఞానమును, బుద్ధికౌశలమును, నీతిసూక్ష్మజ్ఞానమును ప్రపంచమునందు భూభారవహులై కృతకృత్యు లయినచక్రవర్తులలో నాతని బ్రశంసనీయునిఁగా నొనర్చినవి. ఇట్లస్తమించిన యొక్కపురుష తేజము కారాగారమందుఁ గదా యుదయించినది!

ఆకృతి

(రా. సు.)

౨. ఇతఁడు ఔరంగజేబుయొక్క నాలుగవ కుమారుఁడు. వీనితల్లి శాహనవాజ్ ఖానుని బిడ్డ. ఇతఁడు ౧౬౫౭ లో సెప్టంబరు ౧౦-వ తేదీని జన్మించెను. తండ్రి కొడుకు లిరువురును గలసి రాజపుత్త్రస్థానముమీఁద దండెత్తి వచ్చిరి. యుద్ధ మింకను జరగుచునేయుండెను. ఈమధ్యకాలమందు రాజపుత్త్రు లక్బరుతోఁ గుట్రలు చేయ మొదలిడిరి. ఔరంగజేబును వదలి తమపక్షమునకు వచ్చిన యెడల యుద్ధవిజయానంతరము ఢిల్లీ సింహాసనముపై నతనిని గూరుచుండఁబెట్టెదమని రాజపుత్త్రు లక్బరునకు ప్రోత్సాహము గావింప నతఁ డందులకు సమ్మతించి సమయము వచ్చినపుడు తండ్రిని విడనాడి శత్త్రువులతోఁ జేరుటకు సిద్ధముగ నుండెను. కాని వీ రిరువురకు నిట్లు రాయబారములు జరగుచుండిన కాలమందే యీసమాచారమంతయు ఔరంగజేబునకుఁ దెలియ నతఁడు తనయుక్తివలన వీరల ప్రయత్నములు నిష్ఫలము లగునట్లు చేసెను. ఔరంగజేబు తనకుమారుని పేర నొకయుత్తరము వ్రాసి దానిని రాజపుత్త్రులచేతిలోఁ బడునట్లు పన్నుగడ గావించెను. అందులో ఔరంగజేబు తనకొడుకును మెచ్చుకొనుచు, వెంటనే రాజపుత్త్రుల నందఱ నొకనియమితస్థలమునఁ జేర్పవలసిన దనియు, నచట ఫిరంగులతో రాజపుత్త్రుల నందఱ నొక్కమాఱుగఁ జంపించెద ననియు వ్రాసియుండెను. రాజపుత్త్రు లాపత్త్రికను నిజమే యని నమ్మిరి. వీరు తమ్ము నాశనము చేయ నక్బరు తమతోడఁ గపటపుమైత్రిని బూని యున్నాఁ డని తలఁచి యతనిని బూర్ణముగ వదలిపెట్టిరి. అంత నక్బరు వికలమనస్కుఁడై తనవారి నందఱఁ బరిత్యజించి ౧౬౮౧-వ సంవత్సరమున జూనులో మరాటా రాజయిన సంభాజీ నాశ్రయించెను. సంభాజీ యితనికి మిక్కిలి గౌరవముతో నాతిథ్యసత్కారముల సలిపెను. కాని యచ్చటఁగూడఁ దనకార్యము నెఱవేఱ దనునపనమ్మకమున నక్బరు పర్షియా దేశపు సుల్తాను నాశ్రయించి యతనిసాహాయ్యమునఁ దనకోర్కెను దీర్చుకొను నభిప్రాయముతో సముద్రముమీఁదఁ బ్రయాణ మొనరించి, ప్రతికూలవాయువులమూలమున మార్గము దప్పి యరేబియా దేశపు దక్షిణభాగమందలి మస్కాటు ప్రాంతమునకుఁ బోయి చేరెను. అచట మస్కాటుపాలకుఁడు మిగుల సమ్మానముతో నితనిని దనయొద్ద నుంచుకొనెను. కాని యతఁడు రహస్యముగ నితనివిషయమున నవురంగజేబునకు వార్త పంపి రెండులక్షలరూప్యముల నొసంగి సూరతురేవు పట్టణమునకు వచ్చు మస్కాటుదేశపునౌకలమీఁద సుంకము దీసివేసిన యెడల నక్బరును మరలఁ బంపెద నని సమాచార మంప నౌరంగ

జేబు అందులకు సమ్మతించి కొడుకును దెచ్చుట కేర్పాట్లు గావించెను. ఇంతలో నీసమాచార మంతయు పర్షియాదేశపుసుల్తానునకుఁ దెలిసినది. వెంటనే యతఁడు మస్కాటుపాలకునిదగ్గఱ కేఁగి యక్బరును దన కప్పగించు మనియుఁ, గానిచో తత్క్షణము యుద్ధమున కాజ్ఞ యిచ్చెద ననియు భయపెట్టి యతనిని విడిపించికొనిపోయెను. అక్బరు పర్షియా దేశమున నివాసము గుదుర్చుకొని హిందూదేశపుసింహాసన మెక్క వలయు ననుకోరిక లన్నియు మనసుననే యుండఁ దుదకుఁ క్రీ. శ. ౧౭౦౬-వ సంవత్సరమునఁ దండ్రి జీవించియుండఁగనే కాలధర్మము నందెను.

౩. ఇతఁడు రెండవ అక్బర్. ఇతని సంపూర్ణ నామము అబుల్ నస్రమ్ ఇక్ ఉద్దీన్ మహమ్మద్ అక్బర్ శాహ. ఇతఁడు ఢిల్లీకిఁ బేరునకుఁ జక్రవర్తియైన 'శాహ ఆలం' (౧౭౫౯-౧౮౦౬) అనువానికుమారుఁడు. ఇతఁడు ౧౭౬౦ లో జన్మించి పేరునకు ౧౮౦౬ లో ఢిల్లీశ్వరుఁ డయ్యెను. కొంతయధికారమును సంపాదింప యత్నించెను. కాని యింగ్లీషువారిచే నతని యత్నమేమియు సాగ లేదు. ఇతనికి నింగ్లీషువారు భరణముక్రింద గొప్పమొత్త మిచ్చు చుండిరి. ఇతఁడు ౧౮౩౭-వ సెప్టెంబరు ౨౮-వ తేది శుక్రవారము నాఁడు మృతుఁడయ్యెను. ఇతఁడు కవిత్వము చెప్పుచుండెను. 'షుఆ' అనునది యితని కవిత్వనామము. ఇతనికుమారుఁడును, ఢిల్లీకిఁ గడపటి ఫాదుషాహయు నగు రెండవబహదుర్ షాహ యితని మరణానంతరమున సింహాసన మెక్కెను.

అక్బరునగరము — రాజమహలుపట్టణమునకు మాఱు పేరు. ఇది బంగాళమునందు, సంతాల్ పర్గణా యనుజిల్లాలో నున్నది.

**అక్బరునామా** — ఢిల్లీశ్వరుఁడును, విఖ్యాతుఁడును, మొగల్ చక్రవర్తియు నగు అక్బరుయొక్క వంశమును, రాజ్యపాలన క్రమమును వర్ణించుచు వ్రాయఁబడినపారసీకగ్రంథము. ఇది అబుల్ ఫజల్ చే రచింపఁబడియె. ఇందు పెద్దభాగములు మూఁడు. ప్రథమ ప్రకరణమునందు తైమూరువంశవివరణము, బాబర్ రాజ్యపాలనము, సూర్ వంశమువారియొక్కయు, హుమాయూన్ యొక్కయువృత్తాంత మున్నది. ద్వితీయభాగమందు అక్బరుయొక్క వృత్తాంతము. అతఁడు రాజ్యమునకు వచ్చినతరువాత నలువదియాఱుసంవత్సరములవఱకును జరగినది వర్ణింపఁబడినది. తృతీయభాగమునకు ఆఈన్ - ఈ - అక్బరీ అనిపేరు. ఇందు అక్బరుకాలమందలి దేశస్థితియు, ఆచారవ్యవహారము లును, రాజ్యపద్ధతియు, రాజ్యాంగవిభాగములును సవిస్తరముగ వర్ణింపఁ బడినవి. అక్బరుచరిత్రకీగ్రంథము ముఖ్యాధారము.

అక్బరుపురగ్రామము — ఫైజాబాదుజిల్లా, అక్బరు పురముతాలూకాకు ముఖ్యస్థలము. టౌన్స అనునదియొడ్డునను, ఔధ్ రోహిల్ ఖండ్ రైలుమార్గముమీఁదను ఉన్నది. జనసంఖ్య ౭,౧౧౬. ఇందుఁ జక్కని మసీదును, నదికిఁ బెద్దవంతెనయుఁ గలవు. అక్బరు ప్రభుత్వకాలమున మొహసిన్ ఖాను అనువాఁ డీరెంటినిఁ గట్టించెను.

అక్బరుపురఘట్టము — నర్మదానదిని దాఁటుటకు వీలయినస్థలము (చూడుఁడు: నిమాడ్ జిల్లా).

**అక్బరుపురముతాలూకా** — ౧. సంయుక్తరాష్ట్రములందలి (United Provinces) కాన్ పూరు జిల్లాకు నడుమ నున్న తాలూకా. అక్బరుపరగణా యనునది దీనికిఁ దగిలియున్నది. దీనివైశాల్యము ౨౪౫ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧,౦౭,౭౨౯. ఇందు ౧౯౯ పల్లెలును, ఒకపట్టణమును కలవు. పట్టణము అక్బరపురము. ఇదియే ముఖ్యపట్టణము. ఔలు రమారమి రు. ౨,౫౦,౦౦౦. ఇం దుండి మూఁడునదులు పాఱును. గంగానదికాలువయొక్క ఇటావాశాఖనుండి భూములకు నీరు పాఱుచున్నది.

౨. సంయుక్తరాష్ట్రమునందలి ఫైజాబాదు జిల్లాలోని తాలూకా. ఇందు అక్బరపూర్, మజ్ హౌరా, సుర్ హూర్ పూర్ అను మూఁడుపరగణాలు కలవు. వైశాల్యము ౫౩౨ చదరపుమైళ్లు. జనసంఖ్య ౩,౪౪,౬౫౯. పల్లెలు ౬౫౪, పట్టణములు మూఁడు. జలాల్ పూర్, అక్బర్ పూర్ అనునవి పెద్దవి. భూమిసిస్తు రు ౪,౫౧,౦౦౦. సెస్సులు రు ౨౩,౦౦౦.

అక్బరుపూర్ ఔంచా — సంయుక్త ప్రాంతమున మైన్పురిపట్టణమునకు ౧౬ మైళ్లదూరమున నున్న యొకపురాతనగ్రామము. ఇచ్చటఁ గన్పించు పురాతనావశేషములనుబట్టి యొకకాలమున నిది గొప్పపట్టణముగా నుండియుండవచ్చు నని తోఁచును. అక్బరు చక్రవర్తి దీనిని గట్టించె నని యొకప్రతీతి గలదు. ఎత్తయినప్రదేశమున నుండుటచే దీనికి ఔంచయనుమాట చేర్చఁబడియుండవచ్చును (ఊంచా యనఁగా హిందీలో ఎత్తయిన దని యర్థము). అచటఁగల దేవాలయములలో నొకదానియందు ౩౩౪-వ సంవత్సరము ఉదాహరింపఁబడియున్నది. ఇది విక్రమశక మైనచో క్రీ. శ. ౨౭౭-వ సంవత్సరమునకు సరిపోవును.

అక్చా — అఫ్గాన్ తుర్కిస్థానమందలి అక్చాజిల్లాకు ముఖ్యస్థలము. ఈప్రదేశము సముద్రమునకంటె ౧,౦౮౬ అడుగు లెత్తుగ నున్నది. దీనికిఁ జుట్టును రెండుమైళ్ల వలయముగల గోడ కలదు. ఎత్తయినదుర్గము గలదు. ఇందుఁ గొందఱు అఫ్గాన్ సైనికు లుందురు. ఇది వర్తకస్థలము. ఇందుఁ గొందఱు హిందూవర్తకులును గలరు.

అక్యాబ్ గ్రామకంతము — ఇచ్చట గ్రామకంత మనఁగా నొక చిన్నతాలూకా యని యర్థము. అక్యాబ్ పట్టణమును, దానికిఁ జుట్టు నున్నప్రదేశమునుకలసి యీఅక్యాబ్ గ్రామకంత మైనది. విస్తీర్ణము ౬౨ చదరపుమైళ్లు. జనసంఖ్య ౪౭,౪౭౭. ఇందు ౬౦ పల్లెలు కలవు. వ్యవసాయముక్రింద నున్నభూమి ౩౦ చదరపు మైళ్లు. భూమిసిస్తు రు ౫౦,౦౦౦.

**అక్యాబ్ జిల్లా** — బర్మాదేశమందలి సముద్రపుటొడ్డు జిల్లా. ఇది ఆరకాన్ డివిజన్ లోనిది. ఇది ౯ ౪౭' ౨౧° ౨౭' ఉ.

కును, ౯౨° ౧౧' ౯౩° ౫౮' తూ. కును నడుమ నున్నది. దీని కుత్తరమున బంగాళదేశమందలి చిట్టగాంగుజిల్లా కలదు. విస్తీర్ణము ౫,౧౩౬ చదరపుమైళ్లు. సముద్రమునకును, ఆరకాన్ యోమా పర్వతములకును నడుమనున్న సమప్రదేశమును, పర్వతపంక్తులచేఁ గప్పఁబడిన విషమ ప్రదేశమును కలసి యీజిల్లా యేర్పడినది. ఇందు ముఖ్యమైననదులు మూఁడు: కలదన్, లెమ్రో, మయూ.

ఈజిల్లా ఆరకాన్‌రాజ్యమునందలి విభాగమై యుండెను. కావున దీనిచరిత్రకొఱకు ఆరకాన్‌చరిత్ర చూడనగును. ౧౮౨౬లో ఆరకాన్‌రాజ్యము బ్రిటిషువారియధీనము కాఁగా దీనికిని వారే ప్రభువులైరి. మ్యోహాంగునద్ద ౧౫-వ, ౧౬-వ శతాబ్దులనాఁటి పూర్వ చరిత్రకు సూచకము లగుకట్టడములు మొదలైనవి కలవు. మహాముని దేవాలయమునందు గౌతమమునియొక్క మహాపవిత్రమైనప్రతిమ యొకటి యుండెను. బర్మనులు ఆరకానును ౧౭౮౪ లో జయించి నపుడు వారా ప్రతిమను తీసికొనిపోయి అమరపురమునందు స్థాపించిరి. అది యిప్పుడు మాండలేయఁ దున్నది.

ఈజిల్లాలో జనసంఖ్య ౪,౮౧,౬౬౬. వీరిలో ౨,౩౯,౬౦౦ మంది ఆరకానీజులు: అనఁగా కేవలము స్వదేశస్థులు; బర్మనులు ౩,౫౮,౦౦౦: హిందువులు ౧౪,౦౦౦; మిగిలినవా రితరులు. ఇందు ఆరకానీజుభాష మాటాడువారు సగముమందియు, బంగాళీ మాటలాడువారు మూఁడవవంతును కలరు. కమిలు, మ్రోలు, చినులు మొదలగుపర్వతీయులుగూడ నీజిల్లాలోఁ గలరు.

ఈజిల్లాలో నాలుగు సబ్ డివిజనులును, తొమ్మిది గ్రామకంఠములును కలవు. అక్యాబ్, మిన్‌బ్యా, క్యౌక్టా, బథిడౌంగ్ అనునవి సబ్ డివిజనులు. ఒక్కొక సబ్ డివిజనునకు ఎక్‌స్ట్రా అసిస్టెంటుకమిషనరు అధికారిగా నుండును. అక్యాబ్ సబ్ డివిజనులో, అక్యాబ్, రథడౌంగ్, పౌన్నగ్యూన్ అనునవియు, మిన్‌బ్యా సబ్ డివిజనులో పౌక్టా, మిన్‌బ్యా అనునవియు, క్యౌక్టా సబ్ డివిజనులో క్యౌక్టా, మ్యూహాంగ్ అనునవియు, బథిడౌంగ్ సబ్ డివిజనులో బథిడౌంగ్, మౌంగ్‌డా అనునవియు గ్రామకంఠములు. గ్రామకంఠముల కధికారి మియోజక్ అనఁబడును.

ఈజిల్లాడౌలు క్రమముగ హెచ్చుచున్నది. ౧౮౮౦-౮౧-వ సంవత్సరమున రు ౨౩,౩౬,౦౦౦ ఉండెను; ౧౯౦౩-౦౪ లో రు ౩౦,౯౨,౦౦౦ ఆయెను. భూమిసిస్తు ఈ విధముగా నున్నది: పల్లపుభూములకు ఎ ౧-కి రు ౦-౮-౦ మొదలు రు ౪-౦-౦; మెరక భూములకు ఎ ౧-కి రు ౧-౦-౦, తోఁటలకు ఎ ౧-కి రు ౨-౦-౦.

ఇచ్చట వ్యవసాయము మిక్కిలి సుకరము; భూమి సారవంతము; వర్ష మధికము. వరిపంట విశేషము. నదులయొండ్రు పేరెడుభూములలో దున్నకయే విత్తుదురు. పల్లపు పైరులకుఁగూడ వేఱుగ నీరు పెట్టరు. తోఁటలకుమాత్ర మప్పుడప్పుడు పెట్టెదరు. ఇచ్చటిజనులు మిక్కిలి సోమరులు.

ఇచ్చటిజనులు సాధారణముగా జలమార్గముననే ప్రయాణము చేయుదురు. మంచిరోడ్లు అంతవిశేషముగ లేవు. జిల్లాయంతయుఁ గలసి ౪౦ మైళ్లపొడువుగల కంకరరోడ్డును, ౧౬౦ మైళ్లు పొడువుగల సాధారణపురోడ్డును కలవు.

ఇచ్చటిజనులు విద్యలో నితరబర్మనులకంటె వెనుకనున్నారు.

ఈజిల్లాలో వర్షము విశేషముగాఁ గురియును: ఒకానొకసంవత్సరమున ౨౦౩ దుక్కలవఱకు వర్షించెను. ఈజిల్లాకు ఉప్పెనల వలన నప్పుడప్పుడు బాధ కలుగుచుండును. ౧౮౬౭, ౧౮౮౪, ౧౮౯౫ సంవత్సరములందు నుప్పెనలు వచ్చి యీజిల్లా ప్రజలకు నెక్కుడు నష్టము కలుగఁజేసెను.

ఈజిల్లాలో ఖనిజములు విశేషముగాఁ గల వనియెదరు. రాతిబొగ్గు దొరకును. కాని యది శ్రేష్ఠమైనది కానందున నెవ్వరును త్రవ్వరు. బంగారమును, వెండియుఁ గల గను లున్నవఁట. కాని యింకను త్రవ్వినవారు లేరు. తూర్పుబారోఁగదీవిలో నూనెగను లున్నవి. ఇరువదిసంవత్సరములనుండి, బావులు త్రవ్వి నూనెను తోడుచున్నారు. ౩౦౦ మొదలు ౨౦౦ అడుగులలోఁతున నూనె పడును. ఆవిరిబలమున బావులు త్రవ్వుదురు. ఇచ్చట ఉప్పుకూడ వండెదరు.

**అక్యాబ్ పట్టణము** — బర్మాయందలి అక్యాబ్ జిల్లాకు ముఖ్యపట్టణము. కలదన్‌నదియొక్క ముఖమునొద్ద ననఁగా నానది సముద్రమునఁ గలయుస్థలమునకు సమీపమున నున్నది. ఇది బర్మాయందు నాల్గవపట్టణము. జనసంఖ్య ౩౫,౬౮౦. వీరిలో హిందూదేశమునుండి పోయినవారు ౧౮,౩౨౮ మంది.

బుద్ధునిదవుడపంటికిఁ గట్టఁబడినగుడికి 'అక్యాబ్'అనుపే రుండెననియు, దానినిబట్టియే దీనికి అక్యాబ్ అనుపేరు వచ్చె ననియుఁ గొంద అందురు. ఈపట్టణము ఆరకానీజురాజులలో నొక్కనిచేఁ గట్టఁబడియె. అచ్చటిజను లీపట్టణమును 'సిట్‌ట్వే' యందురు. అందుకు 'యుద్ధము ప్రారంభ మైనస్థలము' అని యర్థము.

ఆరకాన్ ఇంగ్లీషువారియధీన మగువఱకును (౧౮౨౬) మ్యోహాంగు ముఖ్యపట్టణముగ నుండెను. తరువాత అక్యాబ్ ముఖ్యపట్టణ మయ్యెను. ఇది యీప్రాంతమునకు ముఖ్యమైన రేవుస్థలము. పొగయోడలు రేవునొద్దకు వచ్చి పోవుటకు మంచిరేవు కట్టఁబడినది.

ఇచ్చట వర్తకము విశేషముగా జరగును. ౧౯౦౩-౪-వసంవత్సరమున నిచ్చటనుండి హిందూదేశపురేవులకు ౧౫౬ లక్షల వర్తకమును, పరదేశపురేవులకు ౭౬ లక్షల వర్తకమును జరగెను. ఇచ్చటనుండి బియ్యము విశేషముగా నెగుమతి చేయఁబడును. చెన్నపట్టణమునకు ౩౪ లక్షల విలువగల బియ్యమును, బొంబాయికి ౨౫ లక్షలవిలువగల బియ్యమును పై సంవత్సరమున పంపఁబడెను.

౧౮౭౮-వ సంవత్సరమునందు అక్యాబ్ పారిశుద్ధ్యసంఘముగ నేర్పడెను. సభాసదులను జను లెన్నుకొనియెదరు. ఇచ్చట నొక హైస్కూలును, ఆస్పత్రియుఁ గలవు.

**అక్యాబ్ సబ్ డివిజను** — అక్యాబ్ జిల్లాలోనిసబ్ డివిజన్, అనఁగా రాజ్యాంగవిభాగము. ఇందు అక్యాబ్, రథడౌంగ్, పొన్నగ్వ్యాన్ అను గ్రామకంఠములు కలవు.

**అక్రా** — ఆఫ్రికాలో ఆంగ్లేయులకు చెందియున్న 'గోల్డ్ కోస్టు' అనుప్రదేశమునకు ముఖ్యపట్టణము. దీని జనసంఖ్య ౧౧,౦౦౦. ఇచ్చటనుండు యూరోపియనులుమాత్రము చాల తక్కువ మందియే. కోకో యీ ప్రాంతమున విస్తారముగఁ బండును.

**అక్రాబాదుపట్టణము** — సంయుక్తరాష్ట్రములలో సికంద్రరావు తహస్సీలునకుఁ జెందిన అక్రాబాదు పరగణాలో నొకచిన్న పట్టణము. ఇదియే యీపరగణాకు ముఖ్యస్థానము. అక్బరు చక్రవర్తి దీనిని గట్టించెనఁట. చాలఁగాల మిది యొక తహస్సీలునకు ప్రధానస్థానముగ నుండెను. అక్బరాబాదు అనియు దీనికిఁ బేరుండెడిదఁట. 'సిపాయీలతిరుగఁబాటు' సమయమున మంగళసింగు, మహతబ్ రాయ్ అను నిరువురు జమీన్దారులు 'తిరుగఁబాటు' పక్షములోనివారు, ఇచ్చటనుండి తాలూకాబొక్కసము దోపిడి చేయించిరఁట. ౧౮౫౭-వ సంవత్సరమున కల్నల్ గ్రేట్ హెడ్ అనునతఁడు, వారిబంధుకోటికిఁ జెందినవారి సాయమునసే అక్రాబాదు గ్రామమును వశపఱుచుకొని 'తిరుగఁబాటు' నాయకుల నురితీయించెను.

**అక్రాబాదు పరగణా** — సంయుక్త రాష్ట్రములందలి సికంద్రరావు తహస్సీలులో నొక పరగణా. దీనివైశాల్యము ౧౧౬ చదరపు మైళ్లు. అక్బరుచక్రవర్తి కాలమున నిది ప్రత్యేకముగ నొకపరగణాగా నేర్పడెను. ఈపరగణాలో గ్రామములు ౯౯ కలవు.

**అక్రియుఁడు** — సోమవంశజుఁడైన ఆయు వనురాజునకుఁ బుట్టిన యయిదుగురుపుత్త్రులలో నాల్గవవాఁడు రంభుఁడు. ఈరంభుని వంశమునందు గభీరుఁడు పుట్టెను. ఇతనికొమారుఁడు అక్రియుఁడు. ఈతనివంశజులు తపస్సుచే బ్రాహ్మణు లైరి.

**అక్రీడ** — ఇతఁడు కురుధామునికుమారుఁడు. ఇతనికి నలువురు కొడుకు లుండిరి: పాండ్య, కేరళ, కోళ, చోళులు. వీరు వరుసగ దక్షిణహిందూదేశమున పాండ్య, కేరళ, కోళ, చోళదేశముల కధిపతు లైరి.

**అక్రూరుఁడు** — ౧. విష్ణువుయొక్క యొకపార్షదుఁడు.

౨. (సో. వం.) యదువంశాంతర్గతమైన సాత్వతవంశమునందు జన్మించినవాఁడు. శ్వఫల్కునిపదుముగ్గురు పుత్త్రులలోఁ బెద్దవాఁడు. ఇతనికి రత్న, ఉగ్రసేన, అశ్విని మొదలగు స్త్రీలును, దేవకంతుఁడు, ఉపదేవుఁడు మొదలగు పుత్త్రులును ఉండిరి. కృష్ణబలరాములను గోకులమునుండి మథురకుఁ దెచ్చుటకుఁ గంసుఁ డీతనిని నియోగించె. ఒకప్పుడు సత్యభామ శ్యమంతకమణితోఁగూడఁ బుట్టినింట నుండఁగా నితఁ డచ్చటికి శతధన్వ యనువానిఁ బంపి సత్రాజిత్తునిఁ జంపించి శ్యమంతకమణిఁ దెప్పించెను (చూడుఁడు: శ్యమంతకమణి).

**అక్రోటు** — వైద్యమునకు విశేషముగ నుపయోగించు నొకఫలవిశేషము. అక్రోటుగింజలు మంచి బలము నిచ్చు నాహారము. ఈ యక్రోటుచెట్లు కాశ్మీరమునుండి పడమటి టిబెట్టు దేశమువఱకుఁ గల యరణ్యములం దెక్కువగ నుండును. ఈ చెట్లను ప్రత్యేకముగఁ బెంచుటయుఁ గలదు. ఆసా, మణిపుర పర్వతప్రాంతము లందుఁగూడ నిది పెరుఁగును. అక్రోటుపండ్లను ఉత్తరఈరాన్, కాకసస్, ఆర్మీనియాదేశముల కెగుమతి చేయుదురు. అక్రోటు వ్యవసాయము చాలఁగాలమునాఁటిది. హిందూదేశమున మఱియుఁ బురాతనము. ఎన్నియో శతాబ్దులనుండి యిది కొండప్రదేశములనుండి మైదానములలోనికి దిగుమతి యగుచు వచ్చుచున్న ది.ఆఈన్–ఈ–అక్బరీలో కాశ్మీరదేశపు–అక్రోటునుగూర్చిన వర్ణనము కలదు. ఇది ౧౬-వ శతాబ్దిప్రాంతమున నత్యుత్తమ మయిన దని పే రందినది. తార్తారు దేశపు అక్రోటు రెండవరకమునకుఁ జెందినది. దీనికి నాతి శీతోష్ణములగు జలవాయువులు కావలయును. మంచి ఫలవంతమైన ప్రదేశమునం దక్రోటుచెట్టు నాటి చుట్టునున్న చోటంతయు నాకలములు లేకుండ శుభ్రపఱుపవలయును.

అక్రోటుపండు పైపార రంగు వేయుట కుపయోగించును. ఐరోపాఖండమున దీననుండి నూనె తీయుదురు. ఫ్రాన్సుదేశపు నూనెలో మూఁడవవంతు అక్రోటునూనెయే. అక్రోటు ఫలించిన తరువాత రెండుమూఁడు నెలలవఱకును దాననుండి నూనె తీయరాదు; అట్లు తీసిననూనె మంచిది కాదు.

నూనె తీయుటకు, కాయలలోని గింజలను వేఁపుపఱిచి గానుగలో వేయుదురు. మొదట తీసిననూనె ఆహారములోని కుపయోగించును. తరువాత, తెలకపిండిని ఉడుకునీటిలోఁ బడవైచి కొంతసేపుంచి దానిని మరల గాను గాడింతురు. ఇప్పటినూనె ఒడలికిఁ బూసికొనుట కుపయోగించును. తుదకు మిగిలిపోయిన తెలకపిండి పశువుల యాహారమున కుపయోగింతురు.

అక్రోటుబెరడు విరేచనకారి. దీనియాకులు మిగుల దళసరిగ నుండును. వీనిని గాయముపై నతికించిన నది మానిపోవును. అక్రోటుపండు జూలై సెప్టెంబరు నెలలలో ఎక్కువగఁ బండును. కాశ్మీరదేశమునందును, ఉత్తరహిమాలయ ప్రదేశమునందును గలప్రజల కిది ముఖ్య మగు నాహారము. ఆకులు, చిన్నచిన్న మొక్కలు, గోసి పశువుల కాహారముగ నైతురు. బెరడు మైదానపు

ప్రదేశముల కెగుమతి యగును. స్త్రీలు దానితో పెదవులకు రంగు వైచికొందురు. అక్రోటుకొమ్మ దగ్గఱ నున్న నీఁగలు పాఱిపోవును.

అబుల్ ఫజల్ తనకాలమున కాశ్మీరదేశమునందుఁ బ్రచారమున నుండిన యొక విచిత్రమైన యాచారమును గూర్చి యిట్లు వ్రాసినాఁడు.

"జబ్ బూల్ గ్రామమున నొక నీటికుంట కలదు. ప్రజలు తమ ప్రయత్నముల ఫలితము దెలిసికొనుటకై యక్రోటును దానిలోఁ బడవైతురు. అది తేలినచో కార్యము ఫలించునన్నమాట: మునిఁగిపోయినచో ఫలింప దని యర్థము."

**అక్రోధనుఁడు** — అయుతానీకునిపుత్త్రుఁడు. ఇతని భార్య కరంభ. దేవాతిథి యితనిపుత్త్రుఁడు (పు. ల).

**అక్వి** — ఇటలీదేశమున ఉత్తరభాగమునందు అలెగ్జాండ్రియాపట్టణమునకు ౧౮ మైళ్లదూరమున నుండు గ్రామము. జనసంఖ్య ౧౩,౭౮౬. అచ్చట కడు ప్రాచీనకాలమునుండియు పేరుగాంచినతీర్థములు గలవు. ఈ తీర్థములలో గంధకము కల దగుటచే రోమకరాజ్యదినములనుండియు జను లీ పట్టణమున కారోగ్యార్థము పోవుచుందురు. ఇచ్చట నొకమంచిక్రైస్తవదేవాలయము కలదు.

**అక్వినాస్ థామస్** (క్రీ. శ. ౧౨౨౫-౧౨౭౪) — ఇతఁడు పేరుగాంచిన మతజ్ఞుఁడు. నేపుల్సుమండలములోని అక్వినో సంస్థానపుప్రభువునకు పుత్త్రుఁడు. మాంటికస్సీనో అనుతావున విద్యాభ్యాసమునకు ప్రారంభించి నేపిల్సుసర్వకళాశాలకు ఉత్తమవిద్యకై పోయెను. అప్పటికి రోమమహామతాచార్యుల శక్తిప్రభావంబులు తగ్గియుండెను. సంస్కర్తలతెగ లనేకములు బయలుదేఱెను. అందు డామెనికనులు అనువారిది యొకమతము. అక్వినాసు వీరిబోధలకు బద్ధుఁడై కుటుంబమువారి యాక్షేపణలను నివారించి డామెనికను తెగను చేరెను.

తరువాత ౧౨౪౪-వ సంవత్సరముప్రాంతమున కలోనుపట్టణమున ఆల్బర్టు మాగ్నసు అనుగురువునొద్ద చదివి అతనితోఁగూడ పారిసునగరమునకు పోయెను. అచ్చట నప్పుడు జరుగుచుండిన మతచర్చలలో సుప్రసిద్ధుఁడై ఒకానొకసమయమున రోమమహామతాచార్యులకుఁ గూడ వ్యతిరేకముగ తనమతపుసిద్ధాంతములను సమర్థించుకొనెను. నాఁటనుండియు మతవిషయకగౌరవము లీతని కయాచితములై సంప్రాప్తించెను. మహామతాచార్యులే యీతని సలహాల నడుగుచుండిరి. తనమతమునం దభిమానము కలవాఁడయి నేపిల్సుపట్టణపు ఉత్తమాచార్యపదవినిగూడ ధిక్కరించెను. ఆతనిజీవితమునందలి ఉత్తరభాగము అతనిమతపుసేవకే వినియోగింపఁబడెను. ౧౨౭౪-వ సంవత్సరమున పదియవగ్రిగరిమహామతాచార్యుఁడు లయన్సుపట్టణమున జరపనుండినగొప్పసభకు జబ్బుగానుండియు పోసమకట్టి అక్వినాసు ఆసంవత్సరము మార్చి ౭-వ తేదీని మార్గమున కాలధర్మము నొందెను. మరణానంతరము మహామతాచార్యు లీతనిని సిద్ధుఁ డని ప్రకటించిరి. రోమనుక్యాథలిక్కు శాఖవారు నేఁటికిని ఈతనిని తమగురువుగను, తమవిద్యాలయాదికములను రక్షించుదేవదూతగను గణించుచున్నారు. వారిమతమున కీతఁడు రచించినగ్రంథములే యిప్పటికిని ముఖ్యప్రమాణములు.

**అక్షక్రీడ** — (అనఁగా) జూదమాడుట. వైదికకాలమునం దిది యెక్కువ ప్రచారమునం దుండినట్లును, తరువాతను క్రమక్రమముగ దూరమైపోయినట్లును వేదమునందలి కొన్నిమంత్రములమూలమున విదితమగుచున్నది. మహాభారతకాలమునందు దీనిస్థితి యందఱకును దెలిసియే యున్నది. ప్రస్తుతకాలమునందుఁ గూడ నుత్తరభారతమున — నీచజాతులనుగుఱించి వేఱుగ వ్రాయ నక్కఱయే లేదు — ఉత్తమవంశసంజాతులు, ప్రభువులు, జమీన్దారులుగూడ దీపావళిపండుగదినమునను, ఆమఱునాఁడును తప్పక జూదము నాడుచుందురు. దీనివిషయమున వీరందఱకు నొక మూఢాభిప్రాయము గలదు. ఆనాఁడు గెలిచినచో సంవత్సరముపొడుగునను లాభము కలుగు ననియు, నోడినచో నష్టము కలుగు ననియు నమ్మకము. ఈ నమ్మకము గలుగుటకు మూలకారణము బ్రహ్మపురాణమునందలి యొకగాథ యైయున్నది. కార్తికశుక్లప్రతిపత్తిథినాఁడు శంకరుఁ డీ జూదమును సృజించి యాడి యోడిపోయెనఁట. పార్వతి గెలిచినది. తత్కారణమునఁ బార్వతి కెల్లపుడు సౌఖ్యము కలుగుచుండ శివుని కెల్లపుడును లేమిచే బిచ్చమెత్తికొనవలసివచ్చినది. ఈగాథ నాప్తవాక్యప్రమాణముగఁ గైకొని సంవత్సరముపొడుగునను దమతమలాభాలాభములను నిర్ణయించుకొనునిమిత్త ముత్తరహిందూస్థానమున నిప్పటికిని జూద మాడుచుందురు.

**అక్షపాదుఁడు** — ఇతఁ డొక గొప్ప తార్కికుఁడు. గౌతముఁ డనియు నితనికి పే రున్నది. ఇతఁడు రచించిన తర్కశాస్త్రమును వేదవ్యాసుఁ డాక్షేపించెను. దానికిఁ గోపించి వ్యాసుని మొగము చూడరా దని యక్షపాదుఁడు ప్రతినం బూనెను. తరువాత నొకసారి వ్యాసుఁడు తన్ను ప్రార్థించినప్పు డక్షపాదుఁడు తనపాదమునఁ గన్నొకటి కల్పించి దానితోనే వ్యాసుని జూచి తనశపథము నిలువఁబెట్టుకొనెనఁట.

**అక్షమాల** — ఈమె వసిష్ఠునిభార్యలలో నొకతె. ఈమె శూద్రకన్య యైనను బ్రహ్మర్షి యగు వసిష్ఠునిం బెండ్లాడుటచే మిగుల గుణవతియై పూజ్యురా లయ్యెను.

**అక్షయవటము** — గయాప్రయాగక్షేత్రములందు పురాతనములగు రెండుమఱ్ఱిచెట్లు కలవు. వీనికి "అక్షయవటము" లని పేరు. ఈరెండుచెట్లును ప్రళయకాలమునఁగూడ నశింప వని పురాణములలో వ్రాసినారు. కావుననే వీని కక్షయవటము లని పేరు. మఱ్ఱిచెట్లను బెంచిన గొప్ప పుణ్యము లభించు నని చెప్పుదురు. ప్రయాగము (అలహాబాదు) నందలి యక్షయవటము కోటలోపలిభాగమునఁ బడి

పోయినది. ఎడతెగని నీడనే యుండుటచేఁ గాఁబోలు, నిది పెరుఁగక చిన్నదై పోయినది. జగన్నాథక్షేత్రమునఁగూడ నొక యక్షయవటము కలదఁట !

ప్రయాగమునందలి యక్షయవటము మిగులఁ బ్రాచీనము. మొదట నిది బయట నుండెను. క్రమముగ మట్టిదిబ్బలలోఁ గప్పఁబడిపోయినది. ఇప్పు డిది ప్రయాగకోటలలో నొకపురాతనదేవాలయముదగ్గఱ నున్నది. ఎండకు, గాలికి నందుఁ బ్రవేశము లేదు. అందుచే చెట్టు పెరుఁగుట కవకాశము లేకున్నది. చీనాదేశీయుఁడగు యువాన్‌చాంగ్ యాత్రికుఁడు దీనిని తన వ్రాఁతలలో నుదాహరించినాఁడు. దీనికి దక్షిణము వైపున అశోక, సముద్రగుప్తులశాసన స్తంభములు కలవు.

మొదట నీయక్షయవటము 'వేణీఘట్టము'నకు దూరముగ నుండెను. వఱదలు వచ్చినప్పుడు గంగాయమునలు దీనిదగ్గఱనుండి ప్రవహించిపోవుచుండెడివి. అక్బరుచక్రవర్తికాలమున హిందువు లీవట వృక్షముక్రిందనుండి గంగలో దుమికి ప్రాణములను విడుచుచుండు వారఁట. నేఁడు మరల నీయక్షయవటము ప్రాంత మంతయు నిసుక దిబ్బలతోనే నిండియున్నది. త్రివేణి యిప్పు డక్షయవటముకడ లేదు.

ఒకకాలమున యాత్రికుల కక్షయవటదర్శనము దుర్లభముగ నుండెడిది. పండా లెట్లో కష్టపడి దర్శనముఁ జేయించుచుండువారు. ఇప్పు డట్టియాతంక మేమియు లేదు. స్వేచ్ఛగఁ బోయి దర్శనము చేసికొనవచ్చును. ప్రస్తుతమున దీనికి నలువైపుల నున్నపుగోడలకప్పు కలదు. దర్శనము కావలె నన్న నడుగునకుఁ బోవలయును. అడుగున నంతయుఁ జీకటి. ఏమియుఁ గానరాదు. ఈయక్షయవటముదర్శనముచే నక్షయమగు పుణ్యము లభించు నని పురాణములు చెప్పుచున్నవి.

గయలోఁగూడ నొకయక్షయవట మున్నది. వనవాసకాలమునఁ బాండవులు లోమశమహర్షి యాజ్ఞచే నీవృక్షముదర్శనము గావించుకొని వచ్చిరి.

**అక్షరములు** — ఈ వ్యాసమునందు వేఱువేఱుభాషలయొక్క లిపులయుత్పత్తియు, వికాసమును వర్ణింపఁబడును. భాష యనఁగాఁ గొన్నిధ్వనులయొక్కసమూహము. ఇట్టిధ్వను లిన్ని యని నిర్ధారణ చేసి యం దొక్కొక్కదానికి వ్రాఁతలో నిట్టిగుర్తు అని యేర్పాటు చేసికొనిన నాగుర్తులే అక్షరసమామ్నాయము (Alphabet) అనిపించుకొనును. అక్షర మనఁగా క్షరము కానిది. చెరిగిపోనిది; నశింపనిది. మాట మాటలాడినతోడనే మాయమైపోవును. మరలఁ గానరాదు. అట్లుగాక యక్షరములు స్థిరముగ నుండును. నేఁడు వ్రాసినవానిని రేపు చూడవచ్చును. ఈతరములో వ్రాసినవానిని రెండవతరమువారు చదువుకొనవచ్చును. కావున వీనికి మనవా రక్షరము లని పేరిడిరి. ఎన్నఁడును చలింపని పరమేశ్వరుఁడుగూడ 'అక్షర'పదవాచ్యుఁడు. అక్షరములకు 'వర్ణము' లన్నమాఱుపేరు కలదు. వర్ణ మనఁగా రంగు, వన్నె. నల్లరంగు (సిరా)తోఁ గాని, వేఱురంగుతోఁ గాని యక్షరములను వ్రాయుచున్నందున నక్షరములను 'వర్ణము' లనిరి. వ్రాఁతకు సంస్కృతమున 'లిపి' యనియు, 'లేఖన' మనియుఁ బేళ్లు కలవు. ఈ పేళ్లు 'లిప్', 'లిఖ్' ధాతువులనుండి పుట్టినవి. 'లిప్' ధాతువునకుఁ బూయుట (రంగుతో పూఁతపూయుట) యని యర్థము. మసితో నక్షరముల వ్రాయుచుండినందున నవి లిపు లయ్యెను. 'లిఖ్' ధాతువునకుఁ జెక్కుట, గీఁకుట యని యర్థము. తాటియాకులమీఁదను, శిలలమీఁదను, లోహములమీఁదను అక్షరములను పూర్వము చెక్కుచుండుటచే నవి లేఖ లయ్యెను. అట్లు వ్రాయుట లేఖన మయ్యెను.

పురాతన పారసీకభాషలో లిపి యనునర్థంబున 'డిపి' యను పదంబు కలదఁట. ఆపదమునుండి సంస్కృతలిపి పదము పుట్టిన దని కొందఱు పాశ్చాత్త్యులు వ్రాసినారు[1]. డెరయసు (క్రీ. పూ. ౫౧౬) అను పారసీకరాజుచేఁ జెక్కింపఁబడిన బేహిస్తాన్ శాసనమునందు (౪౧౫) ఈవిధమున వ్రాయఁబడి యున్నది.

"డిపి'నుండి లిపి పుట్టినదా?

"తువమ్ కాహ్య అపరమ్ ఇమామ్ డిపిమ్ వై నాహి". భవిష్యత్కాలమునందు నీలిపిని చదువునట్టి నీవు అని దీని కర్థము. ఈ 'డిపి' పదమునే హిందువు లక్షరములతోఁగూడఁ బశ్చిమమునుండి గ్రహించిరని బర్నెలుయొక్క యభిప్రాయము. ఇందుకు వారు మఱియొక యుక్తినిగూడఁ జెప్పినారు. హిందూదేశమున 'లిఖ్' ధాతువునే మొదట వాడియుందురు గాని 'లిప్' ధాతువును వాడి యుండరు. ఎందు కనఁగా మొదట అక్షరములను చెక్కుచుండిరి కాని రంగుతో వ్రాయుచుండెడివారు కారఁట. అందుచే 'లిపి' యను సంస్కృతశబ్దము 'లిప్' (పూయుట) అను ధాతువులోనుండి పుట్టలేదఁట; 'డిపి' యనువిదేశీయపదముయొక్క యపభ్రంశమఁట. ఇట్టివ్రాఁతలు మఱియెవరైనను వ్రాసియుండినయెడల కుఱ్ఱవ్రాఁత లని నవ్వి యూరకుండవలసినదే కాని బర్నెలువంటివాఁడు వ్రాసినందునఁ గొంచెము విచారింపవలసియున్నది. 'లిపి' శబ్దము సంస్కృతమునకుఁ గ్రొత్తది కాదు. సంస్కృతమున 'లిప్' ధాతువుండ, నందుండి పుట్టిన 'లేపన' శబ్దం బుండ నందుండి పుట్టిన 'లిపి'పదము సంస్కృతము కాదనియు, ధాతువిరహితంబును, సందిగ్ధార్థంబు గలదియు నగు పురాతన పారసీకభాషలోని 'డిపి'నుండి వచ్చినదనియు వాదించుట సాహసము. పురాతనార్యులు పరభాషనుండి శబ్దములను గ్రహించియుండలే దని మా తాత్పర్యము కాదు. కాని యవన, పారసీకాదిశబ్దములను వారు గ్రహించినపుడు మీమాంసాది శాస్త్రకర్తలు వానిని ఏఱుదీసి చర్చించి చూపుచుండిరి. అట్లు ఈశబ్దము ఎచ్చటను విడిగాఁ జూపఁబడి యుంటలేదు. హిందువులు 'లిఖ్' ధాతురూపములనే వాడుచుండిరనియు, 'లిప్' ధాతురూపములు వాడలే దనియుఁ జెప్పుట తప్పు. అశోకుఁడు తాను స్థాపించినశాసనములను 'ధర్మలిపు' లని వాడెను. పాణిని కృత మగు అష్టాధ్యాయియందు[2] 'లిపి' శబ్దము కలదు (3-౨, ౨౧). శాకటా

1. Burnell's South Indian Paleography, P. 6.
2. చూడుడు : కుమారిలభట్టకృతమైన తంత్రవార్తికము.

యనవ్యాకరణమునందును ఈపద మున్నది (౧-౩, ౫౬; ౪-౩, ౧౩౨). కావున నివి యార్యులు క్రొత్తగాఁ బరులయొద్ద నేర్చిన వనుటకు వీలు లేదు. హిందువులు మొదట నక్షరములఁ జెక్కిరి గాని రంగుతో వ్రాయలే దనుటయు సమంజసము కాదు. ఏరికైనను మసితో నక్షరములను గోడలమీఁదఁగాని, ఆకులమీఁదఁ గాని, పలకలమీఁదఁ గాని వ్రాయుట సుకరము. రాలమీఁద, రాగిమీఁదఁ జెక్కుట సుకరము కాదు. అందఱకు సాధ్యముకాదు. లేఖ లెక్కుడుకాల ముండవలయు నన్న కోర్కె జనించినఁగాని శిలాదికములమీఁదఁ జెక్కుట సంభవింపదు. కావునఁ జెక్కుట యెప్పుడును సిరాతో వ్రాయుటకంటెఁ దరువాత వచ్చును. అందుచే నార్యు లక్షరములఁ జెక్కుట యెఱుంగుదురు గాని వ్రాయుట యెఱుంగ రనుట సృష్టిక్రమవిరుద్ధము; ఇదియుఁగాక ఆర్యు లక్షరములను రంగు(సిరా)తో వ్రాయుట యెఱుఁగరేని యక్షరములకు 'వర్ణము' లన్నపే రెట్లు వచ్చెను? 'వర్ణ' పద మీ యర్థమునందు వేదమందుఁగూడఁ గానవచ్చుచున్నది.

పారసీక 'డిపి' శబ్దము సంస్కృత 'లిపి' శబ్దమున నుండి పుట్టిన దని తద్భాషావిదులైన కోసోవిజ్ (Kossowicz), స్పైగెల్ (Spiegel) అనువారు వ్రాసినారు. దానిని కాదనుచు బర్నెల్ ఇట్లు వ్రాయుట కేవలము సాహసము.

*నాగరకతకు, లిపికిఁ గల సంబంధము*

లిపి నాగరకతను సూచించును. ఒకానొకదేశమందు లిపి కల దన్న నాదేశప్రజనులు కళాకౌశలములను గొంతవఱకు నేర్చి ప్రాథమికావస్థ దాఁటి యున్నతావస్థలో నున్నా రని యర్థము. అనాగరకులభాషకు లిపి యుండదు. మనదేశమందలి ఎఱుకు, కోయ, చెంచు, గోందు జాతులవారికి వేఱువేఱుభాష లున్నను, ఆభాషలను వ్రాయుటకు వారికి లిపులు లేవు; ఇట్లే స్వతంత్రలిపులు లేనట్టి యనాగరకజాతులవారు వేనవేలు మన భూగోళమందలి వేఱువేఱు ఖండములందుఁ గలరు. ఒకానొక జాతివారికి స్వతంత్రలిపి కల దనిన వారు ఉన్నతదశయం దుండినవా రనియు, ఒకానొకజాతివారికి లిపి లే దనిన వారు నికృష్టావస్థయం దున్నవా రనియు మనము నిర్భయముగ నిర్ధారణ చేసికొనవచ్చును.

సంఘము మిక్కిలి చిన్నదిగా నుండి, శైశవావస్థలో నున్నపు డందలిజను లందఱును సమీపస్థలముననే యుండుటయు, వర్తకము మొదలయినవి యేవియు లేకుండుటయు తటస్థించును. అందుచే వారికి వ్రాఁతతో నంతగాఁ బని యుండదు. సంఘ మభివృద్ధి యగుచు విశాలస్థలము నాక్రమించును. అప్పు డొకరియొద్దనుండి యొకరికి వార్తలు పంపునావశ్యకము కలుగును. వర్తక మభివృద్ధి యైనకొలఁది దిని లెక్కలు చేయుటయు, సరకు లిన్ని యమ్మితి ననియు ఇన్ని కొంటి ననియు లెక్క యుంచుటయుఁ దప్పనిసరి యగును. సంఘ మింకను బ్రబలినఁ బ్రజలవ్యవహారములు హెచ్చి, వారిలో వారు చేసికొనినయేర్పాటులు మరల వివాదము వచ్చినప్పుడు నిస్సంశయముగఁ దెలియుటకై వాని నేదో యొకరూపమున వ్రాసియుంచుట యావశ్యక మగును. రాజులకుఁ దమదిగ్విజయములను రాఁబోవుసంతతివారికిఁ దెల్పవలె నన్నబుద్ధియు, కవులకుఁ దమకావ్యములను శాశ్వతముగ నుండునట్లు చేయవలయునన్నయిచ్ఛయుఁ బొడమును. ఇట్టి మనోవ్యాపారముయొక్క ఫలమే అక్షరములు, లిపి.

*లిపియొక్క యుత్పత్తి*

లిపి యేదేశమునం దైనను ఒకదినములో సిద్ధమైనది కాదు. అందును మానవుల కక్షరసమామ్నాయము లభించుట కెన్నోయుగములు పట్టిన వనుటకు సందేహము లేదు. అక్షరలిపి చిత్రలిపినుండి పుట్టిన దని లిపిశాస్త్రజ్ఞులయభిప్రాయమై యున్నది. సృష్టిని జూచి దాని ననుసరించి బొమ్మలను వ్రాయఁబూనుట మానవులకు సహజమైనవిద్య. కావునఁ జిత్రవిద్య లిపివిద్యకంటెఁ బూర్వ ముండె ననుటకు సందేహము లేదు. కావున మానవుఁడు మొదటఁ జిత్రవిద్యనే తనమనోభావములను వ్యక్తము చేయుటకై వాడుట స్వాభావికము. పరోక్షమం దున్నవానికి 'మనుష్యుఁడు' అని తెలుపవలె నన్న మనుష్యునిబొమ్మ వ్రాసి పంపును. 'సూర్యుఁడు' అని తెలుపవలె నన్న సూర్యునిబొమ్మ వ్రాసి పంపును. ఇట్లు చిత్రరూపమున ననాగరకజాతులవారు తమమనోభావమును తెలుపుకొనుట దేశచరిత్రములవలన మనకుఁ దెలియుచున్నది. అమెరికాదేశమందలి పూర్వనివాసులైన యెఱ్ఱయిండియనులు తాము కొన్నవస్తువులకును, విక్రయించెడువస్తువులకును వృక్షములపట్టలమీఁదను చిత్రరూపమున లెక్క యుంచెదరు. లేడిబొమ్మ వ్రాసి నాలుగుగీట్లు గీచిన నాల్గులేడులను అమ్మినట్లు అర్థము. ఒకచిన్న సున్న చుట్టి దానిలో అడ్డగీటు గీచిన నది 'డాలర్' అనునాణెమునకు గుర్తు. నిలువుగీటు, అడ్డగీటు గీచిన పది 'సెంట్లు'కు గుర్తు. ఇట్లు ఆయాసరకులవెలగూడ చిత్రరూపమున నాయారణ్యకులు లిఖించి యుంచెదరు. డకోటా దేశమందలి జనులు చిత్రలేఖనముచే సంవత్సరమునందు జరగినవిశేషములు వ్రాసి యుంచెదరు. సంవత్సరమును సూచించుటకు నాయేఁడు జరగినగొప్పవిశేష మేదైన నున్నయెడల నావిశేషమును పటముగ వ్రాసి సూచించెదరు: అనఁగా నాయేఁడు సంపూర్ణ సూర్యగ్రహణము వచ్చినయెడల సూర్యుఁడు చీఁకటిలో మునిఁగినట్లు చూపుదురు. జలప్రళయమై లోకులు చచ్చినయెడల నాపటమును చూపెదరు. తమలో నొకఁడు చచ్చినాఁడని చూపవలె నన్న నల్లనినిలువుగీటు గీచెదరు. ఒకమానవప్రతిమను దింపి దానిమీఁద మచ్చలు మచ్చలుగ వ్రాసినయెడల నాయేఁడు ఆదేశమునందు మశూచకము విశేషముగ నుండె నని యర్థము.

చీనాదేశమువారిలిపి చూచినను చిత్రలేఖనము అక్షరలిపికి మూల మని చెప్పుటకు నిదర్శనములు కానవచ్చును. ఈ భాషలో

| | పూర్వపుగుర్తు | ఇప్పటిగుర్తు |
|---|---|---|
| సూర్యునకు | ⊙ | 日 |
| చంద్రునకు | ☽ |  |

